


ఈశాన్య చైనాలోని హెలాంగ్జియాంగ్ రాష్ట్రంలో ఏటా జరిగే అంతర్జాతీయ హిమోత్సవం సందర్భంగా వేల ఎకరాల్లో రకరకాల మంచు కళాఖండాలను నిర్మిస్తుంటారు. సమీపంలోని గడ్డకట్టిన సోంఘువా నది నుంచి మంచు తెచ్చి ఈ కళాఖండాల్ని సృష్టిస్తారు! నెలరోజులపాటు సాగే ఈ ఉత్సవాన్ని తిలకించేందుకు ఎనిమిది లక్షల మంది పర్యాటకులు వస్తారట.

# ముఖచిత్రంగా మీ ముఖారవిందం!




క్యూట్ క్యూట్ బేబీస్, యూత్‌ఫుల్ లేడీస్‌కు ప్రాధాన్యం
అందం, ఆకర్షణ, తగిన డ్రస్ సెన్స్ ఉంటే చాలు...
మీ అభిమాన విపుల / చతురకు
మీరే ముఖచిత్రం అవుతారు
చేయాల్సిందల్లా - పోస్ట్‌కార్డ్ సైజ్ క్లోజప్పులు రెండు,
అదేసైజ్ 3/4 ఫొటో ఒకటి వెంటనే మాకు పంపండి.
ఫొటోలు మెయిల్ కూడా చేయొచ్చు

**నోట్ :** ఫొటోల ఎంపికలో తుది నిర్ణయం సంపాదకులదే.
ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు, వాదవివాదాలకు చోటేలేదు.

- ఫొటోలు పంపేవారు విధిగా తమ మరియు తమ తల్లిదండ్రుల అంగీకార పత్రాలు పంపాలి.
- మీరు బాగున్నా, ఫొటోలు క్వాలిటీగా లేకుంటే మేమే ఫొటోగ్రాఫర్‌ని పంపుతాం.
- ప్రచురణ తర్వాత ఫొటోలు తిరిగి కావాలనుకునేవారు తగిన పోస్టేజిస్టాంప్‌లంటించిన స్వంత చిరునామాగల కవరును జతపరచాలి.

చిరునామా : సంపాదకులు, చతుర/విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 500082 ఈ మెయిల్ : vipula.chatura@eenadu.net
vipula.chatura@gmail.com









# మనసున ఉన్నదీ...



★ నటి మోనాల్ గజ్జర్ ముఖచిత్రంతో జూన్ 'చతుర' ఆకర్షణీయంగా ఉంది. 'హాజీ మురాద్' నవల ఒక వైవిధ్యమైన యుద్ధవీరుడి సాహస యాత్ర. ఒక రష్యన్ నవలను ముక్తవరం పార్థసారథి అనువాదం చేసి తెలుగులో మనకు అందించడం అభినందనీయం. టాల్‌స్టాయ్ వచనంలోని కవితాధోరణి తెలుసుకోగలిగాం. నవల ఆద్యంతం ఉత్కంఠగా సాగింది.

– *పక్కి బాలకృష్ణారావు,*
*గరివిడి, విజయనగరం జిల్లా*

★ హాజీమురాద్ నవల చదవడం చాలా కష్టమనిపించింది. రష్యన్ పేర్లను గుర్తుంచుకోవడం కష్టం కావడంతో మళ్లీమళ్లీ వెనక్కెళ్లి చదవాల్సి వచ్చింది. అనేక క్లిష్ట పరిస్థితులు ఎదుర్కొన్న హాజీమురాద్ మరణం చదువరులను కలచివేసింది.

– *జి.జి.కె. రావు, శ్రీకాకుళం*

★ జూన్ 'చతుర'లో ప్రముఖ రచయిత రావూరి భరద్వాజ జీవిత విశేషాలను 'జ్ఞానపీఠాలు' శీర్షిక ద్వారా అందించడం హర్షణీయం. సంపాదకులకు అభినందనలు. మిగతా శీర్షికలు, కథలు కూడా పాఠకుల్ని అలరించాయి.

– *యం.వి.ఎన్.ఎస్. శ్రీనివాసరావు,*
*నర్సీపట్నం, విశాఖజిల్లా*

★ జూన్ సంచికలో హాజీమురాద్ నవల, అసమాన సాహితీ మూర్ధన్యుడు డా. రావూరి భరద్వాజపై ప్రత్యేక కథనం, సరికొత్త శీర్షిక 'అక్షరధార', చతుర ప్ర.జ., చతురంగం, చతురకతలు.. అన్నీ చదువుతుంటే ముచ్చటేసింది. 'చతుర' ద్వారా తెలుగు సాహిత్యాన్ని బతికించేందుకు మీరు చేస్తున్న కృషికి అభినందనలు!

– *కాళహస్తి వెంకటశేషగిరి రావు,*
*నెల్లూరు*

★ జూన్ 'చతుర' నవల హాజీమురాద్ మాకెంతగానో నచ్చింది. ప్రపంచ సాహిత్యంలోనే మహోన్నత నవలాకారుడిగా పేరుగాంచిన టాల్‌స్టాయ్ చివరి నవలను తెలుగులో చదివే మహద్భాగ్యం కలిగించినందుకు సంపాదకులకు ధన్యవాదాలు.

– *రజని,*
*బెంగళూరు*

★ కాలాతీతంలో డి.హెచ్.లారెన్స్ నవల సన్స్ అండ్ లవర్స్ పరిచయం చదివి చాలా ఆనందించాను. టాల్‌స్టాయ్ ఆఖరి నవల 'హాజీమురాద్'ను 'చతుర'లో చూసుకుని మురిసిపోయాను. ఆనాటి రష్యాలో రాచరికం ఎలా ఉండేదో, తమ అస్తిత్వంకోసం వివిధ జాతులకు చెందిన యోధులు చక్రవర్తులతో చివరి శ్వాసవరకు ఎలా పోరాడేవారో ఈ నవల ద్వారా తెలుసుకున్నాం. అబ్బూరి చతురోక్తులు కూడా బాగా చదివించాయి.

– *రామశంకర్,*
*గుంటూరు*

★ జూన్ 'చతుర'లో టాల్‌స్టాయ్ అనువాద నవల 'హాజీమురాద్' బాగుంది. 'చూడు చూడు నీడను!' అనే కథ కూడా చాలా నచ్చింది. జ్యోతిష్యంలోని 'ఛాయాదర్శనం' గురించి ఈ కథలో తెలుసుకున్నాం. 'జ్ఞానపీఠాలు' ముగింపు సందర్భంగా 'రావూరి భరద్వాజ' గురించి రాయడం సందర్భోచితంగా ఉంది. భరద్వాజ వ్యక్తిగతంగా మా కుటుంబానికి దగ్గర స్నేహం ఉన్నవారు. మా బావగార్లు మంచాళ జగన్నాథరావు, వాడ్రేవు పురుషోత్తం ఆలిండియా రేడియోలో భరద్వాజ సహోద్యోగులు. మా పెద్దబావగారు 1986లో మరణించేదాకా రావూరివారు మా ఇంటికి బాగా వచ్చేవారు. ఆయన రచనల్ని మా చిన్నబావ పురుషోత్తంగారు ఆంగ్లంలోకి అనువదించారు. వారి గురించి కూడా వ్యాసంలో ప్రస్తావిస్తే బాగుండేదనిపించింది.

– *మంచాళ శ్రీలక్ష్మి,*
*విశాఖపట్నం*

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com
vipula.chatura@eenadu.net

సంపుటి -36 సంచిక - 6
426వ సంచిక, పేజీలు : 132
జులై 2013

# చతుర





పుస్తకాలంకరణ : రాజు యాట

**అ**తని దృష్టిలో భార్యంటే సేవకురాలు. కేవలం తన అవసరాలను తీర్చే మానవయంత్రం! అందుకే కాబోలు తానడిగిన గుత్తి వంకాయకూర వండలేదని భార్యను ఆవేశంగా ఇంట్లోంచి గెంటేశాడు. ఎంత ఆవేశం అంటే - ఆమెను వీధిలోకి నెట్టి ఇంటి తాళంచెవులు జేబులో వేసుకుని హైదరాబాద్ వెళ్లిపోయేంత! భర్తగారి నిర్వాకంతో వీధి పాలైన ఆ ఇల్లాలు ఎవరు? ఆ పరిస్థితుల్లో ఆమెను ఎవరు ఆదుకున్నారు? ఆద్యంతం ఉత్కంఠగా చదివించే

**జి. ఉమాపతి** నవల **శశి**

6వ పేజీలో...

బొమ్మలు : రాకేశ్

తుపాను ముందు ప్రశాంతతలా ఆ ఇల్లు నిశ్శబ్దంగా ఉంది. ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ భుజంగరావు గొంతు ఖంగుమంది.

"పాఠాలు చెప్పిన మాస్టార్ని ప్రేమించావా? ఒంటిపై తెలివితోనే మాట్లాడుతున్నావా?" అంటూ తన కూతురు శశిని నిలదీశాడాయన.

"అయినా పోయిపోయి పెళ్లయిన సార్‌ని ప్రేమించడం ఏంటి?" అంది తల్లి ఆగ్రహంగా.

"పెళ్లయిన మగాడికి ఉంపుడుకత్తెలా ఉంటావా ఏంటే? ఖర్మ!" తలకొట్టుకుంది అక్క.

ప్రేమ పేరుతో వాస్తవికతకు నీళ్లువదులుతున్న నేటి యువత అర్థంలేని ఆకాంక్షలకు అక్షరరూపం జి. ఉమాపతి నవల శశి జులై చతుర కానుక!



ఆ రోజు ఆదివారం. ఉదయం పది గంటలు. వైదేహి తన ఆక్టివా స్కూటర్‌లో శశివాళ్లింటికి వచ్చింది.

"హాయ్! శశీ.. హల్లో ఆంటీ! హల్లో అంకుల్!" అంటూ శశిని, ఆమెతల్లి రోహిణిని, నాన్న భుజంగరావును పలకరిస్తూ హాల్లోకి వచ్చింది.

ఇంతలో శశి అక్క నాగమల్లిక హాల్లోకి రాగానే "హాయ్ నాగీ!" అంటూ పలకరించింది.

"వీళ్ళేరీ, ఇంకా రాలేదా? " కుతూహలంగా శశిని అడిగింది.

"సోఫాలో కూర్చో! వాళ్ళు కూడ వచ్చే టైం అయింది" అంది శశి.

ఇంతలో చంద్రిక, విజయ కూడా వచ్చారు.

శశి, చంద్రిక, విజయ, వైదేహి క్లాస్ మేట్స్. ప్రాణ స్నేహితురాళ్లు. ప్రతి ఆదివారం అందరూ శశిఇంట్లో కలుస్తుంటారు. క్యారమ్స్, చెస్, అంత్యాక్షరి ఇలా వాళ్ళకు తోచిన విధంగా ఆడుతూ కాలక్షేపం చేస్తుంటారు.

శశి క్యారంబోర్డును హాల్లోకి తీసుకొచ్చి పెట్టింది.

నాగమల్లిక కాయిన్స్ డబ్బాను తెచ్చింది. కుర్చీలను కూడా సర్దేశారు.

ఎప్పుడూ శశి, చంద్రిక ఒక జట్టుగా, విజయ, వైదేహి ఇంకొక జట్టుగా ఆడుతూ వుంటారు. ప్రతిసారి శశి, చంద్రికలే గెలుస్తుంటారు.

"ఈసారి జట్లు మారుద్దాం" అంది వైదేహి.

"నేనొప్పుకోను!" అంది చంద్రిక మొండికేస్తూ.

"సరే! ఇట్లాగే ఆడదాం" అంది వైదేహి. క్యారమ్స్ ఆట మొదలుపెట్టారు.

కాసేపటికి విజయ "ఈరోజు మధ్యాహ్నం మ్యాట్నీకి వెళ్దామే!" అంటూ ఒక ప్రపోజల్ పెట్టింది.

"ఔను! వెళ్దాం" సమర్థిస్తూ మాట్లాడింది వైదేహి. అందరూ ఒప్పుకున్నారు.

"అక్కా! నీవు కూడా రావాలి" నాగమల్లిక వైపు చూస్తూ అంది చంద్రిక.

"అక్క కూడా మనతో వస్తుందిలే!" భరోసా ఇచ్చింది శశి.

"అంకుల్! మేమందరం మ్యాట్నీకి వెళ్తున్నాం. మీరు పర్మిషన్ ఇవ్వాలి" అంది వైదేహి భుజంగరావుతో.

"అలాగే, వెళ్లండి" అన్నాడు భుజంగరావు నవ్వుతూ.

"అయితే అందరికీ మధ్యాహ్నం భోజనాలు మా యింట్లోనే" ఆర్డర్ జారీ చేసింది శశి.

"వద్దులే! మా యిళ్లు ఈ వీధిలోనే వున్నాయి గదా! మేము ఇంటికెళ్ళి భోంచేసి వస్తాం! వైదేహి ఇల్లు దూరంగా వుంది గదా! అందుకని దానికి మాత్రం భోజనం పెట్టు!" అన్నారు విజయ, చంద్రిక.

"అలాగే. అమ్మా! ఈ రోజు వైదేహి మన స్పెషల్ గెస్ట్!" అంటూ తల్లి రోహిణికి చెప్పింది శశి.

ఈ సంభాషణంతా హాల్లో సోఫాలో కూర్చొని వింటూన్న రోహిణి, "సరే! త్వరగానే వంట చేస్తాలే" అంది.

"అయితే మీ అమ్మకు ఫోన్ చేయవే! ఈరోజు మధ్యాహ్నం మాయింట్లోనే భోంచేస్తున్నావని, మ్యాట్నీకి కూడా పోతున్నామని" అంది శశి.

వైదేహి వెంటనే మొబైల్ ఫోన్‌లో మాట్లాడింది.

"అమ్మా! ఈ రోజు మధ్యాహ్నం శశి ఇంట్లోనే నేను భోంచేస్తున్నాను. తర్వాత అందరం మ్యాట్నీకి వెళ్తున్నాం. మ్యాట్నీ అయిన తర్వాత ఇంటికి వస్తాను" అని చెప్పి పర్మిషన్ తీసుకుంది.

అందరూ భోజనాలు ముగించాక మధ్యాహ్నం రెండు గంటలకు మ్యాట్నీ చూడడానికి బయలుదేరారు.

దాదాపు రెండున్నర గంటలైన తర్వాత మ్యాట్నీషో అయిపోయింది. అందరూ శశి ఇంటికి చేరుకున్నారు.

"రండే! వేడి వేడి కాఫీ తాగి కాసేపు కూర్చొని వెళ్దురు!" అంటూ లోపలికి ఆహ్వానించింది శశి.

"కాఫీతో బాటు ఏవన్నా స్నాక్స్ వున్నాయా? " అడిగింది చంద్రిక.

చంద్రికకు శశి దగ్గర చనువెక్కువ.

"ఉన్నాయి! హాయిగా కాసేపు టైం పాస వుతుంది, రండి" ఈసారి నాగమల్లిక ఆహ్వానించింది.

ఇంట్లో అందరూ శశి గదిలోకి వెళ్ళారు.

నాగమల్లిక స్నాక్స్, కాఫీ తీసుకొని రావ డానికి వంటింట్లోకి వెళ్ళింది.

"నీకు హీరో నచ్చాడా? హీరోయిన్ న చ్చిందా? " శశిని అడిగింది చంద్రిక.

"నాకు హీరోయిన్ నచ్చింది. బాగా చేసింది" అంది శశి.

"నాకు హీరో నచ్చాడు" అంది వైదేహి.

"ఏం సినిమానే ఇది? అంతా ఫైట్స్, డ్యాన్సులు, సౌండ్ పొల్యూషన్! ఇవి తప్ప ఏముంది ఇందులో? పైగా సినిమా టైటిల్ ఏమో త్రివేణిసంగమం. టైటిల్ కు, సినిమాకు ఎలాంటి సంబంధం లేదు. నాకేమీ నచ్చలేదు" అని నిక్కచ్చిగా చెప్పింది విజయ.

"అంతేలేమ్మా! ఇప్పుడు వచ్చే సినిమాలన్నీ అట్లాగే వుంటాయి. మనకు నచ్చిన అంశాలను మనం వెదుక్కోవలసిందే!" అంది చంద్రిక.

ఇలా ఎవరి అభిప్రాయాలు వాళ్ళు చెప్పుకుంటూ సినిమాని కాసేపు పోస్టుమార్టం చేశాక, నాగమల్లిక తెచ్చిన స్నాక్స్, కాఫీ ఆరగించి ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.

★ ★ ★

భుజంగరావు, రోహిణి దంపతులకు ముగ్గురు కూతుళ్లు. పెద్ద కూతురు నాగ మల్లిక, రెండవది మంజుల, మూడవ కూతురు శశి. భుజంగరావు రెవిన్యూ డిపార్టుమెంటులో సూపరింటెండెంట్ గా రిటైరయ్యాడు. పైఅధికారులన్నా క్రింది సబార్డినేట్లన్నా భయపడే మనిషి. కారణం వ్యవస్థలో వున్న ధనం. పరువు ప్రతిష్ట లకు, గౌరవ మర్యాదలకు పెద్దపీట వేస్తాడు. ఒకరకంగా చెప్పాలంటే ఆ డిపా ర్టుమెంటులో అతనే అనర్హుడు. మిగతా సిబ్బందికి తన వ్యవహారశైలి నచ్చకున్నా తన సిద్ధాంతాల్ని ఇతరులమీదికి రుద్దడు కాబట్టి సహించి గౌరవిస్తారు.

రోహిణి భుజంగరావుకు చేదోడువాదో డుగా వుంటుంది. మధ్యతరగతి కుటుంబాన్ని ఎలా నడిపించాలో తెలిసిన వ్యక్తి.

పెద్దకూతురు నాగమల్లిక చాలా సౌమ్య గుణమున్న మనిషి. సన్నగా నాజూకుగా వుంటుంది. ఇంటి వ్యవహారాల్లో అమ్మకు సహాయపడుతూ వుంటుంది. బీఏ చదివింది.

'ఏదైనా ఉద్యోగం చేయకూడదా? ' అని భుజంగరావు అడిగాడు. 'కానీ! చూద్దాం!' అని అంది. ఇంతలో సంబంధాలు వచ్చాయి. మొదటి సంబంధమే 'క్లిక్' అయింది. అబ్బాయి పేరు రమేష్. చామనఛాయ, పొడవుగా వుంటాడు. ఎం.కాం. చేశాడు. ఒక ప్రైవేట్ కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు.

రమేష్ తల్లిదండ్రులు శ్రీహరి, లత పెద్దగా కట్నం ఆశించకపోయినా నాగమల్లిక వివాహం ఘనంగా చేశాడు భుజంగరావు.

నాగమల్లిక అత్తవారింటికెళ్ళింది. ఒక

కొడుకు పుట్టాడు. రోహిత్ అని పేరు పెట్టారు. అల్లారుముద్దుగా పెంచుకుంటు న్నారు. అత్తామామలకు మొదటి మన వడు! వారి సంతోషానికి అవధుల్లేవు. కానీ దురదృష్టవశాత్తు రోహిత్ పదేళ్ల వయసప్పుడు రమేష్ బస్ ఏక్సిడెంటులో చనిపోయాడు. సుఖంగా జీవనం సాగిపోయే ఆ ఇంట్లో అంధకారమలముకుంది. నాగమల్లికకు ప్రపంచమంతా శూన్యంగా కనిపించింది. అత్తవారింట్లో వుండలేకపోయింది. కొడుకుతోబాటు పుట్టింటికి వచ్చింది. అమ్మానాన్నలు శాయశక్తులా ఓదార్చారు. క్రమంగా షాక్ నుండి కోలుకుంది. ఇప్పుడు నాగమల్లిక ప్రపంచమంతా రోహితే. ఉన్న ఒక్కగానొక్క కొడుకును తన దగ్గరుంచుకుంటే గారాబం చేస్తాననే భయంతో మనసు చంపుకొని హైదరాబాద్ హాస్టల్లో పెట్టి చదివిస్తోంది. పైగా అమ్మానాన్నల ఆరోగ్యం అంత బాగాలేదు. నాన్నకు ఆస్మా, అమ్మకు కీళ్ళనొప్పులు. వాళ్ళను చూసుకోవాలనే ఉద్దేశ్యంతో పుట్టినింటిలో వుండిపోయింది. అత్తామామలు ఎంత పిలిచినా వెళ్ళలేదు. కారణం రమేష్ జ్ఞాపకాలు వెంటాడుతాయనే. అది ఆమె భరించలేదు. వాళ్లు కూడా నాగమల్లిక పరిస్థితిని చూసి ఏమీ మాట్లాడలేకపోయారు.

రెండో కూతురు మంజుల పొట్టిగా, బొద్దుగా వుంటుంది. మాటలు కాస్త కటువుగా వుంటాయి. అనుకున్నది సాధించాలనే పట్టుదల వున్న మనిషి. ఇంటి, బయటి సమస్యలు చాకచక్యంగా పరిష్కరించే నేర్పరితనముంది తనకు. భుజంగరావు-రోహిణిలకు కొడుకులాంటి కూతురు. బి.సి.ఎ. చదివింది. ఎం.సి.ఎ. చేద్దామనుకుంది. భుజంగరావుకు నాగమల్లిక పెండ్లి సందర్భంగా ఆర్థిక స్థోమత కాస్త కుంటుపడింది. తన రిటైర్మెంటు బెనిఫిట్లలో కొంత వాడుకొని నాగమల్లిక పెండ్లి చేశాడు.

ఆ విషయం మంజులకు తెలుసు. పైగా తన పెండ్లి, చెల్లెలి పెండ్లి జరగాలి. అందుకే ఎం.సి.ఎ. చదివే ఆలోచనను వాయిదా వేద్దామనుకుంది.

మంజులకు పెండ్లి సంబంధాల వేటలో పడ్డాడు భుజంగరావు. కొన్ని సంబంధాలు వచ్చాయి. కాని ఏదో ఒక వంకతో అవి నిలిచిపోయాయి.

భుజంగరావు క్రమేణ నిరుత్సాహపడుతూ వచ్చాడు. ప్రతి చిన్న విషయానికి చిరాకు పడ్తున్నాడు. రోహిణి, మంజుల అది గమనించారు. భుజంగరావుకు ధైర్యం చెప్పారు. మంజుల ఏ మాత్రం అధైర్యపడలేదు. రోహిణి భర్తకు ధైర్యం చెప్తోందే కాని గుండెలో ఏదో ఒక మూల ఒక రకమైన ఆందోళన. 'కల్యాణం వచ్చినా, కక్కు వచ్చినా ఆగదు' అని సర్ది చెప్పుకుంటు న్నారు ఆ దంపతులు. వేట సాగుతూనే వుంది.

భుజంగరావు ఆప్తమిత్రుడు కోటేశ్వరరావు. మంచి ఆస్తిపరుడు. ఇద్దరు కొడుకులు. ఇద్దరూ అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు. భుజంగరావు ఇంటికి తరచూ వస్తూవుంటాడు. కోటేశ్వరరావు కూడా మంజులకు కొన్ని సంబంధాలు చూశాడు కాని కుదరలేదు.

ఒకరోజు కోటేశ్వరరావు తన స్నేహితుడు రాఘవయ్యను ఏదో సందర్భంగా కలిశాడు. రాఘవయ్యకు ఒకడే కొడుకు. పేరు సంతోష్. ఎం.సి.ఎ. చేశాడు. హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. మాటల సందర్భంలో భుజంగరావు కూతురు మంజుల గురించి రాఘవయ్యకు చెప్పాడు కోటేశ్వరరావు. ఇద్దరూ కలిసి భుజంగరావు ఇంటికి వెళ్ళారు. రాఘవయ్య మంజులను చూశాడు. ముగ్గురూ కలిసి కొంతసేపు పిచ్చాపాటి మాట్లాడుకున్నాక రాఘవయ్య భుజంగరావుతో వీలుచూసుకు

# అభినందన చందనం!

## మూడున్నర దశాబ్దాల ప్రస్థానం

మా సపత్రికలకు మకుటాయమానంగా భాసిల్లుతూ మూడున్నర దశాబ్దాలుగా నిరుపమాన పాఠకాదరణతో నడుస్తున్న పత్రికలు 'చతుర', 'విపుల'. వీటి ప్రథమ సంపాదకులు చలసాని ప్రసాదరావు సాహిత్య మౌనమేధావి, చతుర వచోనిధి, మేటి రచయిత! సామాజిక విజ్ఞానఖని రామోజీరావుగారు, చలసానివారి సంయుక్త ఆలోచనలతో ఆవిర్భవించిన ఈ పత్రికలు 2013 జూన్ నాటికి 425 సంచికల్ని ప్రతి నెలా క్రమం తప్పక అభంగతరంగాలుగా వెలువరించాయి. ఇదో ప్రత్యేక ప్రమాణం!

దేశ రాజకీయ, సామాజిక పరిస్థితుల్ని, పట్టణ, గ్రామీణవాసుల జీవన విధానాల్ని, నైసర్గిక పరిస్థితుల్ని కళ్లకు కట్టినట్లు చిత్రిస్తూ రాసిన ఎన్నో సందేశాత్మక నవలల్ని 'చతుర' అందించింది.

'వాక్యం రసాత్మకం కావ్యం' అన్నారు పండితులు. రసాత్మకంగా రాస్తే నవల కూడా వచన కావ్యం అవుతుంది. అలాంటి నవలలు 'చతుర'లో ప్రచురితమయ్యాయి.

ఈ జంట పత్రికలు వసుంధరా పబ్లికేషన్స్‌కి రెండు కళ్లు! 'చతుర' భారతీయ సామాజిక సంస్కృతీదర్శిని! 'విపుల' విశ్వ సమాజ సంస్కృతీదర్శిని! ముచ్చటగొలిపే ముఖచిత్రాలతో ఈ పత్రికలు ప్రతినెలా ఒకటో తేదీన మార్కెట్‌లో శుభోదయం చెబుతాయి. వీటి ప్రస్థానం ఇలాగే నిరాటంకంగా సాగాలని అందరం మనసారా కోరుకుందాం!

– *పారుపల్లి వెంకటేశ్వరరావు,*
నల్లకుంట, హైదరాబాద్

# ప్రతిభకే పట్టం!

'విపుల'లో కథ, చతురలో 'నవల' ప్రచురితమవ్వాలని ప్రతి రచయితా కాంక్షిస్తాడు. ఆకాంక్షిస్తాడు కారణం తద్వారా వారికి బహుళ ప్రచారం వస్తుందని.

సాహితీ వినీలాకాశంలో 'ఈనాడు' ప్రచురణలకు ఉన్న పేరు ప్రఖ్యాతులు అనన్యసామాన్యం. ప్రతిభకు పట్టం కట్టడం 'చతుర' ప్రారంభం నుండీ ఆచరిస్తోంది. బుల్లికథ ప్రచురించినా కాంప్లిమెంటరీ కాపీ పంపడం, వెనువెంటనే పారితోషికం పంపడం 'చతుర'కే చెల్లింది.

పత్రికలకు పంపుతున్న తమ రచనలు ఏమౌతున్నాయో తెలియని సందిగ్ధంలో ఉన్న నాలాంటి రచయితలకు, 'చతుర'కు ప్రచురణార్థం రచనలు పంపితే, నెల లోపుగా ఎంపికైనదీ లేనిదీ తెలియజేయడం నేను గమనించిన ముఖ్య విశేషం. రచయితలను సముచితంగా గౌరవిస్తున్న ఈ పత్రికకు నమోవాకాలు.

నా ముప్ఫైనాలు సంవత్సరాల సాహితీ జీవనంలోని విజయాలకు 'చతుర' పత్రిక కూడా తోడయినందుకు కృతజ్ఞతాభివందనాలు!

ఎంతో నిబద్ధతతో రామోజీరావుగారు తమ పత్రికలను వెలువరించడం వలననే అతి తక్కువ కాలంలోనే అన్ని పత్రికలూ నెంబర్‌వన్ స్థాయికి ఎదిగాయి. 'చతుర' వందేళ్లూ పూర్తి చేసుకుని దిగ్విజయపథంలో కొనసాగాలని నేను హృదయపూర్వకంగా కోరుకుంటున్నాను.

– కె.బి. కృష్ణ,
కాకినాడ

ని త్వరలోనే తన కొడుకుని తీసుకుని వస్తానని చెప్పి వెళ్ళాడు.

రాఘవయ్య, ఆయన భార్య సుమతి, కొడుకు సంతోష్ పెళ్లి చూపులకు భుజంగ రావు ఇంటికి వచ్చారు. కోటేశ్వరరావు కూడా వచ్చాడు. సంతోష్‌కు మంజుల నచ్చింది. జాతకాలు కూడా కుదిరాయి. నిశ్చితార్థం పెట్టుకుందామనుకున్నారు. రాఘవయ్య, సుమతి, సంతోష్‌లు ఇంటికి వెళ్ళారు.

భుజంగరావు కోటేశ్వరరావుకు కృతజ్ఞత లు చెప్పాడు.

"ఏముందిలేరా! మంజుల అదృష్టం. మంచి సంబంధం కుదిరింది" అన్నాడు కోటేశ్వరరావు.

## కొత్తగాలి...

**కవులు రాసేది**
**ఊహాత్మకంగా**
**నాయకులు చేసేది**
**వ్యూహాత్మకంగా**

- మాధవీసనారా,
అనకాపల్లి

వారం రోజులు గడిచాయి. భుజంగరా వుకు రాఘవయ్య నుండి ఫోన్ వచ్చింది. భుజంగరావు స్థోమతకు మించి కట్నం అడిగాడు. దిగ్భ్రాంతికి గురైన భుజంగ రావు ఈ విషయం కోటేశ్వరరావుకు చెప్పాడు. ఆయన కూడా బాధపడ్డాడు. "రాఘవయ్య ఇలా చేస్తాడనుకోలేదురా" అన్నాడు. నిజానికి కోటేశ్వరరావుకు రాఘ వయ్య మీద కోపం కూడా వచ్చింది. "సరే! నేను చూసుకుంటానులే. నువ్వేం బాధపడకు" అని ఇంటికెళ్లిన కోటేశ్వర రావు అన్నాడు. తర్వాత రాఘవయ్యకు ఫోన్ చేసి చీవాట్లు పెట్టాడు.

"వాళ్ళది మంచి కుటుంబం. అందుకనే నీ కొడుకుకు చేసుకోమని సలహా ఇచ్చాను. భుజంగరావు నాకు చాలా కావలసిన వాడు. నువ్వు ఇలా కట్నం ఎక్కువ అడిగితే ఏం బాగుంటుంది? కట్నంకన్నా కుటుంబ గౌరవం, నేపథ్యం ముఖ్యం కదా! ప్రపంచాన్నంతా డబ్బుతో చూడకూడదు!" అని చెప్పాడు.

రాఘవయ్య కొంచెం తగ్గాడు. "సరే! కట్నంలో యాభైవేలు తగ్గిస్తున్నాను. ఆ మాట భుజంగరావుకు చెప్పు!" అని అన్నాడు.

భుజంగరావుకు కోటేశ్వరరావు ఈ విషయం చెప్పాడు. అయినా భుజంగరావుకు కష్టమే. "సరేలేరా! డబ్బులు నీకు నేను సర్దుబాటు చేస్తాను. నిదానంగా తీరుద్దువులే!" అని అన్నాడు కోటేశ్వరరావు.

మంజుల, సంతోష్‌ల పెండ్లి జరిగింది. అత్తామామలు, భర్త సంతోష్‌తో మంజుల హైదరాబాద్ వెళ్ళిపోయింది. డబ్బు విషయంలో రాఘవయ్య కొంచెం కక్కుర్తి పడ్డాడు కాని మిగతా విషయాలలో సరదాగా, హుందాగా వుంటాడు. హైదరాబాద్‌లో 'సిద్ధార్థ కంప్యూటర్ ప్రోగ్రామింగ్ అండ్ డిజైనింగ్' అనే ప్రైవేటు కంపెనీలో సంతోష్ ఉద్యోగం చేస్తున్నాడు. పొద్దున తొమ్మిది గంటలకు వెళ్తే సాయంత్రం ఎనిమిదింటికి తిరిగి వస్తాడు.

హైదరాబాద్ మంజులకు కొత్త ప్రదేశం. భర్త, అత్తామామల మనస్తత్వాలు కూడా ఇంకా సరిగ్గా తెలియని పరిస్థితి. పెళ్లయిన కొత్తలో ప్రతి స్త్రీ మెట్టినింట్లో ఎదుర్కొనే నూతన వాతావరణం కొంచెం భయంగా, కొంచెం దైన్యంగా, కొంచెం మధురంగా వుండటం సహజం.

★ ★ ★

"ఏమండీ! మంజుల మన సంతోష్‌కు

సరియైన జోడీయేనా? " భర్తను అడిగింది సుమతి.

"పెండ్లయిన తర్వాత ఇప్పుడు అడుగుతున్నావా ఈ ప్రశ్న? పెండ్లికి ముందరనే తెలుసుకోవాలిగదా? నీకు అలాంటి అనుమానమేమీ అక్కర్లేదు. నేను బాగా ఆరా తీసే ఈ పెండ్లికి ఒప్పుకున్నాను" అన్నాడు రాఘవయ్య.

"ఏమోనండీ! ఒక్కగానొక్క కొడుకు. వాణ్ణి బాగా చూసుకుంటే చాలు" సహజ సిద్ధమైన భయం వెలిబుచ్చింది సుమతి.

"వాణ్ణి ఆ పిల్ల సరిగా చూసుకోవడమే కాదు, పరాయింటి నుండి వచ్చిన ఆ పిల్లనూ మనం కూడా సరిగా చూసుకోవాలి గదా!" అన్నాడు రాఘవయ్య.

దాదాపు మూడు నెలలు గడిచాయి. మంజుల భర్తకు, అత్తామామలకు ఎలాంటి లోటు రానీయకుండా అన్ని పనులు చేసుకుంటూ పోతుంది. అత్తామామలు కూడ చాలా సంబరపడిపోతున్నారు. రాఘవయ్యకు మాత్రం ఒక వ్యసనం వుంది... చెయిన్ స్మోకింగ్!

"మామయ్యా! మీరు ఇలా స్మోకింగ్ చేస్తూవుంటే ఆరోగ్యం పాడవుతుంది. కాస్త జాగ్రత్తగా వుండాలి!" అంటూ మంజుల రాఘవయ్యను హెచ్చరించింది.

"అలా చెప్పమ్మా! చెప్పి చెప్పి విసుగొచ్చింది నాకు. నీవైనా ఈయన్ను ఈ వ్యసనం నుండి మాన్పించమ్మా!" ఆవేదనతో అంది సుమతి.

రాఘవయ్య అప్పుడప్పుడు పొరలు పొరలుగా దగ్గడం కూడా గమనించింది మంజుల.

సాయంత్రం ఎనిమిది గంటలకు సంతోష్ ఇంటికి వచ్చాడు.

సంతోష్ మంజులతో చాలా సరదాగా వుంటాడు.

"ఏమోయ్! నాదొక కోరిక. తీరుస్తావా? " అడిగాడు సంతోష్ మంజులను.

"ఏమిటో చెప్పండి!"

"ఏమీ లేదు! నీవు బి.సి.ఎ. చేశావు గదా! నాలాగ ఎం.సి.ఎ. చేయవచ్చుగా? తర్వాత మంచి ఉద్యోగం కూడా చేయవచ్చు" తన మనసులోని మాట బయట పెట్టాడు సంతోష్.

"నిజమే! చేయవచ్చు! కాని ఇంటిపనులు ఎవరు చేస్తారు? మామయ్య ఆరోగ్యం కూడా చూసుకోవాలి గదా!" బాధ్యతాయుతంగా మాట్లాడింది మంజుల.

"నాన్నా! మంజుల ఎం.సి.ఎ. చేస్తే బావుంటుంది గదా? " తండ్రిని అడిగాడు సంతోష్.

"ఔనమ్మా! నువ్వు కూడా ఎం.సి.ఎ. చేస్తే బావుంటుంది. ఏదో ఒక ఉద్యోగం చేసుకోవచ్చుగా!" అన్నాడు రాఘవయ్య కూడా.

అత్తయ్యకు ఇంటిపనుల్లో తోడుగా వుందామనుకుంది గాని భర్త పట్టుబట్టడంతో పైచదువు చదవడానికే ఒప్పుకుంది. ఒక ప్రైవేట్ కాలేజీలో ఎం.సి.ఎ. కోర్సులో చేరింది మంజుల.

ఇలా రోజులు గడుస్తుండగా ఓ రోజు రాఘవయ్యకు దగ్గు ఎక్కువై మంచం మీదనే పడుకొని వుండడాన్ని గమనించి మంజుల "ఏం మామయ్యా! ఒంట్లో బాగోలేదా? అలా పడుకొనే వున్నారు" అని అడిగింది.

"ఔనమ్మా! కొంచెం ఒంట్లో నలతగా వుంది. ఏం ఫర్వాలేదు. కాసేపయ్యాక కుదుటపడ్తుందిలే" అన్నాడు రాఘవయ్య.

సాయంత్రం సంతోష్ ఇంటికి వచ్చాడు.

"ఏమండీ! మామయ్య ఈ రోజు పొద్దున్నించి ఒంట్లో బాగాలేక పడుకునే వున్నారు. డాక్టరుకు చూపిద్దామండీ" కాస్త ఆందోళనగా అంది మంజుల.

"సరే, చూపిద్దాం!" అన్నాడతను.

ఇద్దరూ రాఘవయ్యను అపోలో ఆస్పత్రికి తీసుకెళ్ళారు.

డాక్టర్లు పరీక్షించి బయాప్సి చేయించాలని చెప్పారు. మందులు రాసిచ్చి వాడుతూ వుండండి అని చెప్పారు.

"ఏం నాన్నా! డాక్టర్లు ఏం చెప్పారు? " ఆస్పత్రినుండి ఇంటికి రాగానే ఆత్రుతగా కొడుకును అడిగింది సుమతి.

"ఏం లేదమ్మా! మందులు రాసిచ్చారు. అవి వాడితే తగ్గుతుందన్నారు" మనసులో కాస్త ఆందోళన వున్నా కప్పిపుచ్చుతూ జవాబిచ్చాడు సంతోష్.

కొన్ని రోజుల తర్వాత రిపోర్ట్ వచ్చింది. రాఘవయ్యకు ఊపిరితిత్తుల క్యాన్సర్ అని తేలింది. రెండవ దశలోనే వుంది కాబట్టి తగిన జాగ్రత్తలు తీసుకోవాలని, సరియైన మందులు సమయానుకూలంగా వాడాలని, పొగతాగడం పూర్తిగా మానేయాలని, ఇంటి వాతావరణాన్ని పరిశుభ్రంగా వుంచాలని ఇలా ఎన్నో జాగ్రత్తలు చెప్పారు డాక్టర్లు.

అంతే! కుప్పకూలింది సుమతి. సంతోష్ కూడా గాభరా పడ్డాడు.

"ఏమండీ! మీరేం అధైర్యపడకండి. నేనొకమాట చెప్తాను, వింటారా? " భర్తను అడిగింది మంజుల.

"ఏమిటి? చెప్పు!"

"ఇప్పటి పరిస్థితుల్లో మామయ్యను దగ్గరుండి చూసుకోవాలి. మీరు ఆఫీసుకు వెళ్తూవుంటారు. అత్తయ్యకు ఈ మందుల వ్యవహారం అంతగా తెలీదు. అందుకని నేను ఇంటిపట్టునే వుండి మామయ్యకు మందులు అవీ అందిస్తుంటాను. పైగా నేను ఒట్టి మనిషిని కూడా కాదు. మనకు ఎన్ని కోరికలు వున్నా పరిస్థితులు అనుకూలించవు గదా! అందుకని చదువును ఆపేస్తేనే మేలనిపిస్తోంది. మీరేమంటారు? " అడిగింది మంజుల.

సంతోష్ కాసేపు దీర్ఘంగా ఆలోచించాక "సరే! నీ ఇష్టం" అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఇలా మంజుల మామయ్యను కంటికి రెప్పలా చూసుకొంటోంది. దాదాపు ఒక సంవత్సరానికల్లా రాఘవయ్య బాగా కోలుకున్నాడు. క్యాన్సర్‌కు సంబంధించిన ఆనవాళ్ళు పూర్తిగా కనుమరుగయ్యేసరికి వారి ఆనందం వర్ణనాతీతం!... అంతే కాదు. ఆ కుటుంబంలో కొత్త చేరిక! అనిరుధ్ పుట్టాడు. ఇంకొక రెండేండ్లకు రమ్య కూడా పుట్టింది. ఇప్పుడు పిల్లల పెంపకంలో పుట్టినింటికి కూడా పోయే తీరిక లేకుండా వుండిపోయింది మంజుల.

★ ★ ★

భుజంగరావు మూడో కూతురు శశి చందనపు బొమ్మలా వుంటుంది. పసిడి రంగు, పెద్ద కళ్ళు, నల్లని జుత్తు. ముగ్గురు కూతుళ్లలో శశి అందంగా వుంటుంది. అమ్మనాన్నలకే కాదు, నాగమల్లిక, మంజులకు కూడా శశి అంటే ప్రాణం. ముగ్గురు అక్కాచెల్లెళ్లు చాలా అన్యోన్యంగా వుంటారు. సాధారణంగా అందరి ఇండ్లలో వుండే కీచులాటలు వీళ్ళ మధ్య తక్కువే. ఆ విషయంలో భుజంగరావు, రోహిణి అదృష్టవంతులే!

శశి లోకల్ గవర్నమెంట్ ఆర్ట్స్ కాలేజిలో డిగ్రీ ఫస్టియర్ చదువుతోంది. సైన్స్ గ్రూపు, బి.ఎం.సి. అంటే బాటనీ, మైక్రోబయాలజీ, కెమిస్ట్రీ! ఇంగ్లీషు మీడియం!

చంద్రిక శశి ఇంటికి వచ్చింది.

"ఏం! ఇంకా తయారవ్వలేదా? కాలేజీకి టైం అవుతోంది" అంది చంద్రిక. శశికి ప్రాణస్నేహితురాలు ఆమె.

"అమ్మా! నేను కాలేజీకి వెళ్తున్నాను" అంటూ చంద్రికతో బస్‌స్టాప్ వద్దకు బయలుదేరింది శశి.

బస్‌స్టాప్ వద్ద విజయ, వైదేహి కలిశారు. కాలేజి ఐదు కిలోమీటర్ల దూరంలో




వుంది. సిటీబస్సులో వెళ్ళాలి. బస్సు వచ్చింది. అందరూ బస్సు ఎక్కారు. సీట్లలో కూర్చున్నారు.

"నిన్న కుమార్ సార్ బ్రయోఫైట మొదలుపెట్టారు" అంది విజయ. 'తెలుసు' అన్నారందరూ.

"శశి రన్నింగ్ నోట్స్‌లో ఎన్ని పేజీలు రాసిందో చూడు చంద్రికా!" అంది వైదేహి.

"ఏదీ చూపించూ" అంది చంద్రిక శశిని చూస్తూ.

"బ్యాగులో వుంది. బస్సులో ఏం చూస్తావులే!" అంది శశి.

ముగ్గురూ శశిని ఆటపట్టించడానికి అలా అంటూంటారు. శశికి ఆ విషయం తెలుసు. కాని గంభీరంగా జవాబు చెప్తూ మౌనంగా వుంటుంది. మౌనంగా వుండేవాళ్ళతో ఏం జోకులు వేస్తారు? విసుగొచ్చేస్తుంది. కుమార్ సార్ చెప్పే ప్రతి వాక్యాన్ని వీలైనంత త్వరగా రన్నింగునోట్సులోకి ఎక్కిస్తూవుంటుంది శశి. మిగతా వాళ్ళు కూడా రాస్తూంటారు గాని శశి అంత నాన్‌స్టాప్‌గా రాయరు.

బస్సు కాలేజి దగ్గర ఆగింది. అందరూ దిగి క్లాసురూమ్‌కు వెళ్ళారు. క్లాసులో నలభై మంది స్టూడెంట్స్ వుంటారు. ఇరవై మంది అబ్బాయిలు ఇరవై మంది అమ్మాయిలు. విజయ, వైదేహి ముందు బెంచిలో కూర్చుంటారు. వారి వెనుకనే శశి, చంద్రిక కూర్చుంటారు.

బెల్ కొట్టారు. కొద్ది సేపటికి ప్రసన్నకుమార్ క్లాస్‌కు వచ్చాడు. ప్రసన్నకుమార్ చాలా స్మార్ట్‌గా, ఫెయిర్‌గా ఉంటాడు. ఉంగరాల జుట్టు, ఎత్తుకు తగిన లావుతో చూడముచ్చటగా వుంటాడు. ఎప్పుడూ షర్ట్‌ను టక్ చేసి వుంటాడు. డ్రెస్ కూడా స్మార్ట్‌గా ధరిస్తాడు. నల్లని బూట్లు వేస్తాడు. అతని బాడీ లాంగ్వేజీ, మేనరిజంలతో అందరినీ ఆకర్షిస్తాడు. అంతేకాదు, మంచి గంభీరమైన స్వరం. పాఠం చెబుతుంటే గొంతు ఖంగుమంటుంది. బాటనీ సబ్జెక్టులో దిట్ట. పాఠం మొదలు పెడితే అందరూ లీనమైపోయి వినవల్సిందే! 'అరే! అప్పుడే క్లాస్ అయిపోయిందా!' అన్నంత ఆసక్తికరంగా పాఠం చెప్తాడు.

అందరూ కుమార్ సార్‌ను గౌరవిస్తారు. అభిమానిస్తారు. స్టూడెంట్సే కాదు. సహ అధ్యాపకులు కూడా అతనికి చాలా గౌరవం ఇస్తారు. పైపెచ్చు క్రికెట్, షటిల్, బ్యాడ్మింటన్ వంటి క్రీడల్లో కూడా పాల్గొంటాడు. కాబట్టి ఆటల్లో ఎక్కువగా పాల్గొనే ఆర్ట్సు స్టూడెంట్స్ కూడా కుమార్‌ను బాగా ఇష్టపడతారు.

## కొత్తగాలి...

**నీతికి తాళం**
**అవినీతికి మేళం**
**అంతా ఫిక్సింగు**
**లాభాల మిక్సింగు**

– జి. విజయశ్రీ,
అరసవిల్లి

ఒక లెక్చరర్ క్లాస్‌రూములో బాగా పాఠాలు చెప్తున్నాడంటే ఆ లెక్చరర్‌ను కాలేజీ అంతా గౌరవిస్తుంది! కుమార్ ఆ కోవకు చెందిన లెక్చరర్.

అంతే కాదు! ప్రసన్నకుమార్ ఆ కాలేజీలో ఎన్.ఎస్.ఎస్ కో-ఆర్డినేటర్. కాలేజి స్టూడెంట్స్‌కు ఎన్.ఎస్.ఎస్. తరఫున శిక్షణనిస్తూ ఉంటాడు. అనేక సామాజిక కార్యక్రమాలను రూపొందిస్తూ వుంటాడు. విద్యార్థులను క్యాంపులకు తీసుకొని వెళ్తూ వుంటాడు. మారుమూల గ్రామాలకు రోడ్లు వేయించడం, పల్లె ప్రజలకు విద్యార్థుల

ద్వారా ఆరోగ్య సూచనలు ఇవ్వడం, వరదలు లాంటి విపత్కర పరిస్థితుల్లో విద్యార్థులతో ఇండ్లకు వెళ్లి పాతబట్టలు, దుప్పట్లు మొదలగువాటిని సేకరించి బాధితులకు అందజేయడం.. ఇలా ఎన్నో కార్యక్రమాలు చేయిస్తూ ఉంటాడు. ఇవన్నీ కూడా కాలేజి ఎన్.ఎస్.ఎస్. ప్రోగ్రామ్‌లో భాగమే. కాబట్టి పైఅధికారుల మన్ననలను కూడా పొందుతూ ఉంటాడు.

అంతేకాదు! ఒకరిద్దరు పేద విద్యార్థులను తన స్వంత ఖర్చుతో చదివించడం, వారికి కావలసిన బట్టలను కుట్టించడం లాంటివి కూడా చేస్తూ ఉంటాడు.

ఒకసారి తలకోనప్రాంతంలో ఎన్.ఎస్.ఎస్. ప్రోగ్రాంలో భాగంగా విద్యార్థులతో క్యాంప్‌ను పర్యవేక్షించాల్సి వచ్చింది ప్రసన్న కుమార్‌కు. తలకోన ఓ కొండ ప్రాంతం. ప్రకృతి అందాలతో, జలపాతాలతో సుందరంగా ఉంటుంది. కాని ఆ ప్రాంతానికి రహదారులు సరిగా లేకపోవడంతో రోడ్డు వేయించే కార్యక్రమం చేపట్టారు కాలేజీ ఎన్.ఎస్.ఎస్. విద్యార్థులు.

"ఒరేయ్! ఈ కొండప్రాంతంలో రోడ్డు వేయాలంటే అయ్యే పనేనా? పైగా పదిరోజుల క్యాంప్. మన ఒళ్ళు హూనమైపోదూ? " అనుమానం వెలిబుచ్చాడు బీఏ చివరి సంవత్సరం విద్యార్థి రవి తన క్లాస్‌మేట్ నరేంద్రతో.

"తప్పదురా! సమాజసేవ అంటే ఇదే మరి. ఎంత కష్టమైనా మనం ఈ పని చేయవల్సిందే!" గత్యంతరం లేదనే ధోరణిలో మాట్లాడాడు నరేంద్ర.

ఇంతలో ప్రసన్నకుమార్ అక్కడికి వచ్చి విద్యార్థులందరినీ పోగుచేసి రోడ్డువేసే కార్యక్రమం ఎలా చేయాలో వివరించాడు.

మరుసటి రోజు నుండి పని ప్రారంభమైంది. చకచకా జరిగిపోతోంది. ఐదు రోజులకు సగం పని పూర్తయింది. ఆరోజు మధ్యాహ్నం జలపాతం చూద్దామని అనుకున్నారు.

"సార్! కొండపైకి వెళ్ళి జలపాతం చూద్దాం సార్! అక్కడి నుండి చూస్తే బావుంటుంది!" కొంతమంది విద్యార్థులు ప్రసన్నకుమార్‌ను అడిగారు.

"జలపాతాన్ని కింది నుండి చూస్తే బావుంటుంది గాని పైకెందుకు వెళ్ళడం? " ప్రశ్నించాడు ప్రసన్నకుమార్.

"లేదు సార్! అక్కడికి వెళ్ళి చూస్తేనే చాలా థ్రిల్లింగ్‌గా ఉంటుంది. మీరు కాదనకండి ప్లీజ్" అని బతిమిలాడారు వారు.

"సరే వెళ్దాం! ఎవరెవరు రాగలరో వారే రండి, మిగతావారు కిందనే ఉండండి!" అన్నాడు ప్రసన్న కుమార్.

క్యాంప్‌కు వచ్చిన ముప్పైమంది విద్యార్థులలో పదిమంది కొండ పైకెక్కడానికి తయారయ్యారు. ప్రసన్నకుమార్‌కు అన్ని రంగాల్లో ప్రవేశముంది. తాను చదువుకునే రోజుల్లో 'పర్వతారోహణ' అనే సాహసోపేత క్రీడలో శిక్షణ కూడా పొందాడు. అందుకనే ధైర్యంగా కొండపైకి పోదామన్నాడే గాని నిజానికి ఇంకొక లెక్చరర్ అయ్యుంటే ఒప్పుకొని వుండేవాడు కాదు. కొండ కూడా చాలా ఏటవాలుగా ఉంది. ఆ రాళ్లలో, గుట్టలలో పైకి ఎక్కడం కష్టం. విద్యార్థులు సరదాగా ఉబలాటపడ్డారు. పైగా బలవంతం చేశారు, కాబట్టి ఒప్పుకున్నాడు. ఎందుకైనా మంచిదని పర్వతారోహణకు కావలసిన తాడు, మేకులు, బెల్టులు, చేతులకు గ్లోవ్స్, ఫస్ట్ ఎయిడ్ కిట్, ఇంకా ఇతర సామాగ్రినంతా ఒక సంచిలో వేసుకొని విద్యార్థులతో కొండ ఎక్కడం మొదలు పెట్టాడు ప్రసన్నకుమార్. తనతో వచ్చిన విద్యార్థులు చిచ్చరపిడుగులు. కొండను సునాయాసంగా ఎక్కుతున్నారు. సగం కొండ ఎక్కేశారు. ఇంతలో చిన్నగా వాన

తుంపర మొదలైంది. అది రానురాను ఉధృతమవుతూ వచ్చింది. వానలో కొండ ఎక్కడం ఇప్పుడు చాలా కష్టంగా ఉంది. బండలమీద పట్టు దొరకడం లేదు. పైగా జారుతూ ఉంది.

"సార్! చాలా కష్టంగా ఉంది. పట్టుదొరకడం లేదు. కాళ్లు జారుతున్నాయి" భయంతో కేక పెట్టాడు గోపాల్ అనే విద్యార్థి.

"జాగ్రత్త! అలాగే ఏదో ఒక బలమైన రాయిని ఆసరాగా తీసుకో! నేను వస్తున్నాను. భయపడొద్దు!" అంటూ గోపాల్ కన్నా ఎగువ ప్రాంతంలో ఉన్న ప్రసన్నకుమార్ అతని కోసం కిందికి దిగుతూ వచ్చాడు.

ఇంతలో గోపాల్ పట్టు తప్పింది. కిందికి వేగంగా జారాడు. అదృష్టవశాత్తు గుట్ట మీద ఉన్న ఒక చెట్టు మొదట్లో ఇరుక్కున్నాడు. పక్కనే పెద్దలోయ. ప్రసన్నకుమార్ అతని వద్దకు చాకచక్యంగా జారుతూ వచ్చి అతని నడుముకు తాడు కట్టి, తన నడుముకూ తాడు కట్టుకొన్నాడు. మెల్లిగా అతనితో కిందికి దిగుతూ "అందరూ కొండ దిగండి. ఇది ప్రమాదకరం. వానపడ్తూ ఉంది. ఈ పరిస్థితుల్లో మనం ఎక్కలేం!" అంటూ మిగిలిన విద్యార్థులను ఆదేశించాడు.

దాంతో అంతా ఒకరి చేయి ఒకరు పట్టుకొని మెల్లిగా దిగివచ్చారు.

"సార్! మీరు గోపాల్‌ను రక్షించకపోయుంటే, వాడు లోయలో పడిపోయేవాడే. మేము చాలా భయపడ్డాం సార్! సారీసర్! మేము మిమ్మల్ని ఇబ్బంది పెట్టాం" షాక్‌కు గురైన వాళ్ళందరూ ముక్తకంఠంతో ఒక్కసారి వారి భావోద్వేగాల్ని వ్యక్తపరిచారు.

"ఈరోజు ఎవరి మొఖం చూశానో నా అదృష్టం బాగుంది. జరగకూడంది ఏదైనా జరిగి ఉంటే నా ఉద్యోగమే పోయివుండేది. మీరే పైకి పోదామని నన్ను బలవంతం చేశారు. కాబట్టే నేను ఒప్పుకోవలసి వచ్చింది. లేకుంటే ఒప్పుకొనివుండేవాణ్ణి కాదు" అన్నాడు ప్రసన్నకుమార్.

"ఏదో సరదాకు కొండెక్కుదామని అనుకున్నాం గాని ఇలా జరుగుతుందని మేము ఊహించలేదు సార్!" అన్నాడు సునీల్ అనే విద్యార్థి. వాళ్ళందరూ చాలా భయపడ్డారని గ్రహించాడు ప్రసన్నకుమార్.

వాళ్ళను మామూలు స్థితికి తేవడానికి "ఓకే బాయ్స్! అయిపోయిందేదో అయిపోయింది. బీ ఛీర్‌ఫుల్! సాయంత్రం ఆరు గంటలయింది. ఈరోజు పనులను ఇంతటితో ఇక ఆపేద్దాం" అంటూ తనకోసం ఏర్పాటు చేసిన గుడారంలోకి వెళ్లిపోయాడు.

"ఒరే గోపాల్! ఈ రోజు నీ అదృష్టం బాగుందిరా! లేకుంటే మాకు దక్కివుండేవాడివి కాదు. ప్రసన్నకుమార్ సార్ నీ పాలిట దేవుడురా!" అన్నారు గోపాల్ స్నేహితులు అతని చుట్టూ చేరి.

"ఔనురా! నిజంగా నేను భయపడ్డాను. మాస్టారే గనుక లేకుండావుంటే నేను ఏమయిపోయేవాణ్ణో!" షాక్ నుండి అప్పుడప్పుడే కోలుకుంటున్న గోపాల్ అన్నాడు.

'అంతా మన మంచికే జరిగిందిలే!'

**కొత్తగాలి...**

**'ఢిల్లీ' అయినా...**
**'గల్లీ' అయినా...**
**'మగువ'పై**
**'మృగాడి'దే ఆధిపత్యం**

– వాడపర్తి వెంకటరమణ,
విశాఖపట్నం

అనుకుంటూ అందరూ వాళ్ళ వాళ్ళ గుడా రాల్లోకి వెళ్లారు.

మిగిలిన ఐదురోజుల్లో రోడ్డు వేసే కార్యక్రమం పూర్తయింది. చివరిరోజు సాంస్కృతిక కార్యక్రమంతో క్యాంప్ ముగిసింది. అందరూ ఊరికి తిరిగి వచ్చారు.

మరుసటి రోజు యథావిధిగా కాలేజీ మొదలైంది. బి.ఎం.సి. వాళ్ళకు మొదటి పీరియడే బాటనీ. కుమార్ క్లాసుకు వచ్చాడు. అటెండెన్స్ తీసుకున్నాడు. పాఠం మొదలు పెట్టాడు. శశి రన్నింగ్ నోట్సు 'నాన్ స్టాప్ ట్రెయిన్' లాగ వేగంగా కదులుతోంది. నిజానికి శశికి, కుమార్ సార్ క్లాస్ అంటే చాలా ఇష్టం. నోట్స్ రాస్తుంటుంది. అప్పుడప్పుడు మైమరచి తదేకంగా సార్‌నే చూస్తూ ఉంటుంది. చంద్రిక ఈ విషయం చాలాసార్లు గమనించి శశిని గిల్లుతూ ఉంటుంది.

ఇతర స్టూడెంట్స్ ఏదో ఒక సందర్భంగా కుమార్ క్లాస్‌కు ఆబ్సెంట్ అవుతారేమోగాని శశి మాత్రం ఒక్కక్లాసు కూడా మిస్ కాదు. కుమార్ సెలవు రోజుల్లో స్పెషల్ క్లాసులు తీసుకున్నా, ఎటువంటి అవాంతరాలు ఉన్నా క్లాసుకు మాత్రం తప్పకుండా హాజరవుతుంది. ప్రాక్టికల్ క్లాసులు జరుగుతున్నంతసేపు కుమార్ చాలా సరదాగా వుంటాడు. అదే సమయంలో ప్రాక్టికల్స్ విషయంలో చాలా స్ట్రిక్టుగా వుంటాడు కూడా! ఏ ఒక్క స్టూడెంట్ తప్పు చేసినా సహించడు. తోలు ఒలిచేస్తాడు. అందుకే అబ్బాయిలూ, అమ్మాయిలూ కూడా భయపడుతూ వుంటారు. ప్రాక్టికల్స్‌లో ఎవరూ వెకిలి చేష్టలు చేయరు. క్లాసంతా చాలా గంభీరంగా గడిచిపోతూ వుంటుంది.

అయినప్పటికీ వైదేహి, విజయ, చంద్రికలు శశిని ఆటపట్టిస్తూ వుంటారు. వాళ్ళకు తెలుసు శశికి కుమార్‌సార్ క్లాసంటే చాలా ఇష్టమని. వాళ్ళకూ ఆయన క్లాసు ఇష్టమైనా శశి కొన్ని సందర్భాలలో తనకు తెలియకుండానే మైమరచిపోతూ వుంటుంది. కాబట్టి దీన్నే అలుసుగా తీసుకొని ఆటపట్టిస్తూ వుంటారు.

ఫస్టియర్ ప్రాక్టికల్స్‌లో 'సెక్షన్ కటింగ్' అనే అంశం వుంటుంది. మొక్కల కాండాన్ని కట్ చేసి 'స్టెయిన్' (రంగులు ఆపాదించడం) చేయాలి. ఇది చాలా ప్రతిభతో, చాకచక్యంగా చేయాలి. ప్రాక్టికల్స్‌లో ఇది ఒక భాగం. క్లాసులో అందరూ ప్రయత్నిస్తున్నారుగాని అంత బాగా డిసెక్షన్ రావడంలేదు. అదృష్టవశాత్తు శశికి కటింగ్ చాలా చక్కగా వచ్చింది.

అంతే! కుమార్‌సార్ శశి తయారు చేసిన స్లైడ్‌ను మైక్రోస్కోప్‌లో క్లాసులోని అందరికీ చూపిస్తూ "మీరు కూడా ఇలా చేయాలి" అని చెప్పి శశిని చాలా మెచ్చుకున్నాడు. ఆ రోజు శశి తన జీవితంలోనే చాలా గొప్ప రోజనుకుని సంబరపడిపోయింది. సంతోషంతో పులకరించిపోయింది.

మిగతా సబ్జెక్టు క్లాసులలో కూడా చాలా 'అటెంటివ్'గా వున్నా శశికి, కుమార్ సార్ క్లాసు ప్రత్యేకంగా వుంటుంది.

శశి తనని తాను ఆత్మవిమర్శ చేసుకొంటోంది. 'నేను మాస్టరును ఆరాధిస్తున్నానా? అభిమానిస్తున్నానా? మరేదైనానా? క్లాసులో ఆయన అనర్గళంగా పాఠం చెబుతోంటే ఆ చాకచక్యానికి, ఆ ధాటికి మైమరచిపోతూ వుంటానా? లేక కేవలం పాఠం చక్కగా చెప్తున్నాడని, సబ్జెక్టులో మంచి పట్టు వుందని ఆరాధిస్తున్నానా? లేదంటే ఆయన రూపం, నడత నన్ను ఆకర్షిస్తున్నాయా?

తన మిగిలిన ముగ్గురు స్నేహితురాళ్ల

కూడా ఇలాగే ఫీల్ అవుతున్నారా? నాకు తెలియకుండా నేనే వాళ్ళమధ్య బయట పడుతున్నానా? ఇతర విద్యార్థినీ విద్యార్థు లు తనని గమనిస్తున్నారా?

ఏం జరుగుతుందో తనకు తానై అర్థం చేసుకోలేకపోతోంది శశి.

శశి క్లాస్‌మేట్స్ ఇరవైమంది అబ్బాయి ల్లో జానకిరాం ఒకడు. అతణ్ణి అందరూ ముద్దుగా 'జాకీ' అని పిలుస్తూ వుంటారు. జాకీ పొట్టిగా, బొద్దుగా ఉంటాడు. చెక్కిళ్ళు బెలూన్ బుడగల్లా ఉబ్బెత్తుగా పెరగడం వల్ల కళ్ళు చిన్నవైపోగా దాదాపు నూటప దికేజీల బరువుతో జపాన్ మల్లయోధు డిలాగా కనిపిస్తాడు.

## కొత్తగాలి...

**మర్రి వృక్షం నీడన**
**మరో మొక్క ఎదగదు**
**భూకామందు పొరుగున**
**బక్కరైతు బతకడు**

*– అంబటి వెంకట శివారెడ్డి,*
*యర్రగుంట్ల*

అంత భారీ శరీరమున్నా గొంతు మాత్రం కీచుగా వుంటుంది. ఆ కీచు గొంతుతో అమాయకంగా మాట్లాడుతూ వుంటాడుగాని అందులో అల్లరి, వ్యంగ్యం, హాస్యం, అన్నీ కలిసుంటాయి. జాకీ తల్లి దండ్రులు బాగా ధనవంతులు. అసలు జాకీ కాలేజీకి వచ్చేది కాలక్షేపానికే! బాగా డబ్బు ఖర్చు పెడతాడు కాబట్టి ఒక అల్లరి బ్యాచ్‌ను తయారు చేసుకున్నాడు. క్లాసుకు సూటు, బూటు, నెక్‌టైతో వస్తాడు. చివరి బెంచిలో కూర్చుంటాడు.

ఆ భారీ శరీరానికి ఒక బెంచి మొత్తం సరిపోతుంది!

అతని పక్కన ఎవరూ కూర్చోరు!

ఆరోజు బాటనీ లెక్చరర్ శ్రీనివాసరావు క్లాసు తీసుకొంటున్నాడు. శ్రీనివాసరావు కూడా చక్కగా పాఠాలు చెప్తాడు. నిజానికి అది గవర్నమెంటు కాలేజీ అయినా మంచి ఫ్యాకల్టీ వున్న కాలేజి. శ్రీనివాసరావు గంభీ రంగా పాఠం చెప్తున్నాడు.

ఇంతలో "సార్! ఇక్కడ టెర్రరిస్టులు వున్నారు సార్!" బిగ్గరగా అరిచాడు జాకీ.

శ్రీనివాసరావు ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు. క్లాసంతా ఘొల్లుమంది.

"ఏరా? ఏమైంది నీకు?" అన్నాడు శ్రీని వాసరావు జాకీని చూస్తూ. అతనంటే అందరు లెక్చరర్లకు అలుసే! అందరికీ చనువే! ఎందుకంటే జాకీ అందరినీ సున్ని తంగానే నవ్విస్తూ వుంటాడు.

క్లాసులో జాకీలాంటి స్టూడెంట్స్‌కు ఏ కొద్ది అవకాశమిచ్చినా ఆ రోజు పాఠం వృ థా అయినట్లే!

ఇటువంటి ఛాన్స్ కోసమే జాకీ ఎదురు చూస్తూ వుంటాడు ఎప్పుడూ!

"నా బెంచిలో నల్లులున్నాయి సార్! రక్తం పీల్చేస్తున్నాయి. మీ పాఠం విననివ్వ డంలేదు!" అని పాఠం మీద ఏదో శ్రద్ధ వున్నవాడిలా చెప్పాడు.

ఇంతలో జాకీ ఫ్రెండు శీను "సార్! వాడి రక్తమంటే నల్లులకు ఇష్టం సార్! చూడండి! మా డెస్కులలో ఒక్కటీ లేదు!" అన్నాడు.

క్లాసంతా పగలబడి నవ్వుతున్నారు.

"అవును సార్! ఇక్కడి డెస్కుల నుండి నల్లులన్నీ వాడి డెస్క్‌కు మైగ్రేట్ అయ్యాయి సార్!" అని శీనును బలపరు స్తున్నట్లు రవి అన్నాడు.

"సార్! వాడు అదే బెంచిలో వుండడమే మేలు సార్! ఫస్టియర్ కంప్లీట్ అయ్యేస రికి సగమైపోతాడు!" అని మరొక ఫ్రెండ్ గౌరీశంకర్ అన్నాడు.

క్లాసంతా నవ్వులతో నిండిపోయింది.

శ్రీనివాసరావు కూడా నవ్వు ఆపుకోలేక పోయాడు.

★ ★ ★

ఫస్టియర్ ముగింపుకు వచ్చేసింది. మార్చి / ఏప్రిల్‌లో పరీక్షలు. అందరూ చాలా సీరియస్‌గా చదువుతున్నారు.

పరీక్షలు అయిపోయాయి. అందరూ బాగా రాశామని అనుకున్నారు. ఫస్టియర్ రిజల్ట్స్ వచ్చాయి. సాధారణంగా వైదేహి, విజయ, చంద్రికలకు మార్కులు ఎక్కువగా వస్తుంటాయి. శశికి మాత్రం వాళ్ళ కంటే కొంచెం తక్కువగా వస్తుంటాయి. వాళ్ళ ముగ్గురికీ డెబ్బై-ఎనభై వస్తూ వుంటే శశికి మాత్రం అరవై-డెబ్బై వస్తూ వుంటాయి. పాపం! ఎంత చదివినా శశికి వచ్చే మార్కుల పరిధి అంతే! కానీ వాళ్ళ కంటే అంత తీసిపోయే చదువు మాత్రం కాదు తనది.

డిగ్రీ రెండో సంవత్సరం మొదలయింది. సాధారణంగా ఒక్కొక్క సంవత్సరం ఒక్కొక్క 'టాపిక్' తీసుకొని పాఠాలు చెప్తూవుంటారు లెక్చరర్లు.

ఈసారి కుమార్ సార్ 'టాక్సానమీ' టాపిక్ తీసుకొన్నారు. టాక్సానమీ అంటే మొక్కల వర్గీకరణ శాస్త్రం. వృక్షశాస్త్రంలో ఇదే అత్యంత ముఖ్యమైన భాగం. శశికి టాక్సానమీలో కొన్ని డౌట్స్ వచ్చాయి. తన సందేహాలను తీర్చుకోవాలనుకుంది.

"ఏయ్ చంద్రికా! టాక్సానమిలో నాకు కొన్ని సందేహాలున్నాయి. నీవు తోడుగా వస్తే బాటనీ స్టాఫ్‌రూముకు వెళ్ళి ప్రసన్న కుమార్ సార్ వద్ద నా సందేహాలను తీర్చుకుంటాను... మరి వస్తావా? " అని అడిగింది.

"సరే! వస్తాను" అని తన అంగీరాకాన్ని తెలిపింది చంద్రిక.

ఇద్దరూ బాటనీ స్టాఫ్ రూముకు వెళ్ళారు. ప్రసన్నకుమార్ ఏదో పుస్తకం చదువుతూ కనిపించాడు.

"నమస్తే సార్" ఇద్దరూ ఒకే గొంతుతో విష్ చేశారు.

"నమస్తే! రండమ్మా! ఏం కావాలి? " అడిగాడు.

"సార్! శశికి టాక్సానమీలో ఏవో సందేహాలున్నాయట. అందుకు వచ్చింది" అని చెప్పింది చంద్రిక.

ప్రసన్నకుమార్, శశి సందేహాలన్నీ చక్కగా నివృత్తి చేశాడు. శశి చాలా సంతోషపడింది.

"డిగ్రీ అయిన తర్వాత ఏం చేయదలచుకున్నారు? " ప్రసన్నకుమార్ ఇద్దరినీ అడిగారు.

"నేను ఎం.ఎస్.సి. చేస్తాను సార్" వెంటనే జవాబు చెప్పింది చంద్రిక.

"మరి నీవు? " శశిని అడిగాడు.

"మీరేం చేయమంటారు? " ఎదురు ప్రశ్న వేసింది శశి.

పైచదువులను చదివించడానికి తన తండ్రికి ఆర్థిక స్థోమత లేదు. అయినా ప్రసన్నకుమార్ ఏం చెబుతాడో చూద్దాం అనుకుందామె.

"మంచి మార్కులు వచ్చి ఆర్థిక స్థోమత వుంటే పైచదువులు చదవవచ్చు. లేదంటే ఏదన్నా ఉద్యోగం చేసుకోవచ్చు. లేదంటే పెళ్ళి చేసుకొని గృహిణిగా వుండిపోవచ్చు" నవ్వుతూ అన్నాడు ప్రసన్నకుమార్.

"మీరు చెప్పండి సార్! ఉద్యోగం మేలా? గృహిణిగా వుండడం మేలా? " మరలా ఆరా తీసింది శశి.

"అది ఇంటి ఆర్థిక పరిస్థితులను బట్టి వుంటుంది. ఆర్థిక పరిస్థితులు ఓ మోస్తరుగా వుంటే గృహిణిగా వుంటేనే బావుంటుందని నా మనసుకనిపిస్తుంది" అంటూ తన అభిప్రాయాన్ని తెలిపాడాయన.

ఇంతలో బెల్ కొట్టారు. శశి, చంద్రిక

క్లాసుకు వెళ్లారు.

రెండో సంవత్సరం చదువుతుండగా మధ్యలో మామూలుగా 'బొటానికల్ టూర్'ను ఏర్పాటు చేస్తూ వుంటారు బాటనీ డిపార్టుమెంటువాళ్ళు. ఈ టూర్లు సహజసిద్ధ పరిసరాల్లో మొక్కలు, చెట్లు ఎలా ఉంటాయనే అంశాల అధ్యయనానికి ఉపయోగపడుతూ వుంటాయి. దీనితో బాటు విద్యార్థులకు వినోదవిహారాలు లభిస్తాయి. ముఖ్యంగా మొక్కల అధ్యయనానికే ఈ టూర్లు వేసినా దాదాపు డెబ్బై శాతం విద్యార్థులు ఎంటర్‌టైన్‌మెంట్ కోసమే వెళ్తూవుంటారు.

ఈసారి ఊటీకి పోవాలని డిపార్టుమెంట్ వాళ్లు నిశ్చయించారు. ఊటీ బొటానికల్ గార్డెన్లను చూడటానికి దేశంలోని వివిధ విశ్వవిద్యాలయాల నుండి విద్యార్థులు వస్తూ వుంటారు.

**కొత్తగాలి...** 

**ఆరోగ్యానికి**
**వెల లేని**
**ఔషధం**
**చిరునవ్వు**

– డి. చందూవంశీ,
కర్నూలు

నవంబర్‌లో టూర్. అందరూ సమాయత్తమవుతున్నారు. టూర్‌లో ఎలా ఉండాలో విద్యార్థులకు వివరిస్తున్నారు లెక్చరర్లు. టూర్‌కు విద్యార్థులతోబాటు నలుగురు లెక్చరర్లు వెళ్తున్నారు. బాటనీ డిపార్టుమెంట్ నుండి ప్రసన్నకుమార్, శ్రీనివాసరావు, మైక్రోబయాలజీ డిపార్టుమెంటు నుండి రమాదేవి మేడం, రామకృష్ణ వెళ్తున్నారు.

నవంబర్ రానే వచ్చింది. అందరూ రైల్లో బయలుదేరారు. మొదట కోయంబత్తూరు చేరుకోవాలి. అక్కడి నుండి వేరే రైల్లో ఊటీ చేరుకోవాలి. టూర్‌లో ఈ ప్రయాణమే చాలా ఆహ్లాదకరంగా వుంటుంది. రైలులో పోతూ వుంటే నీలగిరి కొండలు అత్యంత మనోహరంగా వుంటాయి. ట్రైన్ ఎత్తుకుపోయే కొద్దీ మేఘాల్లోకి పోయినట్లుంటుంది. కిందికి చూస్తే లోతైన లోయలు, ఆ లోయల్లోంచి పుట్టుకొచ్చినట్లు పెద్దపెద్ద చెట్లు, రకరకాల చెట్లు. అంతా పచ్చదనం. మధ్య మధ్యలో తెల్లని మేఘాలు. ట్రైన్ మేఘాల నడుమ నడిచి పోయినట్లు మెల్లిగా కదులుతూ వుంటుంది.

ఊటీ చేరుకున్నారు. ప్లాన్ ప్రకారం అందరూ 'రాయల్ రిసార్ట్స్'లో బస చేశారు. దాదాపు ఇరవైమంది విద్యార్థినలకు రమాదేవి మేడం ఇన్‌ఛార్జి. ఇరవైమంది విద్యార్థులకు ప్రసన్నకుమార్, శ్రీనివాసరావు, రామకృష్ణలు ఇన్‌ఛార్జులుగా వున్నారు. అమ్మాయిలకు ప్రత్యేకమైన బస ఇచ్చారు. మరుసటిరోజు ఎనిమిది గంటలకంతా అందరూ బొటానికల్ గార్డెన్స్‌కు వెళ్ళాలని లెక్చరర్లు చెప్పారు. ఆ రాత్రి అందరూ నిద్రకుపక్రమించారు.

మరుసటి రోజు అందరూ బొటానికల్ గార్డెన్స్‌కు చేరుకున్నారు. అక్కడున్న వివిధ రకాలైన మొక్కల శాస్త్రీయ నామాలను ప్రసన్నకుమార్, శ్రీనివాసరావు మాస్టర్లు రెండు బ్యాచ్‌లుగా విడిపోయిన స్టూడెంట్స్‌కు వివరిస్తూ వున్నారు. దాదాపు అందరు విద్యార్థులూ ఎంతో శ్రద్ధగా నోట్సు రాసుకొంటూ వింటున్నారు. ఏదో పదిమంది మాత్రం చిన్నపాటి అల్లర్లు చేస్తూనేవున్నారు. శశి, చంద్రిక, వైదేహి, విజయలు కూడా శ్రద్ధగా వింటూ నోట్సు రాసుకొంటున్నారు. పైచదువులకు పోవా

 

లనే ఆసక్తి వున్నవాళ్ళు ఇటువంటి ఎడ్యుకేషనల్ టూర్లను బాగా ఉపయోగించుకుంటారు.

సాయంత్రం కొంత విశ్రాంతి దొరకగానే అందరు విద్యార్థులూ గార్డెన్స్‌లో గడిపారు. కొంతమంది పిల్లలు గుంపులు గుంపులుగా లాన్స్‌లో కూర్చుని పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు.

ప్రసన్నకుమార్ దూరంగా కొంచెం ఎత్తైన ప్రదేశంలో ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. శశి, ప్రసన్నకుమార్‌ను చూసింది. తనతో వున్న గ్రూపు నుండి కొంచెం దూరంగా కదిలింది. కుమార్ సార్‌తో మాట్లాడాలనుకుని అటువైపు కదిలింది. కొన్ని అడుగులు వేసిందో లేదో "ఏయ్! శశీ" అంటూ చంద్రిక పరుగెత్తుకుంటూ వచ్చి "అక్కడ మనవాళ్ళు హార్స్ రైడింగ్ చేస్తున్నారు. చూద్దాం, పద" అంటూ లాక్కుని వెళ్ళింది.

శశి నిరుత్సాహపడింది!

హార్స్‌రైడింగ్ దగ్గర కొంతమంది మగపిల్లలు గుర్రాలను ఎక్కి కొంత దూరం వరకు స్వారీ చేస్తూ వున్నారు. వారికి గుర్రపు యజమానులు సహాయం చేస్తున్నారు. ఒక్కొక్క గుర్రం దగ్గర ఒక్కొక్క యజమాని ఉంటాడు. జాకీ గ్రూప్ కూడా అక్కడకు చేరుకుంది.

శశి, చంద్రిక, ఇంకా కొంతమంది అమ్మాయిలు అక్కడనే వున్నారు, తమ క్లాస్‌మేట్స్ ఎలా హార్స్‌రైడింగ్ చేస్తారో చూద్దామని.

ఇంతలో జాకీ కూడా స్వారీ చేద్దామనుకున్నాడు. ఒక గుర్రపుయజమాని వద్దకు వెళ్ళాడు.

జాకీ ఆకారం చూసి అతను కాస్త భయపడ్డాడు.

ఇంతలో శీను "ఒరే జాకీ! వద్దురా! నువ్వు స్వారీ చేయలేవు!" అని అరుస్తున్నాడు.

గుర్రం ఎత్తుగా వుంది. పొట్టిగా వున్న జాకీ ఎక్కలేకపోతున్నాడు. గుర్రం యజమాని ఎంత ప్రయత్నించినా ఎక్కించలేకపోతున్నాడు.

"ఒరే శీను! ఇక్కడికి వచ్చి గుర్రం పక్కన వంగివుండు!! నీ పైన కాలు పెట్టి ఎక్కుతాను!" అన్నాడు జాకీ.

పాపం! ఫ్రెండ్ ఉబలాటపడుతున్నాడని శీను జాకీ చెప్పినట్లే చేశాడు. జాకీ శీను వీపుమీద కాలుపెట్టి గుర్రం ఎక్కడానికి ప్రయత్నించాడు. గుర్రం బెదురుకొని పక్కకు జరిగింది. అంతే, కిందపడిపోయాడు.

అందరూ ఒక్కసారి పగలబడి నవ్వారు.

పట్టువదలని విక్రమార్కుడిలా మరలా ప్రయత్నించాడు. మరలా కిందపడ్డాడు.

గుర్రం యజమానితో ఏదో గొడవ పడ్తున్నాడు. అతను తన అనుభవంలో ఎంతో మందిని గుర్రం ఎక్కించాడు కాని జాకీని మాత్రం ఎక్కించలేకపోయాడు!

"ఒరే జాకీ! నీకు గుర్రం సరిపోదుగాని ఏదన్నా గాడిదను చూసుకోరా!" అన్నాడు శీను.

అందరూ పెల్లుబికి వస్తున్న నవ్వును ఆపుకోలేకపోయారు!

ఏది ఏమైనా గార్డెన్స్‌లో స్టూడెంట్స్ అందరూ బాగా ఎంజాయ్ చేశారు.

మరుసటి రోజు దొడబెట్టకు బయలుదేరారు. దొడబెట్ట నీలగిరి కొండల్లో అత్యంత ఎత్తైన ప్రదేశం. అక్కడ పర్వతశ్రేణులను టెలిస్కోప్ ద్వారా చూడవచ్చు చాలా చక్కని ప్రదేశం. ఇక్కడి ప్రకృతి అందాలను చూడవలసిందేగాని చెప్పడానికి మాటలు చాలవు.

అట్లాగే ఊటీలోని వివిధ ప్రదేశాలన్నింటిని చూసి తిరుగు ప్రయాణం అయ్యారు.

డిగ్రీ చదువులో విహారయాత్ర ప్రతి విద్యార్థి జీవితంలో చిరస్మరణీయంగా గుర్తుండిపోయే ఒక మధురమైన ఘటన. చదువు పూర్తయ్యేక జీవితంలో ప్రతి ఒక్కరూ ఏదో ఒక సందర్భంలో ఇటువంటి మధురస్మృతులను తలచుకుంటూ వుంటారు. 'అప్పుడు అలా చేశాం, ఇలా చేశాం' అంటూ తమ సహోద్యోగులకు, పిల్లలకు చెబుతూ వుంటారు.

శశికి తన క్లాసులో అందరితో పరిచయమున్నా చంద్రిక, విజయ వైదేహిలతో ఒక గ్రూపుగా కలిసి వుంటుంది. క్లాసులో అమ్మాయిలు గానీ అబ్బాయిలు గానీ ముగ్గురు నలుగురు సన్నిహితంగా ఒక బ్యాచ్‌గా వుండడం సహజం. క్లాసులో మిగతా వారితో పరిచయమున్నా ఒక్కో గ్రూపువారు మాత్రం తమ ఐడెంటిటీని తమకు తెలియకుండానే ఇతరులకు చాటుకున్నట్లు వుంటారు. శశి బ్యాచ్‌వాళ్లు లైబ్రరీకి, స్టాఫ్ రూముకు, లేబరేటరీకి, క్యాంటీన్‌కు.. ఇలా కాలేజీలో ఎక్కడికి వెళ్ళినా కలిసే వెళ్తుంటారు. వారిది విడదీయని అనుబంధం. ఏదైనా ఆపద వచ్చినా, దుఃఖం వచ్చినా, సంతోషం వచ్చినా కలిసే పంచుకుంటారు. వీళ్ళలో విజయది కాస్త దూకుడు స్వభావం. ఇతర సీనియర్ విద్యార్థులుగాని, తమ సహాధ్యాయులుగాని వీళ్ల దగ్గర వెకిలి వేషాలు వేస్తే ఆమె చాలా దూకుడుగా స్పందిస్తుంది. పైగా తన తండ్రి ప్రభాకరరావు సర్కిల్ ఇన్‌స్పెక్టర్!

అప్పుడప్పుడు శశిని వుద్దేశించి విజయ "చూడమ్మా శశీ! నిన్ను ఆ దేవుడు ఇంత అందంగా పుట్టించాడు కాబట్టి, నువ్వు మా బ్యాచ్‌లో వున్నావు కాబట్టి ఈ మగరాయుళ్ళు మన బ్యాచ్‌తో ఇలా వెకిలి చేష్టలు చేస్తున్నారు" అంటూ వుంటుంది సరదాగా.

అయితే ఆ ముగ్గురిలో శశి చాలా అందంగా వుంటుందని ఎవరికీ ఎలాంటి ఈర్ష్య లేదు. పైపెచ్చు బాగా ఆమెను అభిమానిస్తారు.

శశికుటుంబం వున్న వీధిలోనే నాలు గిండ్ల అవతల విజయ ఇల్లు వుంటుంది. విజయ అమ్మగారు సరోజిని, విజయ అన్న భరత్ చెన్నైలో బి.టెక్ చదువుతున్నాడు. తమ్ముడు గౌతమ్ పదోతరగతి చదువుతున్నాడు. విజయది సంపన్నుల కుటుంబం. ప్రభాకర్ చాలా గౌరవమున్న పోలీస్ ఆఫీసర్. సిన్సియారిటీకి మారుపేరు. అవినీతికి దూరం. తల్లి సరోజిని కూడా సంస్కారవంతమైన ఇల్లాలు. ఎంత అధికారం, ధనం వున్నా చాలా అణకువగా వుండే కుటుంబం. సరోజిని మాటా, తీరూ చాలా చక్కగా వుంటాయి. అదే సంస్కారం, ప్రవర్తన పిల్లలకు కూడా అబ్బింది. కాకపోతే అల్లరిమూకలకు ఎలా జవాబు చెప్పాలో, అనవసరంగా తన విషయంలో జోక్యం చేసుకొనేవాళ్ళను ఎలా ఎదురించాలో విజయకు బాగా తెలుసు. తండ్రి పోలీస్ ఆఫీసర్ కాబట్టి కాస్త తొందరపాటు స్వభావం అలవడిందామెకు.

చంద్రికఇల్లు కూడా అదే వీధిలో వుంది. ఆమె నాన్నగారు చిత్తూరు కోఆపరేటివ్ చక్కెర ఫ్యాక్టరీలో ఎండీగా వున్నారు. పేరు మాధవరావు. తల్లి సుధారాణి. ఈ దంపతులకు చంద్రిక ఒక్కగానొక్క కూతురు. ఆమె చాలా గారాబంగా పెరిగినప్పటికీ హద్దులు మీరి ప్రవర్తించదు. తల్లిదండ్రులను గొంతెమ్మ కోరికలతో ఇబ్బంది పెట్టదు. శశిని విడిచి ఒక్కక్షణం వుండలేదు. కాలేజి నుండి రాగానే చంద్రిక శశి ఇంటికి గాని, లేదా శశి చంద్రిక ఇంటికి గాని కాలక్షేపానికి వచ్చిపోతూ ఉండాల్సిందే. వీళ్ళతో విజయ తరచూ కలవకపోయినా అప్పుడప్పుడూ కలుస్తూవుంటుంది.

★ ★ ★

సుమలత కొంగారెడ్డిపల్లె బస్‌స్టాప్ వద్ద నిల్చొనివుంది. బస్సు ఇంకా రాలేదు. సుమలత కూడా శశి క్లాస్‌మేట్. కాలేజీకి ఏడు కిలోమీటర్ల దూరంలో కొంగారెడ్డిపల్లె వుంది. బస్సులోనే సుమలత కాలేజీకి వస్తూ వుంటుంది.

"హల్లో సుమలతా! బాగున్నావా?" వెనక నుండి పలకరింపు.

వెనుదిరిగి చూసింది సుమలత. తమ కాలేజీలోనే చదువుతున్న ఫైనల్ బీఏ స్టూడెంట్ గిరిధర్. అతనూ అదే బస్సులో కాలేజీకి వస్తూ వుంటాడు.

"నీకెన్ని సార్లు చెప్పాను నాతో మాట్లాడవద్దనీ. సిగ్గులేదా?" కోపంగా అంది సుమలత.

"నీవు ఎన్నిసార్లు చెప్పినా నా పద్ధతి మారదు. ఎందుకంటే నిన్ను ప్రేమిస్తున్నాను. నీవు అంగీకరించేవరకు నీ వెంట పడుతూనేవుంటాను" అన్నాడు గిరిధర్.

"నీవు ఇట్లాగే వేధించావంటే నేను మళ్ళీ పోలీసులకు ఫిర్యాదు చేయవలసి వుంటుంది. నీ హద్దుల్లో నువ్వు వుండు. దయచేసి నా జోలికి రావొద్దు" కాస్త బెదిరించినట్లు, కాస్త బతిమిలాడినట్లు చెప్పింది.

"ఇదివరకు నాపైన పోలీస్ రిపోర్ట్ ఇచ్చావు. ఏమీ జరగలేదు. ఈసారి కూడా అదే జరుగుతుంది. నువ్వు నన్ను ఏమీ చేయలేవు. కాబట్టి మర్యాదగా నేను చెప్పినట్లు విను" హెచ్చరించినట్లు మాట్లాడాడు గిరిధర్.

ఇంతలో బస్సు వచ్చింది. ఇద్దరూ బస్సు ఎక్కారు. మిగతా ప్రయాణికులు కూడా ఎక్కారు. బస్సులో కూడా సుమలతను తన వెకిలి మాటలతో విసిగించడం మొదలుపెట్టాడు గిరిధర్. బస్సులో ఉన్న వాళ్లు అతని గొడవను ఎంజాయ్ చేశారే తప్ప వారించలేదు.

సుమలతకు గిరిధర్ ఒక కొరకరాని కొయ్యగా తయారయ్యాడు. అతనంటే తనకు ఏ మాత్రం ఇష్టంలేదు. పైపెచ్చు ఏవగింపు! అతణ్ణి ఎలా వదిలించుకోవాలో తెలియకుండా సతమతమవుతూ ఆలోచనల్లో పడింది. ఇదివరలో తండ్రితో బాటు పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళి అతని మీద రిపోర్టు కూడా ఇచ్చింది. కానీ పోలీస్ సిబ్బంది తేలిగ్గా తీసుకున్నారు. తననే మందలించి పంపించారు. తన బంధువులతో కూడా చెప్పించింది. వాళ్ళు చెప్పిన తర్వాత కొన్ని రోజులు సైలెంట్‌గా వుండిపోయాడు. కానీ మళ్ళీ ఇప్పుడు దెయ్యంలాగ వెంటాడుతున్నాడు. ఏం చేయాలో దిక్కుతోచకుండా వుంది. బస్సు కాలేజి దగ్గర ఆగింది. క్లాసులు ఆరంభం కావడానికి ఇంకా కాస్త టైం ఉండడంతో వెయిటింగ్ రూంకు వెళ్ళిందామె. అక్కడ తన క్లాస్‌మేట్ విమల కనబడింది.

"విమల! ఇలారా!" అంటూ పిలిచింది.

విమల దగ్గరకు వచ్చింది. ఆమెకు తన గోడు చెప్పుకుంది.

అప్పుడు విమల ఒక సలహా ఇచ్చింది. "విజయవాళ్ల నాన్న పోలీస్ ఆఫీసర్. ఆమెకు చెప్పు ఈ విషయం! ఇక ఆయన చూసుకుంటాడు వాడి కథ!"

## కొత్తగాలి...

**అంగడి బొమ్మే నయం**
**రోజుకో చీర అలంకరిస్తుంది**
**అంగడి అమ్మాయికి పాపం!**
**రెండే రెండు చీరలు!**

– వక్కా చెన్న కేశవరావు,
కావలి

ఇంతలో విజయబ్యాచ్‌వాళ్లు వెయిటింగ్ రూములోకి వచ్చారు. వెంటనే "విజయా! నీతో మాట్లాడాలి" ఆత్రుతగా అంది సుమలత.

"ఏమిటీ విషయం? " ప్రశ్నించింది విజయ.

ఇంతలో బెల్ కొట్టారు. లేడీస్ వెయిటింగ్ రూము నుండి అందరూ క్లాసులకు బయలుదేరారు.

"క్లాసులు అయిపోయిన తర్వాత మాట్లాడుకుందాం" అంది సుమలత.

మధ్యాహ్నం లంచ్ సమయంలో విజయను పక్కకు పిలిచింది.

మళ్లీ విమలకు చెప్పినట్లే తన బాధను విజయకు చెప్పింది సుమలత.

"విమలకు చెప్పాను. ఆమె నీకు చెప్పమంది. మీనాన్న పోలీస్ ఆఫీసరంట గదా! నా బాధను మీ నాన్నగారికి చెప్పవా? " బతిమిలాడుతూ అడిగింది.

"అట్లాగే! సాయంత్రం కాలేజీ అయిపోయిన తర్వాత మా యింటికి ఇద్దరం వెళ్దాం. నాన్నగారికి చెబుదాంలే! ఏం భయపడకు" భరోసా ఇచ్చింది విజయ.

"ఏమోనే! నాకు భయంగా వుంది. ఈ విషయం మనిద్దరి మధ్యే వుంటే బావుంటుంది. ఎవరికీ చెప్పకు" అంది సుమలత.

"అట్లాగే!" అంటూ మళ్లీ మధ్యాహ్నం క్లాసులకు బయల్దేరారు ఇద్దరూ.

సాయంత్రం కాలేజీ అయిపోగానే విజయ తన బ్యాచ్‌తో కాకుండా సుమలతతో ముందుగానే వెళ్ళింది. ఇల్లు చేరుకోగానే సుమలతకు కాఫీ, స్నాక్స్ ఇచ్చి "కాసేపు కూర్చో! నాన్నగారు వచ్చే టైం అయింది" అంటూ తానూ సోఫాలో కూర్చుంది.

దాదాపు అరగంట అయిన తర్వాత ప్రభాకరరావు ఇంటికి వచ్చాడు.

"నాన్నా! ఈమె నా క్లాస్‌మేట్ సుమలత. తనను ఈవ్‌టీజింగ్ చేస్తున్నవాడి గురించి మీకు చెప్పాలనుకుంటోంది. మీరు గట్టిగా యాక్షన్ తీసుకోవాలి నాన్నా! ఇటువంటి వాళ్ళను ఉపేక్షించకూడదు" అంది విజయ. తర్వాత..

సుమలత వైపు చూస్తూ "చెప్పవే నాన్నకు నీ కథంతా" అంది.

ప్రభాకరరావుకు తన కథంతా చెప్పింది సుమలత.

"ఏం భయపడవలసిన పని లేదమ్మా! నేను చూసుకుంటానులే! నువ్వు ప్రశాంతంగా ఇంటికెళ్ళు" అంటూ సెంట్రీకి సుమలతను బస్సు ఎక్కించి రమ్మన్నాడు.

మరుసటి రెండురోజులు బస్‌స్టాప్ వద్ద మళ్ళా ప్రత్యక్షమవుతూ వచ్చాడు గిరిధర్. అదే ఫాలోయింగ్. అదే రకమైన వేధింపులు. ఈసారి గళం పెంచాడు గిరిధర్.

"నువ్వు గనుక నన్ను పెళ్ళి చేసుకోకపోతే నీపైన ఆసిడ్ చల్లుతా!" బెదిరించాడు గిరిధర్.

బస్సులో మళ్ళీ ఆలోచనల్లో పడింది సుమలత. 'ఏమిటి? ఇది వరకు పోలీస్ స్టేషన్లో ఫిర్యాదు చేస్తే వాళ్లేమీ పట్టించుకోలేదు. ఇప్పుడు విజయనాన్నగారికి చెప్పినా ఎలాంటి ఫలితం లేదు. ఏం చేయాలి? ఎలా ఈ రాక్షసుణ్ణి వదిలించుకోవాలి? ' చాలా మథన పడుతూ పరధ్యానంగా శూన్యంలోకి చూస్తూ కూర్చుండిపోయింది.

మూడోరోజు మామూలుగా బస్‌స్టాప్ వద్దకు వచ్చింది. బస్సు ఇంకా రాలేదు. వెయిట్ చేస్తూ వుంది. అయితే గిరిధర్ కనబడలేదు. కాసేపటికి బస్సు వచ్చింది. సుమలత బస్సు ఎక్కింది. 'బస్సు కదిలే టైంలో ఎక్కడినుండైనా ఊడిపడొచ్చు ఈ రాక్షసుడు' అనుకుంటూనే కూర్చుంది.

"ఏమ్మా! నీ స్నేహితుడు ఈ రోజు రాలేదా? " మామూలుగా రోజూ అదే

బస్సులో ప్రయాణం చేసే ప్రయాణికులు సుమలతను అడిగారు.

'స్నేహితుడా, పాడా! నా పాలిట రాక్ష సుడు వాడు' మనసులోనే తిట్టుకుంది. వాళ్ళకేమీ సమాధానమివ్వకుండా మౌనంగా వుండిపోయింది. మరలా ఆలో చనల్లో పడింది. 'పోలీసోళ్ళు నిజంగానే యాక్షన్ తీసుకొని వుంటారా? విజయ నాన్నగారి ప్రమేయం ఫలించి వుంటుందా? అసలు ఆయన జోక్యం చేసుకొని వుంటాడా?'

ఏది ఏమైనా ఇప్పుడు తను ప్రశాం తంగా ప్రయాణిస్తోంది. మనసులో ఎటు వంటి అలజడి లేదు. ఇన్ని రోజులు ముళ్ళసీటు మీద ప్రయాణిస్తూండింది. ఇప్పుడు హాయిగా వుంది.

మరుసటి రోజు కూడా గిరిధర్ కనబ డలేదు. సుమలత ఊహించినట్లుగానే పోలీసు సిబ్బంది తనదైన శైలిలో గిరి ధర్‌కు ట్రీట్‌మెంట్ ఇచ్చారు. దాని ప్రభా వమే గిరిధర్ బస్‌స్టాప్ వద్ద కనబడకుండా పోవడం!

ఆ రోజు సోమవారం. రాత్రి ఏడుగం టలు. సుమలత ఇంట్లో టీవీ చూస్తోంది. కాసేపటికి వీధిలో అలజడి. సుమలత కిటి కీలోంచి చూసింది. గిరిధర్! అతని బంధు వులు, స్నేహితులు దాదాపు పదిహేను మంది కూడా రాగా వాళ్ళింటి ముందర నిలబడి గొడవ చేస్తున్నాడు.

"రావే! బయటికిరా! నీ అంతు చూస్తా. నాపైన పోలీసోళ్ళకు చెప్పి నన్ను కొట్టిస్తా వా? నువ్వు ప్రాణాలతో ఉండగలవా?"

నానారకాల బండబూతులు తిడ్తూ ఊగి పోతున్నాడతను. అతని బంధువులు, స్నేహితులు కూడా అసభ్యంగా మాట్లా డుతున్నారు. ఇంట్లోనుండి ఆమె తండ్రి రామయ్యను లాక్కెళ్ళి వీధిలో పిడిగుద్దులు గుద్దేరు. కాళ్ళతో గుండె మీద తన్నారు. వీధిలోని జనం గుమిగూడారు. ఈ దారు ణాన్ని చూస్తూ వుండిపోయారే తప్పా ఎ వరూ మాట్లాడలేదు.

"ఓరే! దాన్ని కూడా జుట్టు పట్టుకొని బయటికి లాక్కొని రండిరా!" వాళ్ళలో ఒకడు అరుస్తున్నాడు. సుమలత తల్లి రాజమ్మ వీధిగుమ్మం తలుపులు వేసింది.

## 'చతుర'లో మొదటి నవల



### డా. గురుగుంట్ల ఉమాపతి

నేను పుట్టింది కర్నూలులో. విద్యా భ్యాసం కర్నూలు, నెల్లూరు, చిత్తూరు, తిరు పతిలలో సాగింది. శ్రీవేంకటేశ్వర విశ్వవి ద్యాలయం నుంచి ఎమ్మెస్సీ పీహెచ్‌డీ పట్టాలు పొందాను. వివిధ ప్రభుత్వ కళాశా లల్లో జంతుశాస్త్ర విభాగం అధిపతిగా పని చేశాను. రాష్ట్ర ప్రభుత్వ 'ఉత్తమ అధ్యాపక' పురస్కారాన్ని అందుకున్నాను. 2002లో పదవీ విరమణ చేశాను. 2008 నుంచి రచ నా వ్యాసంగాన్ని ప్రవృత్తిగా ప్రారంభించా ను. 2010లో నేను రాసిన వచన కవితా సంపుటి 'జనజీవన స్రవంతి' ప్రచురిత మైంది. నేను రాసిన మొదటి నవలే 'శశి' కావడం, అది 'చతుర'కు ఎంపికవ్వడం ఆనందదాయకం.

చిరునామా:
డా. గురుగుంట్ల ఉమాపతి
ఫ్లాట్ నెం.204, మయూరి హైట్స్,
పెద్ద మార్కెట్ ఎదురుగా,
కర్నూలు-518001

వాళ్ళు ఇంకా రెచ్చిపోయారు. ఇంతలో రామయ్య స్నేహితులు, ఆ వీధిలోని మిగతావాళ్ళు చొరవ తీసుకొని, గిరిధర్ మూకతో తలపడడంతో తోకముడిచింది గిరిధర్ గుంపు. సుమలత మనసు అతలాకుతలమైంది. ఏదైతే జరగకూడదని ఊహించిందో అదే జరిగింది. తన తండ్రిని వాళ్ళు వీధిలో అలా కాళ్లతో తన్నడాన్ని చూసి తట్టుకోలేకపోయింది. తనూ, తన తల్లి భోరున ఏడుస్తూ వుండిపోయారు. రామయ్య స్నేహితులు ఆయనకు తగిలిన దెబ్బలకు ప్రాథమిక చికిత్స చేస్తున్నారు. రామయ్య దెబ్బల బాధతో మూలుగుతూ వున్నాడు.

"ఏమ్మా! వాడితో నీకు ఎన్నాళ్ళ నుండి పరిచయం? " అడిగాడు రామయ్య స్నేహితుడు గోవర్ధనరావు.

"పరియచమేమీ లేదు! వాడే నన్ను ప్రేమిస్తున్నానని వెంటపడ్తున్నాడు. ఎన్నిసార్లు చెప్పినా వినకుండా వున్నాడు. ఇదివరలో నాన్నతో వెళ్లి పోలీస్ స్టేషన్‌లో కూడా ఫిర్యాదు చేశాం" అని చెప్పుకొని వచ్చింది సుమలత.

"మాకు కూడా చెప్పివుండాల్సింది కదమ్మా! మేమే ఏదో ఒకటి చేసివుండే వాళ్ళం కదా! విషయం ఇంతదూరం ఎందుకు తెచ్చారు? " అన్నాడు మాధవయ్య.

అప్పటికే రాత్రి పదకొండు గంటలయింది. రామయ్య ఇంటికి వచ్చిన వాళ్ళందరూ వెళ్ళిపోయారు. సుమలత కిటికీ దగ్గరికి వచ్చింది. బయట అమ్మలక్కలు మాట్లాడుకోవటం వినింది. "ఏమోనమ్మా! ఇది కూడా సామాన్యమైందా ఏమి? దీని చొరవ లేకుంటే వాడెందుకు వెంటపడ్తాడు? ఇది కూడా ఏదో తప్పు చేసివుంటుంది. అందుకే ఈ రాద్ధాంతం!"

ఇంక సుమలత వినలేకపోయింది. తన గదిలోకి పరుగెత్తి మంచంపై పడి భోరున ఏడ్చేసింది.

★ ★ ★

ఆ రోజు బుధవారం. చిత్తూరు గవర్నమెంట్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజీ విద్యార్థులు, అధ్యాపకులు అందరూ బస్సులలో, స్కూటర్లలో, బైక్‌లలో కాలేజీకి వస్తున్నారు. విద్యార్థులు ఎవరి క్లాసులకు వాళ్ళు వెళ్తున్నారు. అధ్యాపకులు తమ తమ స్టాఫ్‌రూములకు వెళ్తున్నారు. విద్యార్థినులు తమ వెయిటింగ్‌రూముకు వెళ్తున్నారు. ఇంతలో కాలేజీలో లాంగ్‌బెల్ కొట్టారు.

దీని అర్థం విద్యార్థులు, అధ్యాపకులు అందరూ ఆడిటోరియంలో సమావేశమవ్వాలనీ, ఏదైనా విపత్కర పరిస్థితుల్లోనే ఇలా లాంగ్‌బెల్ కొడ్తారు!

"ఏమే! ఈ రోజు లాంగ్‌బెల్ కొట్టారు. ఏమైనా జరిగిందా? " చంద్రికను అడిగింది వైదేహి.

"నాకేం తెలుసు! మనమందరం కలిసే వస్తున్నాం కదా? ఆడిటోరియంకు పోదాం, పదండి!" అంది చంద్రిక.

కాసేపటికి అందరు విద్యార్థులు, అధ్యాపకులు, అధ్యాపకేతర సిబ్బంది ఆడిటోరియంలో సమావేశమయ్యారు.

"ఈరోజు మనకు దుర్దినం. మన కాలేజి బి.ఎం.సి. సెకండ్ ఇయర్ విద్యార్థిని సుమలత ఆకస్మికంగా మరణించిందని తెలియజేయడానికి చాలా చింతిస్తున్నాను. ఒక మంచి విద్యార్థినిని మనం కోల్పోయాం. ఆమె కుటుంబానికి కాలేజి మేనేజ్‌మెంట్ తరఫున, అధ్యాపకులు, విద్యార్థుల తరఫున ప్రగాఢ సానుభూతి తెలియపరుస్తున్నాను. ఆమె ఆత్మకు శాంతి కలగాలని మనమందరం రెండు నిమిషాలు మౌనం పాటించవలసినదిగా కోరుతున్నాను. అటు తర్వాత క్లాసులు జరగవు" అని అనౌన్స్ చేశారు.

# తల్లేతప్ప తండ్రులులేని 'వాళ్లు!'




ప్రమీలార్జునీయంలో ఆమె రాజ్యంలో స్త్రీలదే ఆధిక్యత. ఇలాంటి సమాజాలు అనేక చోట్ల ఉండేవి. అవన్నీ అంతరించిపోయి, ఇప్పుడు ఒకే ఒక్క చోట స్త్రీ ఆధిక్య సమాజం విరాజిల్లుతోంది. అది చైనాలోని సిజువాన్ ప్రాంతంలో యునాన్‌లో ఉంది. ఇది టిబెట్ సరిహద్దుల్లో ఉంది. అక్కడి ప్రజలు ముసోవ్ జాతికి చెందిన వారు. వీరి సంఖ్య మొత్తం నలభై వేలమంది. హిమాలయాల పర్వత ప్రాంతంలోని ఈ కొండజాతి సంస్కృతిలో పురుషుడికి పెద్దగా విలువ ఉండదు. అన్నిటా స్త్రీలదే పై చేయి. పొలం పనులు, పాడి పరిశ్రమ వీరి ప్రధాన ఆదాయ వనరులు. బంగాళాదుంపలు, ధాన్యం, కూరగాయలను పండిస్తారు. గేదెలు, గొర్రెలు, మేకలు, కోళ్లను పెంచుతారు. వీరి భాషలో తండ్రి, భర్త అనే పదాలే లేకపోవడం విశేషం. స్త్రీలే అన్ని ప్రధాన నిర్ణయాలను తీసుకుంటారు. భూమికి అధిపతులు కూడా వీరే. వీరు జుయోహున్‌ని పాటిస్తారు. అంటే పద మూడేళ్లు దాటిన ప్రతి మహిళ తనకు ఎంత మంది ఇష్టమైతే అంత మంది పురుషులతో రమించవచ్చు. ఎవరికి ఎవరు తండ్రో తెలీదు. ప్రతి మగాడినీ పిల్లలు 'అంకుల్' అనే సంబోధిస్తారు. పిల్లల్ని మహిళలంతా కలిసి పెంచుతారు.



తండ్రి గురించిన చర్చే రాదు. ఇంటిపని, వంటపని, పశువులను చూసుకోవడం, కట్టెలను ఏరుకు రావడంలాంటి అన్ని పనులనూ మహిళలే చేస్తారు. మగవాళ్లు చేయాల్సిన పని మాంసంకోసం జంతువులను చంపడం. ముఖ్యంగా మాంసాన్ని మగవాళ్లు ఎండబెట్టి దాస్తారు. ఇది పదేళ్ల దాకా ఆ వాతావరణంలో చెడిపోదు. వివాహవ్యవస్థ లేదు కాబట్టి ఒకే ఇంట్లో ఆడ, మగ కలిసి జీవించే పద్ధతే అక్కడ లేదు. వ్యక్తిగత పడక గదులు ఉండవు. ఓ మగవాడికి ఓ స్త్రీ మీద కోరిక కలిగితే, దాన్ని ఆమె స్వాగతిస్తేనే ఆమె ఇంటికి వెళతాడు. బద్రినాథ్‌కు వెళ్లేదారిలోని పహాడీల్లో కూడా ఇలాంటి ఓ మహిళాధిక్య సమాజం ఉందట.

అంతే! కాలేజీలోని వాళ్ళందరూ 'షాక్'కు గురయ్యారు.

ముఖ్యంగా సుమలత క్లాస్‌మేట్స్.

"ఏమయింది? ఏమయింది? " అని ఒకరినొకరు ఆరా తీసుకుంటున్నారు. కాసేపటికి విషయం తెలిసింది, సుమలత ఉరి పోసుకుని ఆత్మహత్య చేసుకుందని.

తర్వాత కొంతకాలానికి వివరాలు తెలిసాయి. కొంగారెడ్డిపల్లెలో సుమలత ఇంటి దగ్గర గొడవలు జరిగాయని, అందుకే సుమలత అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకుందని. గిరిధర్ ఆ తర్వాత ఎక్కడా కనబడలేదు!

★ ★ ★

డిగ్రీ రెండో సంవత్సరం ముగిసింది. మూడో సంవత్సరం మొదలైంది. ఈసారి ప్రసన్నకుమార్ ఫిజియాలజీ టాపిక్ తీసుకున్నాడు. బాటనీ సబ్జెక్టులో అన్ని విభాగాలను చక్కగా బోధించే ఘటికుడు ప్రసన్నకుమార్.

శశి- ప్రసన్నకుమార్ అంటే బాగా ఇష్టపడింది. ఈ మూడేళ్లలో ఎన్నో సందర్భాలలో సన్నిహితంగా మాట్లాడాలనుకుంది. కాని ఏదో అనిర్వచనీయమైన 'భయం' ఆమెను ఆవరించేది. తన మనసును నేరుగా అతనికి చెప్పాలనుకున్నా ఆ



భయమే ఆమెను వెనకడుగు వేయించేది.

'ఒకవేళ చొరవ తీసుకుంటే సార్ తన గురించి ఏమనుకుంటాడో ఏమో? ఒకవేళ గట్టిగా మందలిస్తే తన గతేమిటి? ఒకర కంగా చులకన అవుతానో ఏమో? తన ఊహా ప్రపంచం ఒక్కసారిగా బద్దలవుతుంది గదా!'

మనసు విరిగే దానికన్నా మధురస్మృతులతో గడపడమే మేలనుకుంది.

'తనది పిరికి ప్రేమ! వన్‌సైడ్ లవ్! మూగ ప్రేమ!

తన స్నేహితురాండ్రకు కూడ తన మనసులోని మాటను చెప్పలేని పిరికితనం!

ఎంత స్నేహితులైనా ఒకవేళ తన మనసులోని మాట వెలికి జారి, ఆ నోట, ఈ నోట పడితే తన గతేంటి?

కుటుంబ పరువుప్రతిష్టలు తనవల్ల భ్రష్టుపట్టే పరిస్థితి వస్తుందో ఏమో!

నాన్న పరువుప్రతిష్టలకు పాకులాడే మనిషి. తనవల్ల ఏ ఒక్క పొరపాటు జరిగినా తట్టుకోలేని మనిషి! కానీ తన మనసు మాత్రం అసంతృప్తిగానే వుంది. అసహనంగానే వుంది. సమాజ కట్టుబాట్ల చట్రంలో తన మనస్సును అదుపులో ఉంచుకోవాలి.

తనకు ధైర్యం లేదు. పిరికివారికి ప్రేమించే అర్హత వుండదు'

తన చేతకానితనానికి తనను తానే తిట్టుకుంది శశి.

కాలేజి నుండి ఇంటికెళ్తే అసహనంగా



తోంది. ఏమిటి కారణం? " కుతూహలంగా అడిగింది శశి.

"ఔనే! దానికి పెళ్ళి కుదిరిందట. మన కాలేజీలోనే ఒక లెక్చరర్‌తో త్వరలోనే దాని పెళ్ళి" అంది చంద్రిక.

"లవ్ మ్యారేజా? " మళ్ళీ అడిగింది.

"కాదు! అరేంజ్‌డ్! మహేశ్వరి వాళ్ళ పెద్దవాళ్ళు, ఆ లెక్చరర్ వాళ్ళ పెద్ద వాళ్లు సంప్రదింపులు చేసుకున్న తర్వాతనే నిశ్చయమైందట. వాళ్ళూ వీళ్ళూ ఒకే కులం. ఈ సంప్రదింపులు దాదాపు నాలుగైదు నెలలుగా జరుగుతూనే వున్నాయట" అని తనకు తెలిసిన వివరాలు చెప్పింది చంద్రిక.

'మరి ఆ లెక్చరర్ ఎవరు? ప్రసన్న కుమార్ కాదు కదా? ' అని మనసులోనే అనుకుంటూ, "ఈ వివరాలన్నీ నీకెవరు చెప్పారు? " అని మళ్ళీ ఆత్రుతగా అడిగింది శశి.

"దాని క్లోజ్ ఫ్రెండ్ హిమబిందు చెప్పిందిలే! ఆ లెక్చరర్ పేరు మాత్రం ఎవరికీ చెప్పవద్దని ఒట్టేయించుకుందట మహేశ్వరి" అంది చంద్రిక.

శశి మనసులో గుబులు పట్టుకుంది.

వుంటోంది. ఎప్పుడెప్పుడు మళ్ళీ కాలేజీ మొదలవుతుందా? అని ఆరాటపడుతూ వుంటుంది. ఎందుకంటే కాలేజీలో ప్రసన్న కుమార్‌ను చూసుకుంటూ వుండవచ్చు! అదొక అనిర్వచనీయమైన ఆనందం! ఇతర క్లాస్‌మేట్స్‌తో సరదాగా వుండవచ్చు. చంద్రిక, విజయ, వైదేహిలు తనను ఆట పట్టించినా తనకు కావలసింది అదే!

'ఇంటి కన్నా గుడి పదిలం' అన్నట్టుంది తన వ్యవహారం.

ఈ మధ్యకాలంలో అంటే రెండునెలలుగా క్లాసులో మహేశ్వరి చాలా ఆనందంగా, సరదాగా, ఉల్లాసంగా వుండటం గమనించింది.

"ఏమే చంద్రికా! మహేశ్వరి ఈ మధ్య చాలా ఉల్లాసంగా వున్నట్లు కనబడు

ఇన్ని రోజులు కాలేజీకి వచ్చినా సంతోషం గానే వుంది. ఇప్పుడు ఒకరకమైన అను మానం. మహేశ్వరి, ప్రసన్నకుమార్ పట్ల సన్నిహితంగా వుంటోందా అన్న అనుమా నంతో వాళ్ళను గమనిస్తోంది. ఎలాంటి ఆనవాళ్ళూ కనబడటంలేదు.

ఒకరోజు మధ్యాహ్నం శశి, చంద్రిక, విజయ, వైదేహి లేడీస్ వెయిటింగ్ రూం నుండి బయటికొచ్చారు. అదే సమయంలో కాలేజి పోర్టికో దగ్గర ఒక తెల్లటి ఇన్నోవా కారు వచ్చి ఆగింది. ఇద్దరు పెద్ద మను షులు కారులోంచి దిగి, కారుముందర నిల బడి వున్నారు. వారిలో ఒకతను సెల్‌ఫో న్‌లో మాట్లాడుతున్నాడు. కాసేపటికి మహేశ్వరి హడావిడిగా వచ్చి కారులో కూర్చుంది. ఐదు నిమిషాల తర్వాత కెమిస్ట్రీ లెక్చరర్ కృష్ణకాంత్ కారు ఎక్కాడు. కారు వెంటనే రయ్‌మని దూసుకెళ్ళింది. ఈ సీన్‌ను దూరంనుండే శశిబ్యాచ్ చూస్తూనే వుంది. ఇప్పుడర్థమయింది వాళ్ళకు మహేశ్వరికి ఎవరితో పెళ్ళి కుది రిందో!

'హమ్మయ్య!' అని మనసులోనే అను కుంది శశి. తన ఆనందాన్ని బయటికి కన బర్చలేదు.

★ ★ ★

డిగ్రీ మూడో సంవత్సరం కూడ ముగి యవచ్చింది. క్లాసులోని వాళ్ళంతా 'ఫేర్ వెల్' పార్టీని ఏర్పాటు చేసుకున్నారు. ఒక స్టూడెంటు జీవితంలో డిగ్రీలో గడిపిన కాలమే బాగా గుర్తుంచుకోదగ్గ మధుర మైన గోల్డెన్ పీరియడ్. ఎందుకంటే ఇంట ర్మీడియట్ చదివేకాలంలో మనసుకు పరి పక్వత వుండదు. ప్రతి చిన్న విషయానికి చిరాకు, తొందరపాటు వుండే వయసు! పైగా తల్లిదండ్రుల ఒత్తిడులతో అనేక ఇ బ్బందుల్లో కూరుకుపోయిన స్థితి!

పోస్టు గ్రాడ్యుయేషన్ స్వార్థంతో కూడిన చదువు. ర్యాంకు కోసం తపించే చదువు. విద్యార్థుల మధ్య స్నేహం వున్నా పుస్తకాల పురుగుగా తయారయ్యేకాలం అది!

కాబట్టి డిగ్రీ చదువులో యవ్వనదశలో పరిపక్వతతో గడిపిన సంతోషదాయకమైన సంఘటనలనే చాలామంది వారి తర్వాతి జీవితంలో గుర్తు పెట్టుకుంటారు. కొంత మంది తమ ఫ్రెండ్స్‌ను, కొంతమంది లెక్చరర్లను, కొంతమంది తమ ఘనకార్యా లను, ఇలా రకరకాలుగా తమ అధ్యాపకు లను, తమ అనుభవాలను, నెమరు వేసు కుంటూ వుంటారు.

ఫేర్‌వెల్ ఫంక్షన్‌ను చాలా గ్రాండ్‌గా జరుపుకున్నారు శశి క్లాసువాళ్ళు. క్లాస్ రూ మును అత్యంత సుందరంగా అలంకరిం చుకున్నారు. రికార్డెడ్ మ్యూజిక్‌తో క్లాస్ రూం అంతా మార్మోగుతోంది. అందరూ రకరకాల డ్రెస్సులలో.. ఒక ఫ్యాషన్ షోలాగ వుంది వాతావరణం. కార్యక్రమం మొదలయింది.

మొదట కొంతమంది స్టూడెంట్స్ ఒకరి తర్వాత ఒకరు ఉపన్యాసాలు ఇచ్చారు. తర్వాత లెక్చరర్లు అందరూ ఉపన్యాసాలు ఇచ్చారు. చివరన ప్రిన్సిపాల్ ఉపన్యాసమి చ్చాడు. క్లాసులోని స్టూడెంట్స్ అంతా లెక్చ రర్ల దగ్గర, స్నేహితుల దగ్గర ఆటోగ్రా ఫులు తీసుకున్నారు.

శశి కూడా అందరు లెక్చరర్ల దగ్గర, ఇతర స్నేహితుల దగ్గర ఆటోగ్రాఫులు తీసుకుంది.

ముఖ్యంగా ప్రసన్నకుమార్ సార్ దగ్గర కెళ్ళి ఆటోగ్రాఫ్ తీసుకొంది.

కుమార్‌సార్ శశి ఆటోగ్రాఫ్‌లో ఏం రాసాడో చూడాలని చంద్రిక, విజయ, వైదేహి కుతూహలపడ్డారు.

"ఏం శశి! కుమార్ సార్ ఏం రాశారు. ఒకసారి చూపించు" అంది విజయ.

"ఏదో రాశాడులే!" అంది ముభావంగా

శశి. చంద్రిక శశి ఆటోగ్రాఫ్ పుస్తకం తీసుకుంది.

'ఏ థింగ్ ఆఫ్ బ్యూటీ ఈజ్ ఏ జాయ్ ఫర్ ఎవర్' అని కుమార్ అందులో రాశాడు.

'శశి బాగా అందంగా వుంటుందని అందులో రాశాడా? లేక అందంగా వున్న వస్తువులను చూసి ఆస్వాదించాలే గాని ఆశించకూడదు' అనే నిగూఢ అర్థం ఆ వాక్య సారాంశమా!

ఆయన ఏమనుకొని రాసి వుంటాడు?

ఫ్రెండ్స్ ముగ్గురికీ అర్థం కాలేదు.

కుమార్ తన ధోరణిలో అన్ని క్లాసుల్లోను డ్యూటీమైండెడ్‌గా పాఠాలు చెప్పుకు పోతూవుంటాడు. అతని దృష్టిలో అందరు విద్యార్థులూ సమానమే! హెచ్చు తగ్గులు ఏమీ వుండవు!

విద్యార్థులంతా అతనిని చాలా గౌరవిస్తారు. ఫంక్షన్‌లో కుమార్ ఉపన్యాసం కూడా చాలా చక్కగా వుంది.

ఫేర్‌వెల్ ఫంక్షన్ చాలా విజయవంతంగా ముగిసింది. వీడ్కోలు సమయంలో కొంతమంది విద్యార్థులు కంటతడి పెట్టుకున్నారు.

విజయ, వైదేహి, చంద్రికలు ఎప్పుడూ శశి ఇంట్లోనే కలుస్తూ వుంటారు. కాబట్టి వాళ్ళలో ఎలాంటి మార్పు కనబడలేదు. ఇతర విద్యార్థుల నుండి వీడిపోతున్నామనే బాధ తప్ప ఎక్కువగా ఎలాంటి భావోద్వేగాలకూ గురికాలేదు వారు.

శశికళ్ళలో మాత్రం కన్నీరు సుడులు తిరిగాయి! ఎవరికీ కనబడకుండా కర్చీఫ్‌తో కళ్ళను తుడుచుకుంది.

మూడో సంవత్సరం పరీక్షలు ముగిసాయి. ఫలితాలు కూడా రెండు నెలల్లో వచ్చాయి. శశి, చంద్రిక, విజయ, వైదేహి ఫస్ట్‌క్లాసులో పాసయ్యారు.

చంద్రిక, విజయ, వైదేహిలు ఎమ్మెస్సీ మైక్రోబయాలజీ కోసం ఎస్.వి. యూనివర్సిటీకి అప్లయ్ చేశారు.

డిగ్రీలో మంచి పర్సెంటేజ్ వుంది కాబట్టి ముగ్గురికీ సీట్లు వచ్చాయి.

శశి మాత్రం అప్లయ్ చేయలేదు.

నాన్న పరిస్థితి తనకు తెలుసు!

నాన్న కూడ మాట వరుసకు 'నువ్వు కూడా అప్లయ్ చేస్తావా?' అని అడిగాడే తప్ప మనస్ఫూర్తిగా అడగలేదని తనకు తెలుసు.

ఒక్కసారిగా నలుగురు ఫ్రెండ్సు విడిపోయారు!

శశి మనసు అతలాకుతలమైంది. ఎందుకంటే మిగతా ముగ్గురూ ఎప్పుడు సెలవురోజులు వచ్చినా శశి ఇంట్లోనే కలుస్తూ వుండేవారు.

ముగ్గురు ఫ్రెండ్స్ పైచదువులకు వెళ్ళాక శశి ఇంటి పట్టునే వుండిపోయింది. అప్పుడప్పుడు తాను కూడ చంద్రిక ఇంటికో, విజయ ఇంటికో పోయేది. కాని ఇప్పుడు ఎవ్వరూ లేరు!

శశి అక్కతోబాటు అప్పుడప్పుడు బజారుకెళ్ళడం, ఏవో సరుకులు తీసుకొని రావడం చేస్తోంది.

★ ★ ★

సాయంత్రం ఐదు గంటలు అయింది. "భుజంగరావ్! భుజంగరావ్" అని ఇంటి

## కొత్తగాలి...

**కాకులు పిచ్చుకలు**
**సెల్ టవర్లలో అద్దెకుంటున్నాయ్!**
**పచ్చని చెట్లను**
**రోడ్లు మింగుతుంటే!**

– పి.వి.ఎన్. ప్రసాద్,
నవులూరు

## సంజీవ్‌దేవ్ చతురోక్తులు

ఆధునిక తెలుగు రచయితల్లో రసతత్వం మీద ఎక్కువగా రాస్తూ, ఉపన్యసిస్తూ సామాన్యుల్లోనూ లలితకళలపై అభిరుచిని పెంచేందుకు కృషిచేసిన అసాధారణ ప్రతిభాశాలి సంజీవ్‌దేవ్. ఆయన మాటల్లో, లేఖల్లో దొర్లిన చతురోక్తులు ఇవీ..

### ఒకడుగు ముందు!

అనేక రంగాలతో పరిచయమున్న ఎస్. ఆర్. తపస్వి, శ్రీరమణ ఇరువురూ సంజీవదేవ్‌కు మిత్రులే. వారిరువురి గురించి ఓసారి సంజీవదేవ్ 'మీరుభయులూ కూడ తెలివైన, సృజనాత్మకులైన, మంచి స్వభావంగల నవయువకులు.



అయితే సృజనాత్మకత విషయంలో మీరు రమణకంటే ఒకడుగు ముందుకు వేశారు' అన్నారు తపస్వితో.

వెంటనే 'అదెలాగ?' అని ప్రశ్నించాడు తపస్వి.

దానికి సంజీవదేవ్ 'ఇరువురికీ పెళ్లిళ్లయ్యాయి. కానీ మీరు తండ్రి కావటంతో శ్రీరమణ కంటే ఒకడుగు ముందున్నట్లే కదా!' అన్నారు, వారిని నవ్విస్తూ.

బయటి నుండి కోటేశ్వరరావు పిలుపు వినబడింది.

"రండి అంకుల్! కూర్చోండి నాన్న వస్తారు" అంది శశి.

సాయంత్రం వేళ భుజంగరావు, కోటేశ్వరరావులకు షికారుపోయే అలవాటు.

కోటేశ్వరరావు ఇంట్లోకి వచ్చాడు.

"ఏమ్మా! కంగ్రాట్స్! ఫస్ట్‌క్లాసులో పాసయ్యావటగా!" అంటూ శశిని అభినందించాడాయన.

"థాంక్స్ అంకుల్!" అని శశి చెప్పింది.

'నెక్స్ట్ ఏం చేయదలచుకున్నావ్!' అని అడగడానికి కోటేశ్వరరావుకు ధైర్యం చాల లేదు. ఎందుకంటే వారి ఇంటి పరిస్థితి అతనికి క్షుణ్ణంగా తెలుసు. ఇంతలో భుజంగరావు హాల్లోకి వచ్చాడు. ఇద్దరూ కలిసి షికారుకు బయలుదేరారు. మౌనంగా నడుస్తున్నారు.

"రిటైరయినా ఇంకా బరువు బాధ్యతలు తగ్గలేదురా!" అన్నాడు నిరుత్సాహంగా భుజంగరావు.

"రిటైర్‌మెంటు ఉద్యోగానికేకాని జీవితానికి కాదు గదా!" అన్నాడు కోటేశ్వరరావు.

"నాగమల్లిక పెళ్లి చేశాను. దాని కోరికలు చిగురించకముందే దేవుడు అన్యాయం చేశాడు. మనసుకు తగిలిన ఆ దెబ్బ ఇంకా మానలేదురా!" ఆవేదనతో అన్నాడు భుజంగరావు.

"అవును! నిజమే! మరపు అనేది మనిషికి దేవుడిచ్చిన గొప్ప వరం! కాబట్టి పాత జ్ఞాపకాలు ఏవీ మనసులో పెట్టుకోకుండా ముందు ముందు జరగబోయే దాన్ని గురించి ఆలోచించు" అన్నాడు కోటేశ్వరరావు.

"మంజులకు పెళ్లయింది. అది హైదరాబాదులో బాగానే వుంది! దాని వైపు నుండి ఎటువంటి సమస్యలు లేవు" అన్నాడు భుజంగరావు.

కొంచెంసేపు ఇద్దరి మధ్య మౌనం.

"ఇక శశి గురించి ఆలోచించాలి! దాన్ని ఎవరో ఒక అయ్య చేతిలో పెడ్తే నా బరువు, బాధ్యత తీరిందనుకుంటాను"

"శశికేంరా.. చక్కని బొమ్మలా వుంటుంది! ఎవడో ఒకడు కట్నం లేకుండానే పెళ్లి చేసుకుంటాడు!" అని ధైర్యం చెప్పాడు కోటేశ్వరరావు.

"అయినా ఇప్పుడే కదా చదువు పూర్త యింది. పెళ్ళి విషయంలో కొంచెం సమయం తీసుకున్నా ఫర్వాలేదులే" అన్నాడు మళ్ళీ అతనే.

ఎదిగిన ఆడపిల్లల పెళ్ళిళ్ళు అయ్యేంత వరకు తల్లిదండ్రులకు మనశ్శాంతి వుండదు. పైగా పెళ్ళిళ్ళు, ఇళ్ళు, అప్పులు అన్నీ కూడా రిటైర్మెంట్ కు ముందే జర గాలి కాని అటు తర్వాత అలాంటి కమిట్ మెంట్స్ వుంటే మాత్రం ఆందోళన కలి గించే విషయమే! అందుకే భుజంగరావు ఎప్పుడూ తన కుటుంబ పరిస్థితి గురించే ఆలోచిస్తూ వుంటాడు.

అయినా కోటేశ్వరరావుతోనే గాక ఇంక ముగ్గురు, నలుగురు స్నేహితులతో సరదా గానే వుంటాడు! పూర్తి నిరాశవాదిగా మాత్రం వుండడు.




**ఎస్.**వి. యూనివర్శిటీలో చంద్రిక, విజయ, వైదేహి ముగ్గురు ఒకే హాస్టల్ లో ఒకే రూములో వుంటున్నారు. మైక్రోబ యాలజీ క్లాసులు బాగా జరుగుతున్నాయి. అప్పుడప్పుడు డిగ్రీ ముచ్చట్లు మాట్లాడు కుంటూ వుంటారు. ముఖ్యంగా శశి గురించి ఎక్కువగా మాట్లాడుకుంటూ వుంటారు. ఆమెను ఎక్కువగా ఆట పట్టిం చినా శశి అంటే వారికి అమితమైన ప్రేమ. ముఖ్యంగా ఎంత గేలి చేసినా చాలా స్పోర్టివ్ గా తీసుకుంటుంది. కాబట్టే వారికి బాగా ఇష్టం. తనది చాలా సున్ని తమైన స్వభావం. ఎవరి మీదా ఎలాంటి ఫిర్యాదు ఉండదు. ఏ అవాంతరం వచ్చినా, ఏ కష్టమొచ్చినా మనసులోనే దాచుకుంటుంది. తన అందంతోబాటు ఈ సున్నితత్వం ఆమెకు మరింత అందాన్ని ఇచ్చింది. కాబట్టే శశిని ఈ ముగ్గురే కాకుండా డిగ్రీలో మిగతా ఫ్రెండ్స్ కూడా బాగా ఇష్టపడేవారు.

మైక్రోబయాలజీలో చేరి దాదాపు ఆరు నెలలు కావస్తోంది. యూనివర్శిటీ హాస్ట ల్ లో భోజన విషయంలో గొడవలు మొదలయ్యాయి. క్రమేణ అవి పెద్ద గొడ వలుగా తయారయ్యాయి. యూనివర్శిటీ యాజమాన్యం ఈ గొడవలకు తట్టుకోలేక టెర్మినల్ హాలిడేస్ తో బాటు ఇరవైరోజులు సెలవులను ప్రకటించింది. స్టూడెంట్స్ ఎవరికి వారు వాళ్ళవాళ్ళ ఊళ్లకు బయలు దేరారు.

చంద్రిక, విజయ, వైదేహి కూడా బస్సులో తమ ఊరికి బయలుదేరారు.

చంద్రిక సెల్ లో శశికి ఫోన్ చేసింది.

రెస్పాన్స్ రాలేదు.

అలా రెండు మూడుసార్లు చేసింది.

అయినా రెస్పాన్స్ రాలేదు.

"ఎందుకో శశికి ఫోన్ చేస్తూంటే అందడం లేదు" అంది చంద్రిక మిగతా ఇద్దరితో.

"మేము కూడా ఫోన్ చేశాం. మాకు కూడా అందలేదు" అన్నారు.

'ఏమైవుంటుంది? మామూలుగానే వెంటనే రెస్పాన్స్ ఇస్తుంది కదా!' అనుకు న్నారు.

'బహుశా ఫోన్ ఛార్జింగ్ లో లేదేమో' అనుకున్నారు.

'మనం హాస్టల్ లో వున్నప్పుడంతా బాగా మాట్లాడుతూ వుండేది కదా! ఇప్పు

డు ఎందుకు సైలెంట్ అయింది' బస్సులో ప్రయాణం చేసే కొద్దీ ముగ్గురి మనస్సుల్లో రకరకాల ఆలోచనలు, అనుమానాలు. ముగ్గురి మధ్యా సుదీర్ఘమైన మౌనం.

'రేపు సాయంత్రం నాలుగు గంటలకు మనమందరం శశి ఇంటి దగ్గర కలుసుకో వాలి' తీర్మానించుకున్నారు.

మరుసటి రోజు ఇంచుమించు ఒకే సమయంలో ముగ్గురూ శశి ఇంటికి చేరు కున్నారు. లోపలి నుండి భుజంగరావు గొంతు గట్టిగా వినబడుతూవుంది. ఏదో బిగ్గరగా అరుస్తూ వున్నాడు.

ముగ్గురూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకొన్నారు. ఇంట్లో వాతావరణం హాట్ హాట్‌గా వుందని గ్రహించారు. ఒకటిరెండు సెకన్లు లోపలికి పోదామా, వద్దా? అని తటపటాయించారు. చివరికి లోపలికే పోదామనుకున్నారు.

హాలులో భుజంగరావు చాలా చిరాగ్గా అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. శశి సోఫాలో కూర్చొని వుంది. రోహిణి వంటింటి గుమ్మం దగ్గర నిల్చొని వుంది. నాగమల్లిక అక్కడే వున్న ఒక కుర్చీలో కూర్చొని వుంది.

"రండమ్మా! సరిగ్గా సమయానికే వచ్చారు. రండి, కూర్చోండి" అన్నాడు భుజంగరావు సీరియస్‌గానే.

"ఉద్యోగం చేయనంటావు. పెళ్ళి చేసు కోను అంటావు. మరి ఏం చేయదలచుకు న్నావు? " శశిని ఉద్దేశించి గట్టిగా అడిగాడు భుజంగరావు.

శశి మౌనంగా వుంది.

రోహిణి కూడ సహనం కోల్పోయింది. "మరి ఏం చేయదలచుకున్నావే" తాను కూడా గొంతు పెంచింది.

అప్పటికీ శశి మౌనంగా వుంది.

ఇంట్లో వాతావరణం నిజంగానే వేడిగా వుందని అర్థమయింది ముగ్గురికీ.

"అది ఇట్లాగే అంటుందిగాని, మీరు సంబంధాలు చూడండి" అంది రోహిణి భర్తతో.

తనకు హితులైన తన ముగ్గురు ఫ్రెండ్సు వచ్చారు కాబట్టి, ఇప్పటికైనా ధైర్యంగా తన మనసులోని మాట చెప్పాల నుకుంది శశి.

"మీరు సంబంధాలు చూడాలనుకుంటే ముందుగా ప్రసన్నకుమార్ సార్‌ను అడ గండి" అంది శశి.

ఈ మాటకు ముగ్గురు ఫ్రెండ్స్ ఒక్క సారి ఆశ్చర్యానికి గురయ్యారు.

"ఎవరా ప్రసన్నకుమార్? " భుజంగరావు గదమాయించాడు.

"మా బాటనీ సార్" అంది శశి.

"ఆయనతో ఎప్పుడైనా మాట్లాడావా? "

"లేదు"

"పోనీ ఆయనైనా నీతో మాట్లాడాడా? "

"లేదు"

"ఆయన ఎక్కడుంటాడు? "

"తెలీదు"

భుజంగరావుకు కోపం ఇంకా ఎక్కువ యింది.

"ఆయన గురించి ఏమీ తెలీదు. అయి నా ఆయనను ప్రేమించావన్న మాట. చూడవే నీ కూతురు చేసిన పని" అని రోహిణి వైపు చూస్తూ అన్నాడు తర్వాత కూతురి వైపు తిరిగి.

"చదువుకొమ్మని కాలేజీకి పంపిస్తే ఇదా నీవు చేసిన నిర్వాకం? " సహనం కోల్పోయి, కోపంతో ఊగిపోయాడు భుజం గరావు.

శశి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"ఏమ్మా? మీరు కూడా తనతో చదివారు కదా! తనతో స్నేహంగా వుండినారు కదా! మీరయినా తనను మందలించ లేకపో యారా? " అని అడిగాడు.

వాళ్ళకు ఏం చెప్పాలో అర్థం కాలేదు.

ఏదో సరదాకు కుమార్ సార్ విషయంలో శశిని ఆటపట్టించారే తప్ప శశి మనసులో తమకు తెలియకుండానే 'ప్రేమబీజం' నాటామని వారికీ అప్పటివరకూ తెలీదు.

విషయం చాలాదూరం వచ్చింది. ముగ్గురూ చాలా గిల్టీగా ఫీల్ అయ్యారు. అందుకే భుజంగరావుకు ఏమీ చెప్పలేకపోయారు.

"అంకుల్! మీరు ఏమీ అనుకోకపోతే ఒక విషయం చెప్తాను" అంది చంద్రిక చివరకు.

"చెప్పమ్మా" అన్నాడు భుజంగరావు.

"కుమార్ సార్ చాలా మంచి మనిషి. కాలేజీలో స్టూడెంట్స్ అందరికీ ఆ సార్ క్లాసంటే చాలా ఇష్టం. తన డ్యూటీ తన ధోరణిలో చేసుకుంటూ పోతాడు. పర్సనల్ విషయాలకు తావివ్వడు. చాలా స్ట్రిక్టు మనిషి. ఒకవేళ మీరు ఒప్పుకుంటే మేం ముగ్గురం కాలేజీకి వెళ్ళి కుమార్ సార్‌తో మాట్లాడి వస్తాం" అంది చంద్రిక.

"అవును, ఇది బాగుంది" అంది రోహిణి భర్తతో.

"సరే! ఏదో ఒకటి చేయండి" అన్నాడు భుజంగరావు ఏమనాలో తోచక.

ఇంతలో బయటి నుండి కోటేశ్వరరావు 'షికారు పిలుపు' వచ్చింది.

భుజంగరావు బయటికి బయలుదేరాడు.

భుజంగరావు అలా బయటికి వెళ్ళగానే చంద్రిక, విజయ, వైదేహి ముగ్గురూ శశితో పక్కగదిలోకి వెళ్ళారు.

"శశీ! మమ్మల్ని క్షమించవే. మేము సరదాకు ఆట పట్టించామే తప్ప ఇలా నిన్ను కుమార్ సార్ వైపు ప్రోత్సహిస్తున్నామని అనుకోలేదు" అన్నారు ముగ్గురూ.

"అదేం లేదే! ఎందుకో ఆయన మొదటి క్లాసు నుంచే కుమార్ సార్ పైన నాకు అభిమానం పెరిగింది. ఆయన స్టైలూ, పాఠం చెప్పే పద్ధతి, నడక, నడవడికా అన్నీ నాకు నచ్చాయి. నాకు తెలియకుండానే మనసులోనే నేను ఆయన్ని ప్రేమించాను. ఆయన సమక్షంలోనే వుండి పోదామనిపిస్తూ వుంటుంది. ఇందులో మీ తప్పేమీ లేదు" అంది శశి.

"మరి ఈ మూడేండ్లలో మాతో ఒక్కసారైనా ఎందుకు చెప్పలేదు? "

"అదే నా బలహీనత. ఎందుకో ధైర్యం చాలలేదు. అందుకే చెప్పలేకపోయాను"

"మరి ఇప్పుడు ఆ ధైర్యం ఎలా వచ్చింది? "

"నాన్నవాళ్ళు పెళ్ళి సంబంధాలు చూస్తామన్నారు. ఎవరికో ఒకరికి కట్టబెడతారు. ఆ జీవితం నేను ఊహించుకోలేను. జీవితంలో బలి పశువును కాకముందే కష్టమో, నిష్ఠూరమో ఏదో ఒకటి తేల్చుకుందామనే ధైర్యం చేశాను. బాగా లేటయినా ఇదే సరయిన సమయం కదా!"

"సరేలే! మేం ముగ్గురమూ రేపు కాలేజీకి వెళ్ళి కుమార్ సార్‌తో మాట్లాడి వస్తాం. కాలేజీలో చదువుకుంటున్నామే తప్ప లెక్చరర్ల పర్సనల్ విషయాల గురించి ఎప్పుడూ పట్టించుకోలేదు కదా! నువు ధైర్యంగా వుండు. శుభవార్తతో తిరిగి వస్తాంలే" అంటూ ముగ్గురూ వాళ్ళ వాళ్ళ ఇళ్లకు బయలుదేరారు.

### కొత్తగాలి...

**వెదురు బొంగుకు కూడా**
**ఒక రోజొస్తుంది**
**జెండా కర్రగ మారి**
**జేజే లందుకుంటుంది**

– పి.వి. రమణకుమార్,
చిలకలూరి పేట

మరుసటి రోజు చంద్రిక, విజయ, వైదేహి కాలేజీకి బయలుదేరుదామని నిశ్చయించుకున్నారు.

★ ★ ★

దాదాపు ఆరునెలల తర్వాత తమ చదువుల దేవాలయానికి వెళ్తున్నారు చంద్రిక, విజయ, వైదేహి. ఏవేవో తీపి గురుతులు. తీపి అనుభూతులు. ఒక్కొక్కరు ఒక్కో రకంగా తమ అనుభూతులను నెమరు వేసుకుంటున్నారు. అందుకే వాళ్ళ మధ్య గంభీరమైన మౌనం నెలకొనివుంది.

తాపీగా, ప్రశాంతంగా వెళ్తున్నారు. ముందులాగ హడావిడిగా ప్రయాణం చేయడంలేదు. పైగా గర్వంగా వెళ్తున్నారు. ఎందుకంటే పోస్టు గ్రాడ్యుయేషన్‌లో చేరారు కాబట్టి. ఎటొచ్చీ శశి గురించిన ఆలోచనలే వాళ్ళను కలవరపెడ్తున్నాయి.

బస్సు కాలేజీ దగ్గర ఆగింది. ముగ్గురూ బస్సు దిగారు. కాలేజీలోకి వెళ్ళారు. ముందుగా వెయిటింగ్ రూముకు వెళ్ళారు. అక్కడ కొంతసేపు తమ పాత అనుభవాలను తలచుకున్నారు. అక్కడి నుండి నేరుగా బాటనీ స్టాఫ్ రూముకు వెళ్ళారు. స్టాఫ్ రూములో శ్రీనివాసరావు సార్ పుస్తకం చదువుకుంటూ వున్నాడు.

ముగ్గురూ ఒకేసారి "గుడ్ మానింగ్ సార్" అన్నారు.

"గుడ్ మానింగ్. రండమ్మా! కూర్చోండి!" అన్నాడు.

వాళ్ళు కూర్చోలేదు. గురువుల ముందర ఎలా కూర్చుంటారు?

"మీరు ఎస్వీ యూనివర్సిటీలో మైక్రోబయాలజీలో చేరారట కదా! కంగ్రాట్స్" అన్నాడు శ్రీనివాసరావు.

థాంక్స్ చెప్పారు ముగ్గురూ. 'మాస్టారుకు ఎలా తెలిసింది?' అనుకున్నారు. 'కాలేజీ రిజల్ట్సు రాగానే ఎవరెవరికి ఏయే క్లాస్ వచ్చింది.. ఎవరెవరు ఎక్కడ చేరారు?' అనే విషయాలు కాలేజీలో లెక్చరర్లు, విద్యార్థులు, ఇతరులు చర్చించుకుంటారని వాళ్ళకు తెలియదు.

"ప్రసన్నకుమార్ మాస్టారు లేరా సార్?" ఉండబట్టలేక అడిగారు.

"సార్‌కు ట్రాన్స్‌ఫర్ అయిందిగదమ్మా. ఆయన ఫ్యామిలీతో అనంతపురానికి వెళ్ళిపోయారు. మీ రిజల్ట్సు వచ్చిన వారానికే సార్‌కు ట్రాన్స్‌ఫర్ వచ్చింది"

ఒక్కసారి ముగ్గురూ అచేతనంగా వుండిపోయారు. ఏం మాట్లాడాలో తెలియలేదు. కాలేజీ బెల్ ఠంగ్ ఠంగ్‌మని మోగింది. ఆ శబ్దానికి షాక్ నుండి కోలుకున్నారు.

"క్లాసు వుందమ్మా వస్తాను!" అని చెప్పి శ్రీనివాసరావు సార్ వెళ్ళిపోయారు.

బాటనీ డిపార్టుమెంట్ నుండి బయటికి వచ్చారు. మైక్రోబయాలజీ, కెమిస్ట్రీ స్టాఫ్ రూములకు వెళ్ళి లెక్చరర్లను పలుకరించి బయటికి వచ్చారు.

ల్యాబ్స్ వైపు బయలుదేరారు. మొదటగా బాటనీల్యాబ్‌కు వెళ్ళారు. ల్యాబ్ ఖాళీగా వుంది. తాము కూర్చొన్న వర్క్‌టేబుల్స్, శశి కూర్చున్న వర్క్ టేబుల్ దగ్గరకు వెళ్లారు. ఆ టేబుల్ ఏడుస్తూ వున్నట్లు వాళ్ళకు కనబడింది.

ఇప్పుడు మధురస్మృతులు కాస్తా శోక స్మృతులుగా తయారయ్యాయి. శశికి ఏమని చెప్పాలి? శుభవార్త తెస్తామని బయలుదేరాం గదా! ఇప్పుడు ఈ వార్త ఎలా మోసుకుపోవాలి! శశి రియాక్షన్ ఎలా వుంటుంది? ఊహించుకోలేకపోయారు ముగ్గురూ!

"ఏమోనే! ఒక రెండు రోజులు ఆగి శశి ఇంటికి వెళ్ళి చెప్తే ఎలాగుంటుంది?" అంది విజయ.

"వద్దులే! శశి, మనం శుభవార్త తెస్తామని ఆత్రుతగా ఎదురుచూస్తూ

వుంటుంది! ఈ వార్త మనం వెంటనే చెప్పడం మంచిది. లేదంటే దానిని మానసికంగా హింసించినట్లవుతుంది. అందుకనే సాయంత్రమే వెళ్ళి చెబుదాం. ఎప్పుడు వెళ్ళి చెప్పినా జరగవలసింది జరగక తప్పదు గదా!" అంది వైదేహి.

సాయంత్రం నాలుగు గంటలయింది. వైదేహి స్కూటర్ మీద విజయ ఇంటికి వచ్చింది. విజయ రెడీగా వుంది. ఇద్దరూ కలిసి చంద్రిక ఇంటికి వచ్చారు. చంద్రిక ఇంట్లో కాసేపు కూర్చున్నారు. విజయ, చంద్రికవాళ్ళ పెద్దలకు శశి విషయం తెలియకుండా జాగ్రత్తపడ్డారు. ముగ్గురూ కలిసి శశి ఇంటికి బయలుదేరారు.

ఇల్లంతా 'తుపాను ముందు సముద్రం' లా నిశ్శబ్దంగా వుంది. హాల్లో ఎవరూ లేరు. "శశీ! శశీ!" అంటూ మెల్లగా పిలిచారు. శశి తన గదిలో నుండి హాల్లోకి వచ్చింది. రోహిణి, నాగమల్లిక, పక్కగదిలో నుండి వచ్చారు. భుజంగరావు కూడా తన గదిలో నుండి వచ్చాడు. అందర్నీ చూసి గాబరా పడ్డారు ముగ్గురు ఫ్రెండ్స్. అనుకోని, ఇష్టంలేని, కష్టమైన రాయబారమిప్పుడిది. వాళ్ళకు ఎలా మొదలు పెట్టాలో తెలియలేదు.

ఇంతలో రోహిణి అంది "ఏమ్మా! లెక్చరర్‌ను కలిశారా? "

"లేదు" అంది చంద్రిక నేల వైపు చూస్తూ.

"ఏమి? ఎందుకని? " ఆదుర్దాగా అడిగింది రోహిణి.

"ప్రసన్నకుమార్ సార్ అనంతపురానికి ట్రాన్స్‌ఫర్ మీద వెళ్ళిపోయారు" అంది విజయ.

"అయితే నేను అనంతపురానికి వెళ్ళి మాట్లాడి రానా? " అన్నాడు భుజంగరావు వ్యంగ్యంగా.

"అక్కర్లేదు అంకుల్. సార్ భార్యాపిల్లలతో అనంతపురానికి వెళ్ళారు" అంది వైదేహి.

శశి గుండెల్లో పిడుగు పడినట్లయింది! కళ్ళు బైర్లు కమ్మాయి. గుండెల్లో ఎవరో చేయి పెట్టి కెలికినట్లయింది. కళ్ళలో నీళ్ళ సుడిగుండాలు వరదల్లా పెల్లుబికాయి. ఈ దృశ్యం చూసి భుజంగరావుకు ఒకపక్క

## ఏది శ్రేష్ఠం?

ఏ విషయాన్నైనా అంగీకరింపజేసేలా చెప్పగల దిట్ట సంజీవదేవ్. ఒకసారి దివి, భువి గురించిన చర్చ వచ్చింది. అప్పుడు ఆయన చెప్పారిలా- 'స్వర్గంలో ఆనందం తప్ప బాధలుండవట. అదే స్వర్గంలోని



గొప్పలోపం. అసలు బాధ లేకపోవటమే ఒక గొప్ప బాధ! బాధ లేనిచోట ఆనందపు విలువ ఏమి తడుతుంది? ఎండలేని చోట నీడ విలువ తెలియదు. అదే భూమి మీది గొప్పతనం. ఇక్కడ ఆనందానికి తోడూ బాధలూ ఉంటాయి. స్వర్గంలో మృత్యువు ఉండదట. అచ్చంగా జీవించటమే జీవించటమట. మృత్యువులేని జీవితంతో విసుగెత్తిపోయి మృత్యువుకంటే ఎక్కువ భయంకరంగా కనబడుతుందా జీవితం. అందుకే దివికంటే భువి ఎక్కువ శ్రేష్ఠమైంది!' అన్నారు సంజీవదేవ్.

అంతటితోనే తన ప్రసంగాన్ని ఆపకుండా 'అందుకేనేమో ప్రజలలో ఎక్కువ మంది పాపాలు చేస్తారు! పుణ్యాలు చేస్తే స్వర్గానికి వెళ్ళాల్సి వస్తుందనే భయంతో!' అని ముక్తాయించారు ఆయన. దాంతో శ్రోతలు హర్షధ్వానాలు చేశారు.

కోపంగా వున్నా శశి మీద జాలితో కరిగి పోయాడు. 'అల్లారుముద్దుగా పెంచిన ముద్దుల కూతురు. అపరంజిబొమ్మలా వుండే కూతురు. పెద్ద కూతురులాగ సౌమ్యంగా వుండే అమ్మాయి. ఎందుకు ఇలా చేసింది? ' ఆలోచనల్లో పడ్డాడు భుజంగ రావు.

ఇంతలో "నేను సార్‌ను అడుగుతాను, వాళ్ళింట్లో ఉంచుకోమని. సార్ భార్యను బతిమలాడుతాను. వాళ్ళ అమ్మానాన్నలు వుంటే వాళ్ళను అడుగుతాను. లేదా సార్ వాళ్ళ అమ్మనాన్నలతో కూడ మాట్లాడుతాను, నాకు సార్‌వాళ్ళ ఇంట్లో మనిషిగా ఒకస్థానమివ్వమనీ. నేనే అనంతపురానికి వెళ్ళి మాట్లాడుతాను" అంది శశి పిచ్చిపట్టిన దానిలా ఉద్రేకంగా. సార్‌కు అప్పటికే పెళ్లయి ఉంటుందని ఆమె ఊహించలేదు మరి.

అంతే! హాల్లో పిడుగుపడినట్లయింది!

అందరూ ఒక్కసారిగా అవాక్కయ్యారు.

"ఏం అంటున్నావు? నీకేమన్నా తెలివి వుండి మాట్లాడుతున్నావా? " కోపంతో ఊగిపోయాడు భుజంగరావు.

"ఆయనకు పెళ్లయింది. మళ్లీ నిన్ను పెళ్ళి చేసుకొనమని అడుగుతావా? !" అంది సహనం కోల్పోయిన రోహిణి.

"అందుకు చట్టం ఒప్పుకోదు" తనకు తెలిసిన పరిజ్ఞానంతో బెదిరించిందావిడ.

"ఏం? ఉంపుడుగత్తెలాగ వుండాలనుకున్నావా? బుద్ధుందా? " ఈసారి నాగమల్లిక కూడా గదమాయించింది చెల్లిని.

"ఇదేమి విచిత్రమైన కోరికనే? " అంది చంద్రిక.

"దిక్కుతోచక ఏం మాట్లాడాలో తెలియకుండా మాట్లాడుతున్నావు. కొంచెం శాంతంగా ఆలోచించు" అంది విజయ.

"మీరెవ్వరూ నాకేమీ చెప్పవలసిన అవసరం లేదు. పెళ్ళి చేసుకోమని మళ్లీ నన్ను బలవంతం చేశారంటే ఆత్మహత్య చేసుకుంటాను" అల్టిమేటం జారీ చేసి గదిలోకి ఏడుస్తూ పరిగెత్తింది శశి. ఇప్పుడు హాలంతా పిడుగుతో బాటు భూకంపంతో దద్దరిల్లినట్లయింది.

★ ★ ★

వైదేహి అమ్మగారి పేరు స్వర్ణలత. గైనకాలజిస్టు. నాన్నగారి పేరు దయాకర్. జనరల్ ఫిజీషియన్. ఇద్దరూ ప్రైవేట్ ప్రాక్టీస్ చేస్తున్నారు. ఊర్లో మంచి పేరు వుంది. వివేకానందనగర్‌లో మూడంతస్తుల భవనం వుంది. ఐదారుమంది పని మనుషులు కూడ వున్నారు. అదే వీధిలో వాళ్ళ క్లినిక్ కూడా వుంది. ఇదేగాక రకరకాల ప్లాట్లు, కమర్షియల్ బిల్డింగులు కూడా వున్నాయి.

స్వర్ణలత, దయాకర్‌లు హాల్లో కూర్చోని ఏదో మాట్లాడుకుంటున్నారు. వైదేహి హాల్లోకి వచ్చింది.

"అమ్మా! ఒక ప్రాబ్లం వచ్చింది" అంది వైదేహి.

"ఎవరికి? నీకా? " అడిగింది స్వర్ణలత.

"లేదు, నాఫ్రెండు శశికి"

"ఏమిటా ప్రాబ్లం? "

శశి విషయమంతా అమ్మానాన్నలకు వైదేహి వివరంగా చెప్పింది.

"ఆ పిల్ల పెళ్ళి చేసుకోనంటోంది. కుమార్‌సార్‌తోనే వుండాలనుకుంటోంది. అది జరిగే పని కాదు. పెళ్ళి ప్రయత్నాలు చేస్తే ఆత్మహత్య చేసుకుంటానంటోంది" అంది వైదేహి.

"సో ఇట్ ఈజ్ అబ్సెషన్ విత్ లవ్" అన్నాడు దయాకర్ దీర్ఘంగా ఆలోచించి.

"మీ పెద్దమ్మ కొడుకు డాక్టర్ భాస్కర్ సైకియాట్రిస్ట్ కదా! ఆ అమ్మాయికి కౌన్సిలింగ్ చేస్తాడేమో వెళ్ళి అడుగు" అంది స్వర్ణలత.

మరుసటి రోజు వైదేహి వాళ్ళ పెద్దమ్మ

ఇంటికి వెళ్ళింది. భాస్కర్ హాల్లో కూర్చొని ఉన్నాడు. అతనికి సైకియాట్రిస్ట్‌గా మంచి పేరు ఉంది.

"ఏమ్మా! మేమిప్పుడు కనబడుతూ ఉన్నామా?" అంది భాస్కర్ అమ్మ సుగాత్రి వ్యంగ్యంగా.

"లేదు పెద్దమ్మా! పని వుండి వచ్చాను" అంది వైదేహి.

"అంతేలే! పని వుంటేనే వస్తారు!" అంది వ్యంగ్యంగానే.

కేవలం మాట వరుసకే అలా అనింది కాని తన మాటల్లో వేరే అర్థం లేదు.

"ఏం! వైదేహి? పోస్టుగ్రాడ్యుయేషన్ కోర్సు ఎలా ఉంది?" అడిగాడు భాస్కర్.

"బాగానే వుంది అన్నయ్యా! నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడుదామని వచ్చాను"

"చెప్పు!"

మళ్ళీ శశికథ అంతా పూసగుచ్చినట్లు చెప్పింది వైదేహి.

"అమ్మ కూడ చెప్పింది, అమ్మాయికి కౌన్సిలింగ్ చేస్తావేమో నిన్నడగమనీ"

"నీ స్నేహితురాలికి అంత మాత్రం సహాయం చేయలేనా? తప్పకుండా చేస్తాను. అయితే నేను సాధారణంగా పేషెంట్లను క్లినిక్ దగ్గర చూస్తూ ఉంటాను. ఆ అమ్మాయి నీ ఫ్రెండు అంటున్నావు కాబట్టి క్లినిక్ దగ్గర చూడను. క్లినిక్‌కు రప్పించుకుంటే ఆ అమ్మాయి భవిష్యత్తుకు ఇబ్బందిగా ఉంటుంది కదా!" అన్నాడు భాస్కర్.

"నేను మామూలుగా ఆరు గంటలకు క్లినిక్‌కు వెళ్తాను. అంతకు ముందే అంటే నాలుగు గంటలకో ఐదు గంటలకో ఒకగంట సేపు కౌన్సిలింగ్ చేస్తే సరిపోతుంది. నువు ఆ అమ్మాయిని మీ ఇంటికి పిలుచుకొని వస్తే నేను అక్కడికే వచ్చి కౌన్సిలింగ్ చేస్తాను. పైగా ఆ అమ్మాయికి కౌన్సిలింగ్ అని గాని, నేను సైకియాట్రిస్ట్ అని గాని చెప్పొద్దు. నీ బ్రదర్‌గా పరిచయం చేయి. ఎందుకంటే కౌన్సిలింగ్ అనీ, అదీ ఇదీ అని చెప్పామంటే వాళ్ళు సహకరించరు. మీ ఇంట్లో కూడ నేను ఒక డాక్టర్‌లాగ కౌన్సిలింగ్ చేయను. ఏ మాత్రం ఆ అమ్మాయికి అనుమానం వచ్చినా మరుసటి రోజునుండి రాకపోవచ్చు.

ఇంట్లో వాతావరణం కూడా ఎలా ఉండాలంటే చాలా సాధారణంగా వుండాలి. ఏదో ఒక ఇండోర్‌గేమ్ ఆడుతూ వున్నట్లు, సరదాగా మాట్లాడుకుంటూ వున్నట్లు వుండాలి. మిగతాది నేను చూసుకుంటాను. మరొక్క విషయం.. నువు ప్రతిరోజూ సాయంత్రం నాలుగు గంటలకు పిలుచుకొని వస్తూవుంటే ఆ వీధిలోని వాళ్ళు అనుమానపడవచ్చు. అందుకని ఆ వీధిలో నీకు ఇంకా ఎవరైనా ఫ్రెండ్స్ వుంటే ఒకరోజు నువ్వు, ఒకరోజు వాళ్ళు వస్తే ఎలాంటి అనుమానం రాదు. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే ఆ అమ్మాయి నీ బెస్ట్‌ఫ్రెండ్ అన్నావు కాబట్టి. పైగా ఏదో విధంగా ఒక సైకియాట్రిస్ట్ దగ్గర ట్రీట్‌మెంట్ తీసుకుందని బయటికి తెలిస్తే ఆ అమ్మాయి భవిష్యత్తుకే పెద్దదెబ్బ కదా?" అన్నాడు డాక్టర్ భాస్కర్.

## కొత్తగాలి...

**గుండెల మీద కుంపటి**
**కూతురు!**
**నెత్తిన కొరివి**
**కొడుకు!**

– నితీష్ చంద్రశేఖర్,
కర్నూలు

"థ్యాంక్స్ అన్నయ్యా! నేను ఇవాళే వాళ్ల నాన్నతో మాట్లాడి, ఎలా ప్లాన్ చేయాలో నీకు మళ్ళీ చెప్తాను" అని ఇంటికి బయలు దేరింది వైదేహి.

ఆ రోజు సాయంత్రం శశివాళ్ళ నాన్నకు ఫోన్ చేసింది వైదేహి.

"అంకుల్! శశి వుందా? "

"లేదమ్మా! బయటికి వెళ్ళింది"

"నేను మీతోనే మాట్లాడాలి అంకుల్"

"రామ్మా! ఇంట్లోనే వుంటాను"

"పది నిముషాల్లో అక్కడ వుంటాను అంకుల్" అంది వైదేహి.

చెప్పినట్లే పది నిముషాల్లో శశి ఇంటికి వచ్చింది. హాల్లో రోహిణి కనబడింది.

"ఆంటీ! శశి ఎక్కడికి వెళ్ళింది? "

"శశి, నాగి ఇప్పుడే బజారుకు వెళ్లా రమ్మా" అంది రోహిణి.

భుజంగరావు హాల్లోకి వచ్చాడు.

"నమస్తే అంకుల్!"

"ఏమ్మా! నాతో ఏదో మాట్లాడాలని అన్నావు"

"అవును అంకుల్. శశి విషయమే!"

కొంచెంసేపు మౌనం.

"అంకుల్ మీరు ఏమీ అనుకోకపోతే ఒక విషయం చెప్తాను"

"చెప్పమ్మా!"

"మా అన్నయ్య డాక్టర్ భాస్కర్ సైకి యాట్రిస్టు అంకుల్. ఇప్పుడు శశి మాన సిక స్థితి అంత బాగోలేదు కాబట్టి అన్న య్యతో కౌన్సిలింగ్ ఇప్పిస్తే బాగుంటుం దని అనుకున్నాను. అదే విషయం అన్న య్యతో చెప్పాను. ఒప్పుకున్నాడు. మరి మీరు అంగీకరిస్తే నేనే శశిని మా ఇంటికి పిలుచుకొని పోయి కౌన్సిలింగ్ ఇప్పి స్తాను. ఈ మొండి పట్టుదల నుండి బయట పడుతుంది!" అంది వైదేహి.

"ఆ పనేదో చేయి తల్లీ! నీకు రుణపడి వుంటాను" అంది రోహిణి ఆవేదనతో.

భుజంగరావు ఏమీ చెప్పకుండా కొంచెం సేపు తటపటాయించడం గమనించింది వైదేహి. అప్పుడు భాస్కర్ చెప్పిన ప్లానంతా వివరించింది.

భుజంగరావు మనసు ఇప్పుడు కుదుట పడింది. "అట్లాగే చెయ్యమ్మా! దాని ఖర్మ ఎలా రాసి వుంటే అలా జరుగుతుంది" బాధతో అన్నాడు భుజంగరావు.

ఆయనకు దగ్గు కూడ ముదిరింది. పొరలు పొరలుగా వస్తోంది. రోహిణి మంచినీళ్ళు, ట్యాబ్లెట్లు తెచ్చియిచ్చింది.

"శశిని రేపటి నుండి తీసుకెళ్తాను అంకుల్" అని చెప్పి వాళ్ళింటి నుండి బయలుదేరింది వైదేహి.

తిన్నగా చంద్రిక ఇంటికి వెళ్లింది. విజ యను కూడ చంద్రిక ఇంటికి రమ్మని ఫోన్ చేశారు ఇద్దరూ. చంద్రికకు, విజ యకు భాస్కర్ చెప్పిన ప్లానంతా వివరిం చింది వైదేహి.

శశి కోసం ఏమైనా చేస్తామని వాళ్ళూ ఒప్పుకున్నారు.

శశికి తెలియకుండానే కౌన్సిలింగ్‌కు శ్రీకారం జరిగింది.

మొదటిరోజు వైదేహి సాయంత్రం నాలుగు గంటలకు శశి ఇంటికి వచ్చింది. "శశీ! ఎప్పుడూ ఇంట్లో వుండి ఏం చేస్తావు? మా ఇంటికి పోదాం రా! అమ్మా నాన్నలు క్లినిక్‌కు పోయారు. నాకు బోర్‌గా వుంది. కాసేపు మాఇంట్లో గడి పాక మళ్ళీ నిన్ను మీ ఇంట్లో దిగబెడతా నులే!" అంది వైదేహి.

శశి సమాధానం చెప్పేలోపే "ఆంటీ! శశిని మా ఇంటికి పిలుచుకొని వెళ్తు న్నాను, సరేనా? " అంది.

"అలాగే" అంది రోహిణి.

ఇంకేముంది! పర్మిషన్ వచ్చింది గదాని శశి వెంటనే బయల్దేరింది.

ఆక్టివా మీద ఇద్దరూ వైదేహి ఇంటికి



వచ్చారు.

"శశీ! కాసేపు క్యారంబోర్డు ఆడదాం" అంది వైదేహి.

అలా ఆట మొదలు పెట్టారో లేదో భాస్కర్ కూడా వచ్చాడు. అనుకున్నట్లు గానే భాస్కర్‌ను పరిచయం చేసింది.

"రా అన్నయ్యా! ముగ్గురం క్యారంబోర్డు ఆడదాం" అంది.

ముగ్గురూ ఆడుతూ, పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు. క్రమేణ భాస్కర్ ఆట ఆడుతూనే కౌన్సిలింగ్ మొదలుపెట్టాడు. అనుకున్నట్లుగానే మొదటిరోజు కౌన్సిలింగ్ విజయవంతంగా జరిగింది.

అలా రెండోరోజు చంద్రిక, ఆ తర్వాత

విజయ, వైదేహి...ఇలా శశిని పిలుచుకొని వెళ్ళడం, కౌన్సిలింగ్ చేయించడం, ఒక్కొక్కసారి ముగ్గురూ కలిసి భాస్కర్‌తో కబుర్లు చెప్పుకుంటున్నట్లుగానే అంతా తమాషాగా వారంరోజులు సరదాగా జరిగిపోయింది.

శశికి కొన్నిరోజులు స్థల మార్పిడి చేయిస్తే బాగుంటుందని వైదేహితో చెప్పాడు భాస్కర్. ఆ విషయం వైదేహి రోహిణితో చెప్పింది.

ఇంతలో యూనివర్సిటీ నుండి కబురు వచ్చింది, సెలవుల తర్వాత రెండురోజుల్లో క్లాసులు మొదలవుతాయని. ముగ్గురు ఫ్రెండ్స్ శశికి బై చెప్పి యూనివర్సిటికి బయలుదేరారు.

భుజంగరావు ఆరోగ్యపరిస్థితి మరీ క్షీణిస్తోంది. దగ్గు పొరలు పొరలుగా రావడమే కాకుండా ఊపిరితిత్తులలో బాగా కఫం చేరుకుంది. పూర్తిగా నీరసంగా మంచం మీదనే పడుంటున్నాడు.

నాగమల్లిక, కోటేశ్వరరావుకు ఫోన్‌చేసింది. ఆయన వచ్చాడు. భుజంగరావుకు మాట్లాడేశక్తి కూడా లేదు.

కోటేశ్వరరావు, నాగమల్లిక, శశి ముగ్గురూ భుజంగరావును 'అపోలో నర్సింగ్ హోమ్'కు తీసుకెళ్ళారు. రోహిణి ఇంట్లోనే వుండిపోయింది.

ఆస్పత్రిలో డాక్టర్లు భుజంగరావును పరీక్షించారు. లంగ్ఇన్ఫెక్షన్ అని చెప్పారు. ఆస్పత్రిలో అడ్మిట్ కావాలని చెప్పారు.

అడ్మిషన్ ఫార్మాలిటీస్ అన్నీ కోటేశ్వరరావు పూర్తి చేశాడు. స్పెషల్ వార్డులో అడ్మిట్ చేశారు. రాత్రివరకు ముగ్గురూ ఆస్పత్రిలోనే ఉండిపోయారు. ఆరోజు రాత్రి అటెండెంట్‌గా వుండటానికి సాయంత్రం ఆరుగంటలకే నాగమల్లిక, రోహిణికి ఫోన్ చేసింది.

రోహిణి రాత్రికి కావలసిన ఆహారం, ఫ్లాస్క్‌లో హార్లిక్స్, కొన్ని పండ్లు, ఇతర సరంజామా తీసుకొని హాస్పిటల్ చేరుకుంది.

"మీరు వెళ్ళండి. రాత్రికి నేను చూసుకుంటానులే!" అని వాళ్ళ ముగ్గురిని ఇంటికి పంపించింది.

శశిని, నాగమల్లికను ఇంటి దగ్గర దిగబెడుతూ "రాత్రి మీకు తోడుగా ఆంటీని పంపిస్తానమ్మా!" అన్నాడు కోటేశ్వరరావు.

కోటేశ్వరరావు ఇల్లు పక్క వీధిలోనే ఉంది. ఇంటికి వెళ్ళి భార్య నాగలక్ష్మికి విషయం చెప్పి, వాళ్ళకు తోడుగా వుండమని చెప్పాడు. నాగలక్ష్మి కూడ త్వరగా భోంచేసి కోటేశ్వరరావుతో శశి ఇంటికి వచ్చింది.

కోటేశ్వరరావు కొంచెంసేపు వుండి ఇంటికి వెళ్ళాడు.

పగలు నాగమల్లిక ఇంట్లో టిఫిన్, భోజనం తయారు చేయడం, శశి వాటిని తీసుకొని ఆస్పత్రికి వెళ్ళడం, రోహిణి ఇంటికి రావడం, మరలా రాత్రి అటెండెంట్‌గా వెళ్ళడం, ఇలా వారంరోజుల పాటు హాస్పిటల్‌లో డ్యూటీ చేశారు ఇద్దరూ. క్రమేణా భుజంగరావు కోలుకున్నాడు. ఓ వారం రోజుల తర్వాత ఆయన ఆరోగ్యం మెరుగుపడింది. డాక్టర్లు డిశ్చార్జ్ చేశారు. కోటేశ్వరరావే దగ్గరుండి అదంతా చూసుకు

## కొత్తగాలి...

**జీవనయానంలో**
**ఆటుపోట్లు సహజం**
**చెప్పడం తేలిక**
**భరించటం కష్టం**

– కృష్ణ మాదవరపు,
కాకినాడ

న్నాడు. అయితే డాక్టర్లు కోటేశ్వరరావుతో 'పేషంట్‌ను చలిగాలిలేని ఆహ్లాదకరమైన చోటికి ఓవారం పదిరోజులు తీసుకొని వెళ్ళితే బాగుంటుంది' అని సలహా ఇచ్చారు.

భుజంగరావు ఇంటికి రాగానే హాస్పిటల్‌కు అయిన ఖర్చును కోటేశ్వరరావుకు ఇచ్చేశాడు. అవసరంలో ఆదుకునేవాడే మంచి స్నేహితుడు. స్నేహానికి మారు పేర్లు వాళ్ళిద్దరూ!

డాక్టర్లు చెప్పిన విషయాన్ని భుజంగరావుకు చెప్పాడు కోటేశ్వరరావు. రోహిణి కూడా శశి విషయంలో డాక్టర్ భాస్కర్ చెప్పిన విషయం ప్రస్తావించింది.

"నాకు తెలిసి చలిగాలులు ఎక్కువగా లేని ఆహ్లాదకరమైన ప్లేస్ ఒక్కటే. అదే మైసూర్" అన్నాడు కోటేశ్వరావు.

"మరి వెళ్దామా? " అంది రోహిణి భుజంగరావును చూస్తూ.

"నాకోసం కాకపోయినా శశి కోసమైనా వెళ్ళాలేమో కదా!" అన్నాడు భుజంగరావు.

"అన్నయ్యా! మాతోబాటు మీరూ, నాగలక్ష్మి కూడా రావచ్చుగా. అందరం సరదాగా వెళ్ళి వద్దాం" అంది రోహిణి.

"నాకేం అభ్యంతరం లేదమ్మా!" అన్నాడు కోటేశ్వరరావు.

"నాకు తెలిసిన స్నేహితుడొకడున్నాడు మైసూరులో. మరీ పోష్ హోటలులో కాకుండా రీజనబుల్ రేట్సు వుండే హోటల్‌లో గది బుక్ చేయమని చెప్తాను, మీరు ప్రయాణం ఖరారు చేస్తే" అన్నాడు కోటేశ్వరరావు.

"శశి మాతో రావడానికి ఒప్పుకుంటుందో లేదో" అనుమానం వ్యక్తం చేసింది రోహిణి.

"ఏం? ఎందుకు ఒప్పుకోదు? " కోపంగా అన్నాడు భుజంగరావు.

"అది ఇప్పటికే ఒకలాగ ఉంది. దాన్ని కదిలించాలంటే భయంగా ఉంటుంది. ఎందుకు ఇలా అయిందనే కుమిలిపోతున్నాను" కడుపులోని బాధనంతా వెళ్ళగక్కింది రోహిణి.

"అందుకనే గదమ్మా! కొంచెం స్థలమార్పిడి చేస్తే కుదుటబడుతుందని చెప్పారు. ఈ ప్రయాణం వల్ల ఇద్దరూ కోలుకుంటారు కదా! డాక్టర్లు ముందే చెప్పారు కదమ్మా! అంతా సర్దుకుపోతుంది. మీరు ఏమీ కంగారు పడొద్దు" అని ధైర్యం చెప్పాడు కోటేశ్వరరావు.

ఈ సంభాషణ జరిగే సందర్భంలో శశి, నాగమల్లిక ఇద్దరూ ఇంట్లో లేరు.

రెండురోజులు గడిచాక రోహిణి నాగమల్లికతో "మనమందరం మైసూరుకు వెళ్తున్నాం. నాన్న ఆరోగ్యం బాగా కుదుటబడటానికి ఓసారి వెళ్లి రండని డాక్టర్లే చెప్పారు" అంది.

చదువు మానేసిన తర్వాత శశి ఏ విషయంలోనూ ఆసక్తి చూపడం లేదు. ఏదో పరధ్యానంగా, ముభావంగా ఉంటోంది. మునుపు వున్నంత చలాకీగా ఉండటం లేదు. జీవితంలో ఏదో పోగొట్టుకొన్న దానిలా ఉండేది. భాస్కర్ కౌన్సిలింగ్‌లో కొంత కుదుటపడినా పూర్తిగా కోలుకోలేదనే చెప్పాలి. నాన్న ఆరోగ్యం కోసం ఊరెళ్లాలి. తన ఒక్కదానిని వదిలి వెళ్ళలేరు. ఇది తప్పని పరిస్థితి. నాన్న ఆరోగ్యం కుదుటబడితే అదే చాలనుకుంది శశి.

మైసూరు వెళ్ళడానికి అందరూ నిర్ణయించుకున్నారు.

కోటేశ్వరరావుకు విషయం చెప్పారు. ఆయన వెంటనే మైసూరులో ఉన్న తన స్నేహితునికి ఫోన్‌చేసి ఒక హోటల్‌లో మూడు గదులు రిజర్వు చేయమని చెప్పాడు. వాళ్ళు మైసూర్‌కు వచ్చే తేది కూడా చెప్పాడు. కోటేశ్వరరావు, భుజంగరావు ఇద్దరూ కలిసి రైల్వే రిజర్వేషన్



కూడ ముందే చేసేశారు. అనుకున్న తేదీకి ఆరుగురు, అంటే కోటేశ్వరరావు, నాగ లక్ష్మి, భుజంగరావు, రోహిణి, నాగమల్లిక, శశి కలిసి రైల్లో మైసూరుకు బయలుదే రారు. మొదట బెంగళూరుకు చేరుకొని అక్కడి నుండి మైసూరుకు వెళ్లారు.

మైసూరులో కోటేశ్వరరావు స్నేహితుడు జగన్నాథరావు వాళ్ళను రిసీవ్ చేసుకు న్నాడు. అందరూ కలిసి హోటల్ బృందా వన్‌కు చేరుకున్నారు. భుజంగరావు దంప తులు ఓ గదిలో, కోటేశ్వరరావు దంప తులు ఇంకొక గదిలో, నాగమల్లిక, శశి వేరొక గదిలో సర్దుకున్నారు.

మైసూరు చాలా సుందరమైన నగరం. చారిత్రక నగరం, ఎంతో ఆహ్లాదకరమైన నగరం, కాలుష్యం తక్కువగా వుంటుంది. విశాలమైన రోడ్లతో రాజభవనాలతో, కూడ ళ్ళలో రాజ విగ్రహాలతో, రోడ్లకిరువైపులా పెద్దపెద్ద చెట్లతో, వాహనాల రాకపోకలకు చక్కని నియంత్రణతో, ఏమాత్రం చిరాకు కలిగించని, సంతోషదాయకమైన నగరం మైసూరు.

రిటైరయితే మైసూరులోనే స్థిరపడుదా మనుకొనేవారు ఎందరో! అన్నిరకాల వయసువారిని ఉత్తేజపరిచే సోయగాల నగరం మైసూరు.

మైసూరులో చూడదగ్గ ప్రదేశాలను జగ న్నాథరావు వాళ్ళకు వివరించాడు.

మరుసటి రోజు ఉదయమే చాముండి కొండకు బయలు దేరుదామనుకున్నారు. మొదటగా చాముండేశ్వరి దేవిని దర్శించు కుంటే అన్ని కష్టాలు తీరుతాయని వారి నమ్మకం. అట్లాగే అక్కడే వున్న మైసూరు మహారాజావారి 'వేసవి విడిది' కూడా చూద్దామనుకున్నారు.

పొద్దున్నే చాముండేశ్వరీదేవి దర్శనం చేసుకున్నారు. కొండమీదికి బస్సులో వెళ్తుంటే ఎంతో ప్రశాంతంగా వుంది. దేవా లయం కూడా చాల పెద్దది. శక్తిపీఠాలలో ఒకటైన చాముండేశ్వరీదేవి విగ్రహాన్ని చాలా చక్కగా అలంకరించారు. దర్శనం చేసుకున్నాక కాసేపు గుడిలోనే గడిపారు.

తర్వాత మైసూరు మహారాజావారి వేస వి విడిది వద్దకు వెళ్ళారు. ప్యాలెస్ చూడ డానికి అక్కడివారు పర్మిషన్ లేదని చెప్పారు. బయటినుండే ఆ ప్యాలెస్‌ను, పరిసర ప్రాంతాల్ని చూశారు. తర్వాత రోడ్డుకు మధ్యన వున్న సర్కిల్‌లో మహి షాసురుడి విగ్రహాన్ని చూశారు. భయంక రంగా వున్న ఆ విగ్రహం ఒక టూరిస్ట్ అట్రాక్షన్. చాలామంది విగ్రహం ముందర నిల్చొని ఫొటోలు కూడా తీసు కుంటూ వుంటారు. సందర్శకులతో ఆ ప్రాంతమంతా సందడిగా వుంటుంది. బస్సులో తిరుగు ప్రయాణం చేస్తుండగా దారిలో భారీ నంది విగ్రహాన్ని కూడా చూశారు.

మైసూరుకు రావడం వారికి అదే మొద టిసారి. ఎంతో ఆహ్లాదకరంగా వుండే ఆ ప్రాంతాన్ని చూసి భుజంగరావు చాలా సంతోషపడ్డాడు.

"మనం చిత్తూరులో కాకుండా ఇక్కడ పుట్టుంటే బాగుండు" అన్నాడు భుజంగ రావు భార్యతో.

"వచ్చే జన్మలో పుడదాంలే!" అంది రోహిణి.

"వచ్చే జన్మలో కూడ నాతోనే వుంటావా? " జోక్ వేశాడు భుజంగరావు.

అందరూ నిండుగా నవ్వుకున్నారు.

మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. అందరూ హోటల్‌కు వచ్చారు. లంచ్ ముగించుకొని రూములకు వెళ్ళారు. భుజంగరావు ఆరోగ్యరీత్యా ఆ సాయంత్రం ఎటువంటి ప్రోగ్రామ్ వేయకుండా హోట ల్‌లోనే విశ్రాంతి తీసుకోవాలనుకున్నారు.

నాగమల్లిక, శశి, వాళ్ళరూంలోకి

వెళ్ళారు.

తమతోబాటు రోహిత్ కూడ వచ్చి వుండింటే బాగుండు అనుకుంది, నాగమల్లిక. ఏమైనా తల్లి మనసు కదా! వాడు లేకుండా తాను మాత్రం ఎలా ఎంజాయ్ చేస్తుంది? ఇప్పుడల్లా వాడికి సెలవులు ఇవ్వరు. క్రిస్టమస్ హాలిడేస్‌లోనే ఇంటికి వస్తాడు. అప్పుడప్పుడూ హాస్టల్ నుండి ఫోన్ చేస్తూ వుంటాడు. కాబట్టి బాగానే వున్నాడనుకొని తృప్తిపడుతూ వుంటుంది.

'నిజమే! పిల్లలతో ఇటువంటి ప్రయాణాలు చేయాలని ప్రతి తల్లిదండ్రులు అనుకుంటారు. కాని నాన్న ఆరోగ్యం కోసం అర్జెంటుగా ఇలా రావలసి వచ్చింది' అనుకుంది నాగమల్లిక.

"మంజుల, దాని పిల్లలు కూడ వచ్చివుండుంటే బాగుండు కదా!" అంది నాగమల్లిక శశితో.

శశి జవాబు చెప్పలేదు. మౌనంగా వుండిపోయింది.

"అది ఎప్పుడూ బిజీగానే వుంటుంది. వాళ్ళాయన ఎం.సి.ఎ.లో చేర్పించాలనుకుంటున్నారట. అయితే ఇంటి పనులతో తీరికలేదని అంటూ వుంటుంది" అంది నాగమల్లిక మళ్ళీ.

ఈ మాటలకు శశి నుండి ఎలాంటి సమాధానం రాలేదు.

ఏం మాట్లాడినా శశి జవాబు చెప్పకపోయేసరికి నాగమల్లికకు కోపం వచ్చింది.

"ఏం.. నువ్వు ఇక్కడికి ఇష్టం వుండి వచ్చావా లేదా?" గట్టిగా అడిగింది నాగమల్లిక.

"అదేం లేదక్కా! నాకూ మీలాగే ఎంజాయ్ చేద్దామనేవుంది గాని ఎందుకో నా చేత కావడం లేదు" అంది శశి.

మరుసటి రోజు ఉదయం మహారాజ ప్యాలెస్ చూద్దామని బయలుదేరారు అందరూ. దేశంలోనే అనేక సుందరమైన ప్యాలెస్‌లలో 'మైసూర్ ప్యాలెస్' ఒకటి. మైసూరు రాజుల చరిత్ర, వారి వైభవం, దసరా ఉత్సవాల వేడుకలు ఇవన్నీ గోడల మీద ఆయిల్ పెయింటింగ్స్ ద్వారా ప్యాలెస్‌ను తీర్చిదిద్దిన తీరు చూడవలసిందేకాని చెప్పడానికి, రాయడానికి అలవికాదు!

అట్లాగే ఆ కాలంనాటి రాజులు వాడిన వాహనాలు, ఆయుధాలు, ఫర్నీచర్, ఖరీదైన ఆభరణాలు చక్కగా అమర్చడం చేత ఎంత చూసినా ఇంకా చూద్దామనే కుతూహలం ఏర్పడుతుంది. భుజంగరావు అప్పుడప్పుడూ విశ్రాంతి తీసుకొంటూ నిదానంగా చూస్తూవున్నాడు.

కోటేశ్వరరావు, నాగలక్ష్మి కూడ బాగా ఎంజాయ్ చేస్తున్నారు. రోహిణి, శశి, నాగమల్లికలు కూడా చాలా ఆసక్తిగా ప్యాలెస్ అంతా కలియదిరిగారు. కోటేశ్వరరావు "నాకు ఇక్కడే వుండిపోదామని వుంది" అని నాగలక్ష్మితో అన్నాడు.

"అవును! సాయంత్రం ఐదు గంటల వరకు ఉండొచ్చు" అంది నాగలక్ష్మి.

అందరూ నవ్వుకున్నారు.

మధ్యాహ్నం ఒంటిగంటయింది. అందరూ మరలా హోటల్ చేరుకున్నారు. మధ్యాహ్న భోజనం ముగించుకున్నారు. విశ్రాంతి తీసుకొని సాయంత్రం 'బృందావన్ గార్డెన్స్' పోవాలని నిశ్చయించుకు

**కొత్తగాలి...**

**ముందు**
**హామీల వర్షం!**
**తర్వాత**
**చార్జీల మెరుపులు!!**

– జి. విజయశ్రీ,
శ్రీకాకుళం

న్నారు.

సాయంత్రం ఐదు గంటలకు జగన్నాథ రావు హోటల్‌కు వచ్చాడు. "ఎలా వుంది మైసూరు?" అని అడిగాడు, కోటేశ్వరరావును చూసి.

"చాలా బాగుంది" అన్నాడు.

"ఈ రెండు రోజుల్లో ఆరోగ్యం కాస్త కుదుటపడింది" అన్నాడు భుజంగరావు.

"బృందావన్ గార్డెన్స్ చాలా బాగుంటుందిలెండి" అన్నాడు జగన్నాథరావు.

కాసేపు అందరూ కబుర్లు చెప్పుకున్న తర్వాత ఆరు గంటలకు బస్సులో గార్డెన్స్‌కు బయలుదేరారు, జగన్నాథరావుతో సహా. బృందావన్ గార్డెన్స్ మైసూర్ నగరానికే ఒక పెద్ద సందర్శనీయ స్థలం. ఏళ్ళ తరబడి ఎన్నో సినిమా షూటింగ్స్ కూడ ఇక్కడనే జరిగేవి. ఇది నిజంగా ఒక భూతల స్వర్గం. సాయంత్రం వేళ విద్యుద్దీపాల అలంకరణతో దేదీప్యమానంగా వెలుగుతూ వుంటుంది. రకరకాల ఫౌంటెన్లు, పచ్చటి పాన్పులాంటి లాన్లు, ట్రిమ్మింగ్ చేసిన వివిధ రకాల మొక్కలు, అక్కడక్కడా విశ్రాంతి కొరకు కట్టిన సిమెంట్ సోఫాలు, మ్యూజికల్ ఫౌంటెన్, జలపాతంలో లాగ జలజల పారే నీటి పరవళ్ళు, కట్టడాలు, పక్కనే 'వాకింగ్ ట్రాక్', పిల్లలు పెద్దలు ఎంజాయ్ చేసే బోటు ప్రయాణం అన్నీ కలగలపిన ఆ ఉద్యానవనం నిజంగా 'బృందావనం'.

చల్లని పిల్లగాలులు వీస్తూంటే భుజంగరావు బృందం మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ ఉద్యానవనంలో నడుస్తున్నారు.

భుజంగరావు రోహిణి ఒక జతగా, వారి వెనుక కోటేశ్వరరావు నాగలక్ష్మి, జగన్నాథరావులు, వారి వెనుక నాగమల్లిక, శశి నడుస్తున్నారు.

ఇంతలో "ఏయ్ శశీ!" అంటూ పిలుపు వినబడింది.

శశి వెనుదిరిగి చూసింది.

"శశీ! నేను మాధవిని" అని పిలుస్తూ వస్తోందో అమ్మాయి.

డిగ్రీలో మాధవి, శశి క్లాస్‌మేట్స్. శశి గ్రూపుతో కాకుండా తను వేరే గ్రూపు ఫ్రెండ్స్‌తో వుండేది. క్లాసులో వేర్వేరు గ్రూపులుగా వున్నా ఇరవైమంది గర్ల్సులో అందరూ ఒకరికొకరు తెలిసినవాళ్ళే.

మాధవి శశి దగ్గరికి వచ్చింది. కూడా ఆరడుగుల మనిషి వున్నాడు.

"ఏయ్ మాధవీ! ఎలా గుర్తుపట్టావు?" అడిగింది శశి.

"మీ వెనుకే వస్తున్నాం. మొదట్లో నువ్వా కాదా అని అనుమానం వచ్చింది. తర్వాత కచ్చితంగా నువ్వే అనుకున్నాక పిలిచాను. బైది బై ఈయన మావారు అశోక్" అని తన భర్తను పరిచయం చేసింది శశికి.

శశి కూడ నాగమల్లికను వారికి పరిచయం చేసింది. భుజంగరావు అండ్ కో వీళ్ళకు కొంచెం దూరంలో వున్నారు.

"ఏం! ఎలా వున్నావు శశీ?" అంటూ చంద్రిక, విజయ, వైదేహి గురించి అడిగింది మాధవి. వాళ్ళంతా శశి ఫ్రెండ్స్ అని ఆమెకు బాగా తెలుసు.

"వాళ్లంతా ఎస్. వి. యూనివర్శిటీలో మైక్రోబయాలజీలో చేరారు" అంది శశి.

"నువు చేరలేదా?" అడిగింది మాధవి.

"లేదు"

"ఏదైనా జాబ్‌లో చేరావా?"

"లేదు"

"మరి ఏం చేస్తున్నావు?"

ఏమీ చేయకుండ వుండడం ఒక నేరమైనట్లు అడిగింది మాధవి. శశి ఏం జవాబు చెప్పాలో ఆలోచించే లోపే తానే అందుకుంది "మన డిగ్రీ అయిపోగానే నేను మా నాన్నవాళ్ళ దగ్గరికి హైదరాబాద్ వెళ్ళాను.

అప్పటికే పెళ్ళి సంబంధాలు చూస్తూ వుండినారు. ఈయన మాకు దూరపు బంధువవుతాడు. జాతకాలు కుదిరాయి. పెళ్లయింది. ఈయనకు ఢిల్లీలో సెంట్రల్ సెక్రటేరియట్‌లో ఉద్యోగం. పెళ్ళయిందన్న మాటేగాని ఇంతవరకు మేమెక్కడికీ ఔటింగ్ వెళ్ళలేదు. బెంగళూరులో ఈయన బంధువుల పెళ్ళివుంటే నాలుగు రోజులు సెలవుపెట్టడంతో రెండు రోజులు పబ్లిక్ హాలీడేస్ కలిసి వచ్చాయి. కాబట్టి బెంగళూరు వచ్చాం. ఆ పెండ్లి జరిగాక అత్తయ్య, మామయ్యలు అక్కడే వుండిపోతే మేమిద్దరం మైసూర్ చూద్దామని ఇలా వచ్చాం" అంది మాధవి గుక్కతిప్పుకోకుండా.

అనర్గళంగా మాట్లాడిందని, అలసిపోయి వుంటుందని చేతిలోని వాటర్‌బాటిల్ అందించాడు భార్యకు అశోక్ ఉడికించాలనే ఉద్దేశంతో.

"నాకేం దప్పిక కాలేదులే" అంది మాధవి.

ఇంతలో అశోక్ అందుకున్నాడు.

"పెళ్ళయిన తర్వాత ఏదైనా చదవాలని వుంటే చదువు. లేదా ఏదన్నా చిన్న జాబ్ చేయాలని వుంటే చేయి అని తనకు చెప్పాను. లేదు. మొదట హిందీ నేర్చుకుంటాను. తర్వాత జాబ్ చేయడమో, ఏదైనా కోర్సులో జాయిన్ కావడమో చేస్తాను అంది తను"

"పెళ్లయిందా?" అడిగింది మాధవి శశిని.

"లేదు" అంది శశి.

మాధవి, శశి క్లాస్‌మేట్స్ అయినా శశి గురించి అంతగా తెలియదు. ఎందుకంటే తను ఎప్పుడూ వేరే గ్రూపు ఫ్రెండ్స్‌తో వుంటుంది. కాబట్టి తనను ప్రశ్నలతో ఎక్కడ ఇబ్బంది పెడ్తుందోనని శశి వెంటనే మాధవి ఫ్రెండ్స్ గీత, గౌరి, సునందల గురించి అడిగింది. ఇలా వాళ్ళిద్దరూ డిగ్రీలో వాళ్ళ ఫ్రెండ్స్ గురించి, లెక్చరర్ల గురించి, వాళ్ళ బొటానికల్ టూర్ గురించి పాత జ్ఞాపకాలను నెమరువేసుకుంటూ నడుస్తున్నారు. పక్కనే అశోక్ వున్నాడనిగానీ, నాగమల్లిక వుందనిగాని పట్టించుకోకుండా మాట్లాడుకుంటున్నారు. ఎంతోకాలంగా దూరంగా వుంటూ, అకస్మాత్తుగా అనుకోని ప్రదేశంలో చిన్ననాటి స్నేహితులు, ముఖ్యంగా క్లాస్‌మేట్స్ కలిస్తే వారికి చుట్టుపక్కల పరిసరాలు ఏ మాత్రం కనబడవు.

ఉండబట్టలేక అశోక్ "ఏం! మీరిద్దరే మాట్లాడుకుంటారా! మేము కూడ వున్నామండి మీ పక్కనే" అన్నాడు వ్యంగ్యంగా.

వీళ్ళు ఇలా మాటల్లో నిదానంగా నడుస్తూవుంటే ముందరపోతూ వున్న జగన్నాథరావు "త్వరగా రండి" అన్న పిలుపు వినబడింది.

అందరూ వాళ్ళ వాళ్ళ గ్రూపుకు చేరుకున్నారు. మాధవిని, అశోక్‌ను వాళ్ళకు పరిచయం చేసింది శశి.

"ఇక్కడ కూర్చుందాం. కాసేపట్లో మ్యూజికల్ ఫౌంటెన్ మొదలవుతుంది" అన్నాడు జగన్నాథరావు.

అందరూ కూర్చుని వెయిట్ చేస్తున్నారు. జనమంతా తండోపతండాలుగా

## కొత్తగాలి...

**'కాషాయ' సంధ్య**
**'తెల్లని' కొంగ**
**'పచ్చని' పైరు**
**జాతీయ జెండా!**

*– లోగిశ లక్ష్మీనాయుడు,*
సింహాచలం

వస్తున్నారు. ఎవరికి తోచినట్లు వారు తమకు ఫౌంటెన్ చక్కగా కనబడే విధంగా సర్దుకుంటున్నారు.

ఇంతలో మ్యూజికల్ ఫౌంటెన్ మొదలయింది. రకరకాల రికార్డెడ్ రిథమిక్ మ్యూజిక్‌కు అనుగుణంగా ఫౌంటెన్ పైకి ఎగిసిపడుతూ, తగ్గుతూ వుంది. అంతా చూస్తూ వుంటే ఒక మ్యూజికల్ డ్యాన్స్ లాగ స్టెప్పులు వేస్తున్నట్లు చూడముచ్చటగా కనబడింది ఫౌంటెన్. పైగా రంగు రంగుల దీపాలు అమర్చడం వల్ల ఇంకాస్త సోయగం రంగరించుకుంది. చిన్న పిల్లలు కేరింతలు కొడుతూ, వాళ్ళూ ఫౌంటెన్‌తో బాటు స్టెప్పులు వేసుకుంటూ చాలా సరదాగా గడుపుతున్నారు. ఒక అర్థగంట అయిన తర్వాత 'షో' ముగిసింది. అందరూ అక్కడినుండి బయలుదేరారు.

రాత్రి 7.30 గంటలయింది. నిర్వాహక సిబ్బంది పర్యాటకులను ఎనిమిది గంటల లోపల ఖాళీ చేయమని అనౌన్స్ చేస్తున్నారు. తీవ్రవాదుల బెదిరింపుల నేపథ్యలో సెక్యూరిటీ సిబ్బంది పర్యాటకులను అక్కడి నుంచి త్వరగా ఖాళీ చేయమని హెచ్చరిస్తోంది. అందరూ బయటికి వచ్చేసి బస్‌స్టాప్ వద్దకు చేరుకున్నారు. తర్వాత అక్కడి నుంచి హోటల్‌కు వచ్చేశారు. రాత్రి భోజనం చేస్తుండగా కోటేశ్వరరావు మరుసటిరోజు ప్రోగ్రాం గురించి జగన్నాథరావును అడిగాడు.

"రేపు శ్రీరంగపట్టణానికి ఉదయమే బయలుదేరి పోదాం. అక్కడ చూడవలసిన ప్రదేశాలు చాలా వున్నాయి" అన్నాడు.

కొంచెంసేపు అందరూ మాట్లాడుకున్నాక జగన్నాథరావు ఇంటికి వెళ్లాడు.

మరునాడు ఉదయం తొమ్మిది గంటలకల్లా అందరూ శ్రీరంగపట్టణానికి బస్సులో బయలుదేరారు. శ్రీరంగపట్టణం మైసూరుకు పదహారు కిలోమీటర్ల దూరంలో ఉంది. శ్రీరంగ పట్టణంలో మొదట రంగనాథస్వామి ఆలయాన్ని చూడడానికి వెళ్ళారు. ఆలయం చాలా పెద్దది. పురాతనమైనది. టిప్పుసుల్తాన్ పరిపాలించే కాలంలో ఈ ఆలయానికి చాలా ప్రాధాన్యం ఉండేది. ఆలయంలోని పూజా కార్యక్రమాలనంతా టిప్పుసుల్తానే స్వయంగా పర్యవేక్షించేవాడని చెప్పుకుంటారు. ఆయన శ్రీరంగపట్టణాన్నే రాజధానిగా చేసుకుని పరిపాలించేవాడు.

ఆలయంలో శ్రీరంగనాథస్వామి విగ్రహం చాలా పెద్దది. శేషశయనుడిపై పవళించి ఉంటాడు స్వామి. రంగనాథుడిని దర్శించుకున్నాక అనేక ఉప ఆలయాల్లో ఉండే దేవుళ్ళను కూడ దర్శించుకొని తృప్తిగా బయటికి వచ్చింది భుజంగరావు బృందం.

తర్వాత 'దరియాదౌలత్'కు బయలుదేరారు. అక్కడ టిప్పుసుల్తాన్ తండ్రి హైదర్‌ఆలీ, టిప్పు సమాధులను చూశారు. ఈ సమాధుల వద్ద పచ్చని లాన్లు, చెట్లతో చూడచక్కని ఉద్యానవనాన్ని నిర్మించారు.

అటు తర్వాత టిప్పుసుల్తాన్ పరిపాలించే సమయంలో బ్రిటిష్ సైనికులను బంధించిన గుహను కూడ దర్శించుకున్నారు. శ్రీరంగపట్టణం చారిత్రక ప్రాధాన్యం కలిగి ఉండడమే కాకుండా ఆధ్యాత్మిక కేంద్రంగా కూడ ప్రాచుర్యం చెందింది.

ఇవన్నీ చూసేవేళకు మధ్యాహ్నం ఒంటిగంటయింది. ఒక హోటల్‌లో భోజనం చేసిన తర్వాత కాసేపు విశ్రాంతి తీసుకొని సాయంత్రం నాలుగు గంటలకు 'రంగనతిట్టు' అనే పక్షుల పరిరక్షణ కేంద్రానికి బయలుదేరారు.

శ్రీరంగపట్టణంలో ప్రవహించే కావేరి నది ఒడ్డున పక్షుల పరిరక్షణ కేంద్రం ఉంది. ఈ ప్రాంతంలోని నది చాలా





లోతుగా ఉంటుంది. నదికి ఆవలివైపు కొండలాంటి గుట్టలు ఉంటాయి. ఈ గుట్టల మీద ఉండే దట్టమైన చెట్ల కొమ్మల మీద రక రకాల పక్షులు స్థావరం ఏర్పర చుకొని ఉంటాయి. చాలా వరకు వేలాది కిలోమీటర్ల ప్రయాణించి వచ్చిన వలస పక్షులే ఉంటాయి. అవి ఇక్కడికి గుంపులు గుంపులుగా వస్తూ ఉంటాయి. పక్షులను చూడడానికే పర్యాటకులు వస్తూ ఉంటారు.

ఈ పక్షులను చాలా దగ్గరి నుండి చూడాలనుకుంటే నదిలో మరబోట్లలో ప్రయాణం చేయాలి. బోటు సిబ్బంది గుట్టల దగ్గరికి బోటును నడిపిస్తూ ఉంటారు. చాలా ఆహ్లాదకరంగా ఉంటుంది ఈ ప్రయాణం. ఇక్కడ ఇంకొక విశేషమేమంటే నదిలోని ఈ ప్రాంతంలో మొసళ్ళు కూడా ఎక్కువగా ఉంటాయి. బోటు ప్రయాణం చేసేటప్పుడు గుట్టల ఒడ్డున గుంపులు గుంపులుగా విశ్రాంతి తీసుకొంటున్న మొసళ్ళను కూడ చూడవచ్చు. ఇది కొంచెం భయంకరమైన ప్రదేశమని కూడ చెప్పవచ్చు.

బోటులో ప్రయాణించడానికి జనం 'క్యూ'లో ఉంటారు. జగన్నాథరావుతో పాటు భుజంగరావు బృందం క్యూలో నిలబడింది. టిక్కెట్లు కొన్న తర్వాత బోటు సిబ్బంది ఒక బోటులో సరిపడే పర్యాటకులను సర్దుతున్నారు. భుజంగరావు బృందం ఒకే బోటులో సర్దుకున్నారు.

మరబోటు మెల్లిగా బయలుదేరింది. బోటు సిబ్బంది నీళ్ళలో చేతులు పెట్టవద్దని, గట్టిగా అరవ వద్దని, కూర్చొన్న చోట కూర్చోండని, కదలవద్దని హెచ్చరికలు జారీ చేస్తున్నారు.

జగన్నాథరావు ఈ బోటు ప్రయాణంలో ఆ ప్రాంత ప్రజలు చెప్పుకొనే నిజంగా జరిగిన ఒకానొక సంఘటనను గురించి భుజంగరావు బృందానికి చెప్పడం ప్రారంభించాడు.

ఒకసారి ఇలాగే బోటులో దాదాపు పదిహేను మంది ప్రయాణం చేస్తున్నారు. వారిలో ఓ భార్యభర్తల జంట, తమ నాలుగేళ్ల కూతురు ప్రయాణం చేస్తున్నారు. వారు బోటులో ఓ అంచున కూర్చొని ఉన్నారు. అమ్మ ఒళ్ళో అమ్మాయి కూర్చొని ఉంది. అలా బోటు ప్రయాణిస్తుండగా ఆ అమ్మాయి హఠాత్తుగా నీళ్ళలో చేయి పెట్టింది.

అంతే! ఆ చేయిని ఒక మొసలి అందుకుంది. అమ్మాయి బిగ్గరగా ఏడుస్తూ ఉంది. పెనుగులాడుతూ ఉంది. పాప తల్లి కూడా బిగ్గరగా అరుస్తూ ఉంది. బోటు అటూ ఇటూ కదులుతోంది.

## అందులో నిజమెంత?

సంజీవదేవ్‌కు ఆత్మీయురాలైన ఓ రచయిత్రి 1962లో వచ్చే ఫిబ్రవరిలో ప్రళయం సంభవిస్తుందని ప్రచారం జరుగుతున్నదానిపై సంజీవ్‌దేవ్‌ను, 'అందులో నిజమెంత?' అని అడిగారు.



దానికాయన 'ఫిబ్రవరి ప్రళయం సంగతా? అది మనల్ని ఏమీ చేయదులెండి. ఏమైనా చేస్తేగీస్తే మనను చంపుతుంది. అంతేగా! అంతకంటే మించిన హాని ఏమి చేయగలదు మనకు? ఇలాంటి ప్రళయాలతో ఏమీ భయం లేదు. భయమల్లా ప్రణయాలతోనే!' అని జవాబిచ్చారు.

జనంలో కల్లోలం మొదలయింది.

బోటు సిబ్బంది అందరినీ వారివారి స్థానాల్లో కూర్చోమని బిగ్గరగా అరుస్తూ వున్నారు. మొసలి గట్టిగా బిడ్డ చేయి లాగుతూ వుంది.

అమ్మాయి తల్లి బిడ్డను గట్టిగా పట్టుకొని పెనుగు లాడుతూ ఉంది.

ఇంతలో సిబ్బంది "అమ్మా! బోటు ఒరుగుతూ ఉంది. ఇది పూర్తిగా ఒరిగిందంటే మనమందరం మొసళ్ళ బారిన పడ్తాం. ఆ బిడ్డ ఇక మనకు దక్కదు. బిడ్డను నీళ్ళలో వదిలి వేయండమ్మా" అంటూ ఒకవైపు బోటును అదుపులో పెట్టడానికి ప్రయత్నిస్తూనే బిగ్గరగా అరుస్తూ ఉన్నారు.

మిగతా వారు కూడా "బిడ్డను వదిలేయమ్మా, బిడ్డను వదిలేయమ్మా.. లేదంటే మనందరి ప్రాణాలు పోతాయి" అంటున్నారు.

తల్లి మాత్రం బిడ్డను గట్టిగా పట్టుకుని పెనుగులాడుతూ ఉంది. మొసలి పట్టు విడవటం లేదు. ఇంతలో అది కొంత పైకి ఎగబాగటానికి ప్రయత్నించింది. ఆ తల్లి భయపడి బిడ్డను నీళ్ళలో వదిలేసింది" అంటూ ఓ హృదయ విదారక సంఘటనను చెప్పాడు జగన్నాథరావు.

బోటు సిబ్బందిలో తెలిసిన ఒకానొక వర్కర్ "సార్! ఇప్పుడు ఆ కథ చెప్పకండి. జనం జడుసుకుంటారు" అన్నాడు.

అలా బోటులో గుట్టల దగ్గరికి వెళ్ళాక రకరకాల పక్షులను, ఒడ్డున ఉన్న మొసళ్ళను చూసిన తర్వాత మళ్లీ బయలుదేరిన చోటుకే వచ్చారు. బోటులో వారంతా పక్షులను చూసి ఆనందించారో, మొసళ్ళను చూసి భయపడ్డారో, ఈ హృదయ విదారక కథను విని బాధ పడ్డారో.. ఎవరెవరు ఎటువంటి అనుభూతి పొందారో చెప్పడం కష్టం! సాయంత్రం ఆరు గంటలకు మరలా బస్సులో మైసూర్‌కు వచ్చారు భుజంగరావు అండ్ కో.

మర్నాడు 'జగన్మోహన్ ప్యాలెస్' చూశారు. ఇక్కడ రకరకాల ఆయిల్ పెయింటింగ్స్, రాజా రవివర్మ, ఇతర ప్రసిద్ధ చిత్రకారులు గీసిన చిత్రపటాలన్నీ చూశారు.

సాయంత్రం షాపింగ్ చేసుకొని మరునాడు బెంగళూరు బయలుదేరారు. అక్కడికి చేరుకున్నాక కోటేశ్వరరావు "ఎలాగు ఇంతదూరం వచ్చాం కదా! బెంగళూరు చూసి వెళ్దాం" అన్నాడు.

అందరూ ఒప్పుకున్నారు. మెజెస్టిక్‌లో ఒక లాడ్జి బుక్ చేసుకున్నారు. ఆ రోజు విశ్రాంతి తీసుకున్నారు.

మరుసటిరోజు లాల్‌బాగ్ చూడడానికి బయలుదేరారు. ఇది కూడా బొటానికల్ గార్డెనే. చాలా విశాలమైన గార్డెన్. పర్యాటకులను విశేషంగా ఆకర్షించే ఉద్యానవనం.

లాల్‌బాగ్‌లో కూడా ఊటీలోలాగ ప్రతి చెట్టువద్ద దాని శాస్త్రీయ నామంతో ప్లకార్డులు రాసి వుంచారు. అది చూసి శశికి పాతజ్ఞాపకాలు వచ్చాయి. డిగ్రీ చదువుతున్నప్పుడు తన ఊటీ ప్రయాణం గుర్తుకొచ్చింది. కళ్లవెంబడి నీళ్ళు సుడులు తిరిగాయి. తన స్నేహితులు, మిగతా క్లాస్‌మేట్స్, లెక్చరర్లు ముఖ్యంగా ప్రసన్నకు

## కొత్తగాలి...

**ఏలే నాయకులకు**
**ఏడంతస్తుల మేడలు...!**
**ఎన్నుకున్నవారికి**
**చిన్ని గుడిసెలు!**

– వెల్మల రాంరెడ్డి,
కరీంనగర్

మార్ సార్ అందరూ ఒక్కసారిగా గుర్తుకొచ్చారు.

తనది పిరికి ప్రేమ. ఆమోదయోగ్యమైన ప్రేమ కాదు. తనకు తెలియకుండానే ఒక పెళ్లయిన వ్యక్తిని ప్రేమించిన ప్రేమ.

అప్పట్లో భయమే తన ధైర్యాన్ని కప్పిపుచ్చింది. అప్పుడు ఒకవేళ ధైర్యం చేసి ముందుకు వెళ్ళినా ఎవరూ ఆమోదించి ఉండరు గదా! సార్‌కు పెళ్ళికాకుండా ఉండుంటే బాగుండు కదా! అలా ఏవేవో ఆలోచనలు మెదిలాయి. ఎందుకో తనకు అంతా అయోమయంగానే ఉంది.

ఇంత ప్రయాణం చేసినా మనసులో పూర్తి సంతోషం లేకుండా పోయింది. ఇంతలో "శశీ! రా పోదాం" అంటూ చేయి పట్టుకొని తీసుకెళ్ళింది నాగమల్లిక.

ఆ రోజు మధ్యాహ్నం వరకు లాల్‌బాగ్ చూసిన తర్వాత లాడ్జికి వెళ్ళి అందరూ విశ్రాంతి తీసుకున్నారు.

మరుసటి రోజు 'విశ్వేశ్వరయ్య మ్యూజియం', 'విధానసౌధ' తదితర ప్రదేశాలు చూశారు. ఆ మరుసటి రోజు బెంగళూరు నుండి సొంతూరు చిత్తూరుకు తిరిగి వచ్చేశారు.

## 3



**స్వం**త ఊరు చేరుకున్నాక భుజంగరావు ఆరోగ్యం బాగానే కుదుట పడింది. అలా బయటి ఊర్లు తిరిగి రావడం తనకు మేలే చేసింది.

కొన్ని రోజులు గడిచిన తర్వాత నాగమల్లిక ద్వారా శశిముందు మళ్ళీ పెళ్ళి ప్రస్తావన తీసుకొచ్చారు రోహిణి, భుజంగరావు.

"ఏమే! ఇప్పుడైనా పెళ్ళి చేసుకుంటావా? ఉద్యోగం ఎటూ చేయనన్నావు" అంది నాగమల్లిక శశితో.

"ఏం! నాన్న నిన్ను అడగమన్నాడా?" అంది శశి.

"నాన్న ఆరోగ్యం ఇప్పుడిప్పుడే కుదుటపడుతోంది. నీకు పెళ్ళి చేస్తే తన బాధ్యత తీరిపోతుందనుకుంటున్నాడు" అంది నాగమల్లిక.

'తన మూర్ఖత్వంతో నాన్నను ఎందుకు బాధ పెట్టాలి' అనుకుంది శశి.

పెళ్ళికి అయిష్టంగానే ఒప్పుకుంది. శశి పెళ్ళికి ఒప్పుకుందనగానే భుజంగరావు సంతోషానికి పట్టపగ్గాలు లేవు. మరునాడు ఉదయమే ఎవరికీ చెప్పకుండా, ప్రాణ స్నేహితుడు కోటేశ్వరావుకు కూడా చెప్పకుండా హడావిడిగా ఇంటి నుండి బయలుదేరాడు.

ఎప్పుడో తన మిత్రుడు రామారావు ప్రస్తావించిన పాకాల సంబంధం గుర్తుకొచ్చి బయలుదేరాడు భుజంగరావు. 'శశి మనసు మార్చుకోకముందే పెళ్ళి చేసేయాలి' అని నిశ్చయించుకున్నాడు. కొన్ని గంటల ప్రయాణం తర్వాత పాకాలలో ఒక ఇంటిగుమ్మం ముందు నిలబడ్డాడు. తలుపు వేసి ఉంది.

"బద్రి నారాయణగారు! బద్రి నారాయణ గారు!" అంటూ తలుపు తట్టాడు.

తలుపు తీసింది బద్రి నారాయణ భార్య విశాలక్షి.

"ఎవరండీ!" అడిగిందామె.

"నేను చిత్తూరు నుండి వచ్చానమ్మా? బద్రి నారాయణగారు ఉన్నారా?"

"ఉన్నారు. రండి, కూర్చోండి" అంటూ

హాలులో సోఫా చూపించింది.

కాసేపటికి బద్రి నారాయణ హాలులోకి వచ్చాడు.

"నమస్కారం బద్రి నారాయణగారు! నా పేరు భుజంగరావు. నా కూతురు సంబంధం విషయమై వచ్చాను. చిత్తూరులో రామారావుగారు మీ విషయం చెప్పారు" అన్నాడు భుజంగరావు.

బద్రినారాయణకు ఒక కొడుకు, ఒక కూతురు. కొడుకు నరసింహ బి.టెక్ చేశాడు. రైల్వేలో సిగ్నలింగ్- టెలికమ్యూనికేషన్స్ డిపార్టుమెంట్‌లో పని చేస్తున్నాడు. పాకాల జంక్షన్‌లో ఉద్యోగం, పెళ్ళి కాలేదు. ఇంతలో విశాలాక్షి కాఫీ తీసుకొని వచ్చింది.

"మీ అబ్బాయికి పెళ్ళి కాలేదని విన్నాను. సంబంధం కోసం వచ్చాను" అన్నాడు భుజంగరావు.

శశి గురించి, తన కుటుంబం గురించి అంతా వివరంగా చెప్పాడు భుజంగరావు. బద్రి నారాయణ కూడా తన కుటుంబ వివరాలు చెప్పాడు.

బద్రి నారాయణ ఒక భూస్వామి. స్వంత ఊరు మదనపల్లె. ఆ ఊరిలో పూర్వీకుల ద్వారా వచ్చిన దాదాపు అరవై ఎకరాల భూమి ఉంది. మరికొంత భూమి వివాదాల్లో ఉంది. వాటి కోసం ఏండ్ల తరబడి కోర్టు చుట్టూ తిరుగుతూ ఉన్నాడు. కోర్టు వ్యవహారాలు బాగా వంటబట్టి ఒక 'లిటిగేషన్ దాదా'గా తయారయ్యాడు. మదనపల్లి కోర్టులో, చిత్తూరు జిల్లా కోర్టులో తన కోర్టు లావాదేవీలు కొనసాగుతూ ఉంటాయి. అంతేగాక తన స్నేహితుల సివిల్, క్రిమినల్ కేసుల లావాదేవీలకు ఒక సలహాదారుగా, పట్టాలేని లాయర్‌గా వ్యవహరిస్తూ ఉంటాడు. కొడుకు పాకాలలో ఉండడం చేత పాకాలకు, మదనపల్లెకి తరచూ తిరుగుతూ ఉంటాడు.

ఇంతలో కూతురు జ్యోతి హాల్లోకి వచ్చింది. "మీ అమ్మాయా? " అడిగాడు భుజంగరావు.

"అవును! అమ్మాయికి పెళ్లయింది. అల్లుడు మదనపల్లెలోనే ఉంటాడు. పేరు చంద్రశేఖర్. మదనపల్లె కోర్టులో హెడ్ క్లర్క్."

"అబ్బాయి ఉన్నాడా? " అడిగాడు భుజంగరావు కుతూహలంగా.

"లేదు! డ్యూటీ మీద పోయాడు. సాయంత్రం వస్తాడు" అన్నాడు బద్రి నారాయణ.

"అబ్బాయి ఫొటో ఏమైనా ఉందా? " అంటూ తన జేబులోని కూతురి ఫొటోను, జాతకాన్ని బద్రి నారాయణకిచ్చాడు.

విశాలాక్షి కూడా నరసింహ ఫొటోను, జాతకాన్ని భుజంగరావుకు ఇచ్చింది.

కాసేపు మాట్లాడుకున్న తర్వాత "అబ్బాయి ఒప్పుకుంటే అమ్మాయిని చూడడానికి చిత్తూరు వస్తాం. వచ్చే ముందర ఫోన్ చేస్తాం లెండి!" అన్నాడు బద్రి నారాయణ.

ఇద్దరూ ఒకరి ఫోన్ నెంబరు మరొకరు తీసుకున్నారు.

ఎంతో తేలికైన మనసుతో ఆ ఇంటి నుండి బయటికి వచ్చి చిత్తూరు బయలుదేరాడు భుజంగరావు.

సాయంత్రం ఐదు గంటలకు ఇల్లు చేరుకున్నాడు భుజంగరావు.

"ఎక్కడికి వెళ్ళారండీ! మధ్యాహ్నం భోజనానికి కూడా రాలేదు" అంది రోహిణి.

ఇంతలో కోటేశ్వరరావు వచ్చాడు, షికారు పోదామని.

"చూడండి అన్నయ్యగారు! పొద్దుననగా ఎక్కడికో వెళ్ళి ఇప్పుడనగా వస్తున్నారు. మధ్యాహ్నం భోజనానికి కూడా రాలేదు" అని కంప్లెయింట్ చేస్తున్నట్లు చెప్పింది.

"ఎక్కడికి వెళ్ళావురా? " అడిగాడు కోటే

శ్వరరావు.

"రారా! వచ్చి కూర్చో! సావకాశంగా విందువుగాని. రావే, నీవూ వచ్చి కూర్చో!" అని ఆప్యాయంగా పిలిచాడు రోహిణిని.

"ఎప్పుడో రామారావు చెప్పిన సంబంధం కోసం పాకాల వెళ్ళి వచ్చాను" అంటూ తన ప్రయాణం, పెళ్ళి సంబంధం గురించి ఇద్దరికీ చెప్పాడు. వాళ్ళూ సంతోషపడ్డారు.

"ఇక ఫోన్ రావడమే తరువాయి" అన్నాడు కోటేశ్వరరావు.

"అవును" అంటూ ఏదో ఘనకార్యం చేసినవాడిలాగా, ముఖమంతా వేయి వోల్టుల కాంతితో వెలిగిపోయినట్లు సంబరపడిపోయాడు భుజంగరావు.

"సరే! వాకింగ్ పోదాం, రా!" అన్నాడు కోటేశ్వరరావు.

"లేదులేరా! కాస్త అలసిపోయాను. ఈ రోజు ఇంటి పట్టునే ఉండి మాట్లాడుకుందాం!"

వాళ్ళిద్దరూ కొంతసేపు మాట్లాడుకున్నాక కోటేశ్వరరావు ఇంటికి వెళ్ళిపోయాడు.

దాదాపు వారం రోజులు గడిచాక బద్రినారాయణ నుండి ఫోన్ వచ్చింది.

"నమస్కారం భుజంగరావుగారు! వచ్చే ఆదివారం అమ్మాయిని చూడడానికి చిత్తూరుకు వస్తున్నాం. మీ అడ్రస్ చెప్పండి" అన్నాడు బద్రినారాయణ.

అనుకున్నట్లే ఆదివారం బద్రినారాయణ ఫ్యామిలీ భుజంగరావు ఇంటికి వచ్చింది.

అపరంజి బొమ్మ శశి అంటే నచ్చని వారు ఉంటారా?

కానీ నరసింహది అంత చక్కని రూపం కాదు. పొట్టిగా, చామనఛాయగా, ముఖం మీద అక్కడక్కడ నల్లని మచ్చలతో, విశాలమైన నుదుటి మీద కాస్త బట్టతలతో, పలుచని జుట్టుతో ఉంటాడు.

శశి అయిష్టంగానే హాలులోకి వచ్చి కూర్చుంది. అతన్ని చూద్దామని కుతూహలం లేదు, చూడనూ లేదు.

## ఇద్దరికీ కలిపి ఒక్కరు!

ఒకసారి ఓ సోదరి తన స్నేహితురాలికున్న ఆరుగురు అమ్మాయిల్లోనుంచి ఎవరో ఒకరిని సంజీవదేవ్ ఇద్దరు మగపిల్లల్లో



ఎవరికైనా ఇచ్చి తమ అల్లుణ్ని చేసుకుంటామన్నారు. దానికాయన ఇచ్చిన సమాధానం, 'సరే అలాగే కానివ్వండి. మా ఇద్దరు అబ్బాయిలకూ కలిపి ఒక అమ్మాయినిచ్చినా సరే. లేక ఇద్దరు అమ్మాయిలకూ మా ఒక అబ్బాయిని తీసుకున్నా సరే. వాస్తవానికి అబ్బాయిలు అంతర్జాతీయ వివాహాలు చేసుకోవాలని నా అభిలాష. అంటే నా అభిలాషననుసరించి వాళ్ళు చేసుకోవాలని కాదు. వాళ్ళ ఇష్ట ప్రకారమే. కాకపోతే ఇంకా పదిహేను, ఇరవై ఏళ్ళు ఆగాల్సివుంటుందంతే' అని రాశారు.

'అమ్మానాన్నలు చూస్తే చాలులే' అనుకుందో ఏమో!

మాటల సందర్భంలో ఎవరూ శశి అబ్బాయిని చూసిందో లేదో పట్టించుకోలేదు.

పది నిమిషాల తర్వాత శశిని లోపలి గదిలోకి వెళ్ళమని చెప్పింది రోహిణి.

ఫలహారాలు అవీ ముగించిన తర్వాత బద్రినారాయణ "జాతకాలు కుదిరాక కబురు చేస్తాం. మిగతా విషయాలు తర్వాత మాట్లాడుకోవచ్చు" అని చెప్పి, నరసింహ, విశాలాక్షి, జ్యోతిలతో పాకాల బయలుదేరి వెళ్ళిపోయాడు.

వారం రోజుల తర్వాత బద్రినారాయణ

ఫోన్ చేశాడు. "జాతకాలు కుదిరాయి. మా అందరికీ అమ్మాయి నచ్చింది" అని చెప్తూ, కట్నం విషయం కూడా ఫోన్‌లోనే చెప్పాడు.

కట్నం పెద్దగా అడగలేదని భుజంగ రావు సంబరపడిపోయాడు. ఇంట్లో వాళ్లకి, కోటేశ్వరరావుకు విషయం చెప్పి తాను కూడా తన అంగీకారాన్ని బద్రి నారాయ ణకు ఫోన్‌లో చెప్పాడు.

శ్రావణమాసంలో పెళ్లి చేద్దామని నిశ్చ యించుకున్నారు. అంటే పెళ్లికి సరిగ్గా రెం డు నెలల సమయముంది. హడావిడిగా పెళ్లి పనులు చేయడం మొదలుపెట్టాడు భుజంగరావు.

**కొత్తగాలి...**

**'పలక'...**
**'మూగ'బోయింది...**
**'బలపం'...**
**'కన్నీరె'ట్టుకుంది...**
**'ఆధునికతని'... చూసి**

– యు. చిట్టిబాబు, కొత్త పాల్వంచ

మొదట టి.టి.డి. కల్యాణమండపాన్ని రిజర్వు చేశాడు. తర్వాత కట్నానికి, పెళ్లి ఖర్చులకు డబ్బు సమకూర్చుకున్నాడు. కేటరింగ్, డెకొరేషన్ మొదలగు వాటికి కాంట్రాక్ట్‌ను ఇచ్చాడు. పెళ్లిపత్రికలు ప్రింటింగ్ చేయించి, తన బంధువర్గానికి, ఆఫీసువాళ్లకి, ఇతర బంధుమిత్రులకు పంపించాడు. అన్ని పనులు తనే స్వయంగా ఇరవై అయిదేళ్ల యువకుడిలా ముందుండి చేస్తూవుంటే రోహిణి, కోటేశ్వ రరావులు కూడా ఆశ్చర్యపోయారు.

శశి పెళ్లి విషయం యూనివర్సిటీలోని చంద్రికవాళ్లకు కూడా తెలిసిపోయింది. వాళ్లు కూడా సంతోషపడ్డారు. కొన్ని ఇన్వి టేషన్స్ వాళ్లే తెప్పించుకొని ఆటోగ్రాఫ్‌లలో వున్న తమ స్నేహితుల చిరునామాలన్నిటికీ, లెక్చరర్లకు, ఇంకా తెలిసిన వాళ్లకంద రికి శశి తరపున పంపించారు. ఎప్పుడెప్పుడు శశి పెళ్లి జరుగుతుందా, ఎప్పుడెప్పుడు చిత్తూరు వెళ్దామా అని ఉబలాట పడిపోయారు.

అనుకున్న తేదీ రానే వచ్చింది. భుజం గరావు, రోహిణి, కోటేశ్వరరావు, నాగలక్ష్మి, నాగమల్లిక, రోహిత్, మంజుల, సంతోష్, అనిరుధ్, రమ్య, నాగమల్లిక అత్తామామలు శ్రీహరి లత, మంజుల అత్తమామలు రాఘవయ్య, సుమతి, రోహిణి వైపు బంధువులు, భుజంగరావువైపు బంధువులు అందరూ వచ్చారు. భుజంగరావు ఆఫీసు వాళ్లు, విశ్రాంత జీవనంలో కలిసిన ఫ్రెండ్సూ వచ్చారు.

ఇక బద్రి నారాయణ, విశాలాక్షి, పెళ్లి కుమారుడు నరసింహ, అతని ఫ్రెండ్స్, అ తని చెల్లెలు జ్యోతి, జ్యోతి భర్త చంద్రశేఖర్, అతని అమ్మానాన్నలు వాసుదేవ రావు, సరస్వతి.. ఇలా వారి బలగమంతా పెద్ద సంఖ్యలోనే హాజరయింది.

శశి స్నేహితుల బృందం దాదాపు పదిమంది, ఇతర క్లాస్‌మేట్స్ చాలామంది వచ్చారు.

పెళ్లి వైభవంగా జరిగింది.

వచ్చిన బంధువులు, స్నేహితులు అందరూ వధూవరులను ఆశీర్వదించి 'బై' చెప్పి వెళ్లిపోతూ వున్నారు.

చంద్రిక, విజయ, వైదేహిలకు శశిని ఒంటరిగా కలవడానికి వీలు చిక్కడం లేదు. ఎన్నెన్నో మాట్లాడాలనుకున్నారు.

నరసింహను చూసి వాళ్లు కొంత నిరుత్సాహపడ్డారు. కారణం శశి, నరసింహ 'మేడ్ ఫర్ ఈచ్ అదర్' లాగ లేరు. అయితే 'రూపాలు ఎలా వున్నా గుణాలు

ప్రధానం గదా!' అనుకున్నారు.

ఇంతలో శశి తనకు కేటాయించిన పెళ్లి కూతురి గదిలోకి వెళ్లింది.

కాసేపయ్యాక ముగ్గురు స్నేహితురాళ్లు శశి రూముకు వెళ్లారు. రూములో శశి పక్కనే జ్యోతి కూర్చొని వుంది. వీళ్ల రాకను దూరం నుంచే చూసిన శశి, వాళ్లు జ్యోతి సమక్షంలో ఏం మాట్లాడుతారో అని భయపడింది. దాంతో వారు దగ్గరికి రాగానే "ఈమె మా అడపడుచు జ్యోతి" అని పరిచయం చేసింది.

ఎన్నో విషయాలు ఎంతో ఆత్రుతగా మాట్లాడాలనుకున్నవాళ్లు సైలెంట్ అయ్యారు.

ఇంతలో విశాలాక్షి రూములోకి వస్తూ జ్యోతితో "ఇక్కడే కూర్చోకపోతే అక్కడ ప్రెజెంటేషన్స్ అవీ చూడకూడదా? అల్లుడు ఒక్కడే అక్కడ వున్నాడు" అని జ్యోతిని గట్టిగా మందలించింది.

పెళ్లి అన్న తర్వాత ప్రతి ఒక్కరూ తమ వంతు పనిచేస్తూ వుంటేనే సక్రమంగా జరుగుతుంది. ప్రతి ఒక్కరూ హడావిడిగా తిరుగుతూ వుంటేనే కళగా వుంటుంది.

జ్యోతి గొణుక్కుంటూ బయటికి వెళ్లింది.

"ఏమ్మా మీరంతా శశి ఫ్రెండ్సా? " అడిగింది విశాలాక్షి.

"ఔను" అన్నారు శశి ఫ్రెండ్స్.

విశాలాక్షి కూడా హడావిడిగా ఏదో వస్తువు తీసుకొని బయటికి వెళ్లింది.

ముగ్గురు ఫ్రెండ్స్‌నూ చూసి శశి ఒక్కసారిగా కన్నీళ్లు పెట్టుకుంది. ఇన్ని రోజులు మనం సంతోషంగా సరదాగా గడిపామని, ఇప్పుడు తాను వాళ్లకంటే ముందు జీవితంలో అడుగు పెడ్తున్నానని, వాళ్ల నుండి దూరమవుతున్నానని, ఒంటరిదాన్నైపోయానని ఏవేవో బాధాకరమైన భావాలను ఆ కన్నీళ్లు పలికిస్తున్నాయి. అందరూ ఒక రకమైన ఉద్వేగానికి గురయ్యారు.

ముగ్గురు స్నేహితురాండ్రు సరదాగా శశితో మాట్లాడి పోదామనుకున్నారు గాని అందరి 'మూడ్స్' అకస్మాత్తుగా మారిపోయాయి. వెంటనే తేరుకొని మామూలుగా పిచ్చాపాటి మాట్లాడుకొని 'విష్ యూ హ్యాపీ మ్యారీడ్ లైఫ్' అని చెప్పి వెళ్లిపోయారు. శశి పెళ్లి అలా మిశ్రమ భావాలతో జరిగిపోయింది.

వాసుదేవరావు, సరస్వతి, జ్యోతి, చంద్రశేఖర్ మదనపల్లెకి వచ్చేశారు.

చంద్రశేఖర్‌కు, జ్యోతికి పెళ్లయి నాలుగేండ్లయిందిగాని వారిద్దరి మధ్య సత్సంబంధాలు లేవు. ఏ మాత్రమూ ఒద్దిక కూడా లేదు.

చంద్రశేఖర్ స్వతహాగా సౌమ్య గుణమున్న మనిషి. కోర్టులో హెడ్‌క్లర్క్‌గా పనిచేస్తున్నా భుజంగరావులాగానే డ్యూటీ సిన్సియర్‌గా చేస్తూ వుంటాడు. ఎటువంటి ప్రలోభాలకు లొంగడు. మామగారు బద్రి నారాయణ కూడా తన కోర్టు వ్యవహారాల్లో తనకు సహాయం చేయమని బలవంతం చేసినప్పటికీ చంద్రశేఖర్ ఒప్పుకోలేదు. అందుకుని బద్రి నారాయణకు చంద్రశేఖర్ మీద బాగ కోపముంది. జ్యోతి కూడా ఒక విలక్షణమైన వ్యక్తి. గర్వం, కోపం, పేచీ పడే లక్షణాలు అన్నీ ఎక్కువగా వున్నాయి. దీనికి తోడు తండ్రి ప్రోద్బలంతో చీటికిమాటికి చంద్రశేఖర్‌ను పీడిస్తూనే వుంటుందామె. దాంతో అతనికి మనశ్శాంతి కరువైంది.

ప్రతి చిన్న విషయానికి పేచీ పడటం, వెంటనే తండ్రి మదనపల్లెకి వచ్చినప్పుడల్లా పిలిపించుకోవడం, లిటిగేషన్ మాస్టర్ బద్రి నారాయణ వారితో గొడవపడటం, జ్యోతిని వెంటనే పాకాల తీసుకునిపోవడం.. ఇలా నాలుగేండ్లుగా వ్యవహారం జరుగుతూ వుంది.

ఈ రెండు కుటుంబాల మధ్య బంధువులతో ఎన్ని పంచాయితీలు పెట్టినా విఫలమవుతూనే వచ్చాయి.

ఇపుడు శశి పెళ్లయిన వెంటనే బంధువర్గమేమైనా అనుకుంటారేమోనని జ్యోతిని మదనపల్లికి వాసుదేవరావు ఫ్యామిలీ పిలుచుకొని వచ్చారేగాని పెళ్లికి ముందరి నుండే జ్యోతి పుట్టినింట్లోనే వుండింది.

పెళ్లయిన తర్వాత శశి అత్తవారింటికి వచ్చింది. కొత్త వాతావరణంలో సరదాగానే గడుపుతూ వచ్చింది. శశి పెళ్లయిన వెంటనే అత్తారింటికి పోయిన జ్యోతి రెండు నెలలకే భర్తతో పేచీపడి మళ్లీ పుట్టినింటికి వచ్చింది. జ్యోతి మనస్తత్వం అర్థం చేసుకుంది శశి. 'కయ్యాలకోరు' అనుకుంది.

తన భర్త నరసింహ కూడా కోపిష్టి. ఎప్పుడూ సీరియస్‌గా వుంటాడు. సరదాగా వుండడు. ఎక్కువగా మాట్లాడడు. పొడిపొడి మాటలతో మనుషుల నుండి దూరంగా ఉండడానికి ప్రయత్నిస్తూవుంటాడు. విపరీతంగా సిగరెట్లు తాగుతాడు. ఇంట్లో కూడా తల్లిదండ్రులతో, జ్యోతితో ప్రశ్నకు జవాబు అన్నట్లు మాట్లాడుతూవుంటాడే తప్ప కలుపుగోలుగా వుండడు. పైగా ఉద్యోగరీత్యా క్యాంపులకు తరచూ పోతూ వుండడం వల్ల ఇంట్లో తన వాళ్ల మధ్య సరదాగా గడుపుదామనే ఆలోచన రాదు. మొఖం ఎప్పుడూ చిట్లించుకున్నట్లు వుంటుందేగాని చిరునవ్వు కనబడదు. ఇంటి వ్యవహారాలు ఏవీ పట్టించుకోడు. ఎందుకంటే ఇంట్లో డామినేటింగ్ ఫిగర్ బద్రి నారాయణనే!

విశాలాక్షి కూడా చాలా అసాధ్యురాలు. అందరితో కొట్లాడే స్వభావమే. ప్రతి ఒక్కరితో మర్యాద లేకుండా మాట్లాడుతూ వుంటుంది. తన మాట నెగ్గాలి అనే పట్టుదల వున్న మనిషి, అహంభావం ఎక్కువ. దౌర్జన్యం ఎక్కువ. పీనాసితనం కూడా ఎక్కువే.

ఆ వీధిలో వీళ్ల ఫ్యామిలీ అంటే పేచీకోరులని మిగిలినవాళ్లు భయపడుతూ వుంటారు.

శశికి పెళ్లయి ఆరు నెలలయింది. పెళ్లయిన కొత్తలోనే పని మనిషిని నిలిపేసింది విశాలాక్షి. ఇంటి పాచిపని మొదలుకొని కాఫీ, టిఫిన్లు, వంట, వడ్డన ఇలా ప్రతి చిన్న పనీ శశి మీదనే వేశారు విశాలాక్షి, జ్యోతి. నరసింహ ఇంట్లో వున్నప్పుడు అతని అవసరాలు తీరుస్తూ వుండాలి. ఇలా తీరిక లేకుండా శశి ఒక యంత్రంలాగా తయారయ్యింది. ఆ ఇంట్లో శశికి సహాయ పడడంలో విశాలాక్షి నుండి గాని జ్యోతి నుండి గాని ఎలాంటి సహకారం వచ్చేదికాదు.

ఇలా వుండగా ఒకరోజు శశి వంట ముగించి పదార్థాలను డైనింగ్ టేబుల్ మీద సర్దుతూ వుంది. హాలులో విశాలాక్షి, జ్యోతి సోఫాలో కూర్చొని వున్నారు. వండినవాటిని టేబుల్ మీద సర్దుతూ వుంటే పొరపాటున చేయి తగిలి అన్నంపాత్ర జారిపడి అంతా నేలపాలయింది.

అంతే! విశాలాక్షి పరుగున వచ్చి శశి వీపు మీద నాలుగు దెబ్బలు వేసి "అన్నమంతా పాడుచేశావు గదే! ఇప్పటికే ఒకటిన్నరయింది. ఆకలి మండిపోతూ వుంది. పైగా ఈ నిర్వాకం చేశావు. జాగ్రత్త లేదా నీకు? ఏం! పనిమీద నీకంత నిర్లక్ష్యమా?" అని అరిచింది.

"కిందపడ్డ అన్నమంతా నీవే తిను. బండలు శుభ్రం చేసి మళ్లీ మాకు ఫ్రెష్‌గా అన్నం వండు!" అంటూ చీవాట్లు పెట్టింది.

పాపం! శశి అన్నాన్ని పాత్రలోకి ఎత్తుతుంటే జ్యోతి చూస్తూవుండే కాని సహాయానికి మాత్రం రాలేదు.





శశి ఏడుస్తూ వంటింట్లోకి వెళ్లి మళ్లీ అన్నం వండటం మొదలుపెట్టింది.

ఇంతలో పని మీద బయటికి వెళ్లిన బద్రి నారాయణ ఇంటికి తిరిగి వచ్చాడు.

వసారాలో కూర్చున్న విశాలాక్షి, జ్యోతిని చూసి "ఏం! ఇక్కడ కూర్చున్నారు? భోజనానికి ఏర్పాటు చేయరా? నాకు ఆకలిగా వుంది" అన్నాడు.

శశి పొరపాటున చేసిన పనిని అవీఇవీ కల్పించి చెప్పారు ఇద్దరూ. బద్రినారాయణ కూడా కోపంగా వంటగదిలోకి వచ్చి శశిని నానా దుర్భాషలాడి కోపంగా హాలులోకి వచ్చాడు.

'ఒక చిన్న పొరపాటుకు ఇంత రాద్ధాంతం చేస్తారే వీళ్లు' అనుకుంది శశి.

> **కొత్తగాలి...**
>
> **ఐదంకెల జీతం**
> **వీసా, పాస్‌పోర్ట్ సిద్ధం**
> **గుణదోషాలతో ఏమవసరం?**
> **ఇక అమ్మాయి పెళ్లికి**
> **ఏమిటి అడ్డం?**
>
> – పి. లక్ష్మి

తను ఇంట్లో అల్లారుముద్దుగా పెరిగింది. అమ్మ ఏ రోజు కూడా తనను కొట్టింది లేదు. పుట్టినిల్లు గుర్తుకు రాగానే దుఃఖం కట్టలు తెంచుకొని వచ్చింది.

అత్తగారింటి అసలురంగు ఇప్పుడు బయటపడింది శశికి. పుట్టినింట్లో కూడా తనకు ఇంటి పనులు చేసే అలవాటుంది. కాబట్టి అత్తవారింట్లో విశాలాక్షి, జ్యోతి ఎన్ని పనులు చెప్పినా సర్దుకుపోయి చేస్తూవచ్చింది. కాని ఇటువంటి దౌర్జన్యాన్ని తాను ఊహించలేదు. ఇది ఒక 'నరక కూపం' అని అర్థమయింది తనకు.

ఇలాగే ఒకరోజు పొద్దున్నే లేచి కాఫీ, టిఫిన్లు చేశాక విడిచిన బట్టలను వాషింగ్ మెషీన్‌లో వేసి స్విచ్ వేయబోతే అది పని చేయలేదు. మొరాయించింది.

విశాలాక్షి అగ్గిమీద గుగ్గిలమయింది.

"ఏం చేశావే శనేశ్వరమా? " అంటూ వాషింగ్ మెషీన్ దగ్గరకు వచ్చింది విశాలాక్షి. తానూ ప్రయత్నించింది. అది పనిచేయలేదు. "మీరూ ఒకసారి ప్రయత్నించండి" అంది భర్తను పిలుస్తూ.

బద్రి నారాయణ తనకు తెలిసిన పరిజ్ఞానంతో ప్రయత్నించాడు గాని అది పనిచేయలేదు. ఎలక్ట్రీషియన్‌ను పిలిపించారు. అతను వచ్చి అంతా చెక్ చేసి 'ఇది ఇక పని చేయదండి' అని చెప్పి వెళ్లిపోయాడు.

నిజానికి ఆ వాషింగ్‌మెషీన్ చాలా పాతది. చాలాసార్లు రిపేర్లు చేయించి వాడుకుంటున్నారు. ఇప్పుడు పని చేయక పోయే సరికి ఆ పాపం శశిమీద నెట్టారు. నానా చీవాట్లు పెట్టారు.

"పో! బట్టలన్నీ పెరట్లో ఉతికి ఆరవేయ్! త్వరగా వచ్చేయ్. మరలా వంటకు ఎసరు బెట్టాలి" అని శశిని పెరట్లోకి తరిమింది.

బద్రినారాయణ, విశాలాక్షి హాల్లోకి వచ్చి ఏదో మాట్లాడుకున్నారు. బద్రినారాయణ భుజంగరావుకు ఫోన్ చేశాడు.

"నమస్కారం భుజంగరావుగారు! ఏమీ లేదు. మీకు ఒక విషయం చెప్పాలి. శశి మా ఇంట్లో వుండే వాషింగ్ మెషీన్‌ను పాడుచేసింది. మీరు వెంటనే పదహారు వేలు పంపించండి. కొత్తది కొనాలి. మీరు పంపించేంత వరకు మీ కూతురు ఒక పూటనే భోంచేస్తూ వుంటుంది" అని చెప్పి ఫోన్ కట్ చేశాడు.

భుజంగరావుకు దిక్కు తోచలేదు.

బద్రినారాయణ ఇంత కటువుగా ఎందుకు మాట్లాడాడు?

శశి ఏం చేసింది?

విషయం రోహిణికి చెప్పాడు.

"వాళ్లు మనమిచ్చిన కట్నం తక్కువై ఈ విధంగా సాధిస్తున్నారేమో!" అనుమానం వెలిబుచ్చింది.

"కట్నం తక్కువయితే నేరుగా ముఖాముఖి మాట్లాడి వుండవచ్చుగా! ఈ డొంక తిరుగుడు వ్యవహారమేంటి? ఇదేమన్నా పెద్ద మనిషి తరహాగా వుందా?"

"లేదండీ! కొంతమంది కట్నం తక్కువ ఇచ్చారు అనే నెపంతో ఈ విధంగా కోడళ్లను, వియ్యంకులను సాధిస్తూవుంటారు" తన మనసులోని భయాన్ని వెలిబుచ్చింది.

"నిజమే! పైగా శశి ఒక పూటనే భోంచేస్తూ వుంటుందని ఎంత నిర్దయగా, కఠినంగా, వియ్యంకుడిననే గౌరవం కూడా లేకుండా మాట్లాడాడు!" అంటూ కోపంతో ఊగిపోయాడు భుజంగరావు. తర్వాత-

"ఇప్పుడేం చేద్దాం" భార్య సలహా అడిగాడు.

"ఏముందీ! డబ్బులు వెంటనే పంపండి. పంపకపోతే శశిని ఇంకా కష్టాలు పెట్టవచ్చు వాళ్లు" అంది రోహిణి.

"అయ్యో! నా చిట్టితల్లిని ఏం చేస్తున్నారో? ఏమో?" కండ్ల వెంబడి నీళ్లు జారాయి భుజంగరావుకు.

"ఇదంతా మీరు చేసిందే! శశి పెళ్లికి ఒప్పుకుంది కదా అని ఎవరినీ సంప్రదించకుండా హడావిడిగా ఈ సంబంధం కుదిర్చారు. ఇప్పుడు అనుభవించక తప్పదు" నిష్ఠూరంగా మాట్లాడింది రోహిణి.

"ఔనే! దాని మనసు ఎక్కడ మారుతుందో అని తొందరపడ్డానే తప్ప ఇలా అవుతుందని నేనూహించలేదు" ఆవేదనగా అన్నాడు భుజంగరావు.

ఏమైతేనేమి, డబ్బులు వెంటనే పంపించాడు భుజంగరావు.

'ఇలా ఇంట్లో ప్రతి వస్తువూ శశి పాడు చేసిందనే నెపంతో డబ్బులు పంపమని ఒత్తిడి చేస్తారో ఏమో!' అనేది గుర్తుకు వ

## సరికొత్త నిరసన!




తన భర్తమీద కోపం వస్తే ఏ భార్యయినా పోట్లాడుతుంది. మరీ భరించలేననుకుంటే విడాకులు తీసుకుంటుంది. అమెరికాలో విస్కాన్సిన్ రాష్ట్రంలోని సుపీరియర్ అనే ఊర్లోని ఓ భార్యకు పై రెండూ చేసినా కోపం తీరలేదు. దాంతో విడాకులు తీసుకున్నాక నాలుగో రోజు సాయంత్రం తన భర్త వస్తువులు అన్నింటినీ




తీసి ఇంటి బయట ఉంచింది. 'ఉచితం' అనే బోర్డు పెట్టి, ఎవరికి కావాల్సినవి వారు తీసుకునివెళ్లవచ్చని సూచించింది. అంతేకాదు, తన భర్త కారుపై చీట్(మోసగాడు) అని రాసి, చక్రాల్లోని గాలిని తీసేసింది. వారి వివాహం 1997లో జరిగింది. విడాకులు 2011లో జరిగాయి. తనభర్తకు మరో మహిళతో సంబంధం ఉందని తెలిసి విడాకులు తీసుకుందామె. అయినా ఆమె ఆక్రోశం చల్లారలేదు. అతడు ఎలాంటివాడో ఇరుగుపొరుగుకు చాటి అవమానపరచాలని ఆమె ఈ పని చేసింది.

ఆ ఇంటిమీదుగా వెళ్లే కార్లు అక్కడ ఆగి ఆ వస్తువులను చూసి వెళ్తుండటంతో ట్రాఫిక్‌కు అంతరాయం కలిగింది. దాంతో పోలీస్ సార్జెంట్ విలియం లియర్ అక్కడికి చేరుకున్నాడు. అయితే ఆమెపై ఎలాంటి నేరారోపణ అతను చేయలేదు. 'తమ స్వంత కారుపై ఏదైనా రాసుకోవడం నేరం కాదు. అలాగే ఇంటి ఆవరణలో తమ వస్తువులను ఉచితంగా పరాయివాళ్లు తీసుకోవడానికి ఉంచడం కూడా నేరం కాదు' అని అతను పత్రికలవారితో అన్నాడు. ఆమె ఇంట్లో లేకపోవడంతో పాత్రికేయులు కలువలేకపోయారు. మోసగాడైన భర్త విషయంలో జరిగిన ఈ కొత్తరకం నిరసనను అన్ని దినపత్రికలూ ప్రముఖంగా ప్రచురించాయి.

# చతుర ప్రవేశిక

## జులై చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. శశి మనసుపడిన లెక్చరర్?
జ
2. నరసింహ సోదరి పేరు?
జ
3. భుజంగరావుకు కూతుళ్లెందరు?
జ
4. బద్రి నారాయణ భార్య?
జ
5. చంద్రశేఖర్ తల్లి ఎవరు?
జ
6. సుమలత మృతికి కారకుడు?
జ
7. 'స్వాన్స్ వే' రాసింది ఎవరు?
జ
8. 'పాపం' కథ మూల రచయిత?
జ
9. వారసుడు కావాలని తపించింది?
జ
10. ప్రపంచంలో పొడవైన అమ్మాయి?
జ

---

పంపినవారి పేరు: ------------------

------------------వయసు (   )

చిరునామా: ----------------------

------------------------------

------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

చ్చి భయపడ్డాడు భుజంగరావు.

★ ★ ★

అత్తగారి ఇంట్లో శశి నిజంగా నరకం అనుభవిస్తూనే వుంది. నరసింహ డ్యూటీ నుండి ఇంటికి వచ్చినప్పుడు తన గోడు చెప్పుకొని ఏడుస్తూ వుండేది. అత్తామామలు, జ్యోతి కూడా తనను ఏ విధంగా బాధలు పెడుతున్నారో అతనితో చెప్పుకునేది.

అతని నుండి ఎలాంటి స్పందన ఉండేది కాదు. అమ్మానాన్నలను ఎదిరించి మాట్లాడే ధైర్యం లేదు. భార్యను సపోర్ట్ చేయకపోగా ఆమె మీదనే చిందులేసేవాడు.

'ఇలాంటి విషయాల్లో నీవు సర్దుకుపోవాలి తప్ప నేనేమీ చేయలేను' అనేవాడు.

'ఇంకెందుకు ఇటువంటి భర్త' అనుకుంది శశి.

తన ఊహా ప్రపంచమంతా తలకిందులయింది. అనునిత్యం మనసుకు దెబ్బలే తగులుతున్నాయి. డిగ్రీలో తాను అనుభవించిన ఘడియలే సంతోషదాయకమైనవి తన జీవితంలో అనిపించింది.

డిగ్రీ తర్వాత నలుగురిలో తాను సంతోషంగా మెలుగుతున్నా గుండెలోతుల్లో నుంచి వచ్చిన స్వచ్ఛమైన సంతోషం కాదది. ఎక్కడో వెలితి కనబడుతూనే ఉంది.

శశి ఇంట్లో ఒకరోజు షోకేస్ శుభ్రం చేస్తూ ఉంది.

అప్పుడు పొరపాటున చేతి నుండి మట్టితో చేసిన కృష్ణుడి బొమ్మ కిందపడి విరిగిపోయింది.

అంతే! విశాలాక్షి, జ్యోతి పరుగు పరుగున హాలులోకి వచ్చారు. ఆ బొమ్మ జ్యోతికి ఎంతో ఇష్టమైనదట. వెంటనే శశి చెంప ఛెళ్ళుమనిపించింది జ్యోతి.

విశాలాక్షి కూడా కోపంతో ఊగిపోతూ జుట్టు పట్టుకుని వంగదీసి వీపుమీద నా

లుగు దెబ్బలు వేసింది.

'శనిలాగ దాపురించావు గదే మా ఇంటికి! ఇంట్లో అన్ని సామాన్లు నాశనం చేస్తున్నావు. నీవు మనిషివా, రాక్షసివా?' ఇలా నానా మాటలు అన్నారు.

భర్తనుంచే సపోర్టు రానప్పుడు వారిని ఏ విధంగా ఎదిరిస్తుంది? వారి మీద కోపం వచ్చినా అణచుకోవాలి మరి!

ఏమీ మాట్లాడకుండా ఏడుస్తూ తన గదిలోకి వెళ్ళిపోయింది. ఈసారి బద్రి నారాయణ భూవివాదాల విషయంగా మదనపల్లె వెళ్ళి, వాటిని సెటిల్ చేసుకొనే సందర్భంగా లాయర్లతో సంప్రదించి జ్యోతికి విడాకుల గురించి కూడా మాట్లాడుకొని వచ్చాడు.

తన కూతురి సంబంధాన్ని చక్కదిద్దవలసింది పోయి విడాకులకు ప్రయత్నించే మూర్ఖపు తండ్రి అతను! కోర్టు వ్యవహారాలు అతనికి ఒక హాబీ! ఏదో తెలివిపరుడినని అనుకుంటాడు.

ఇంట్లో అందరి మనస్తత్వాలు ఒకే విధంగా ఉండటం ఒక రకమైన ప్రత్యేకతే! ఎందుకంటే సాధారణంగా ఏ కుటుంబంలోనైనా నలుగురు ఒకే విధంగా ఉంటే కనీసం ఒకరిద్దరైనా భిన్న భావాలతో ఉంటారు. అన్నదమ్ములుగాని అక్కచెల్లెండ్లు గాని భిన్నమైన స్వభావంతో ఉంటారు. చివరకు కవలలు కూడా భిన్న స్వభావాలతో ఉంటారు.

ఒకరోజు భుజంగరావు శశిని చూసిపోదామని పాకాల వచ్చాడు. బద్రినారాయణ మదనపల్లెకి వెళ్ళాడు.

గుమ్మం తలుపు తట్టాడు.

విశాలాక్షి వచ్చి తలుపు తీసింది.

"నమస్కారమమ్మా ఎలా ఉన్నారు?" అడిగాడు.

"రండి అన్నయ్యగారు! బాగానే ఉన్నాం" అంది మూతి విరుస్తూ.

జ్యోతి కూడా హాలులోకి వచ్చింది.

"ఎలా ఉన్నావమ్మా!" అడిగాడు.

"బాగానే ఉన్నాం అంకుల్" అంది జ్యోతి.

"శశి ఎక్కడమ్మా?" ఆత్రుతతో అడిగాడు.

"పెరట్లో ఉంది, వెళ్ళి చూడండి!" నిర్లక్ష్యంగా జవాబు చెప్పింది విశాలాక్షి.

భుజంగరావు పెరట్లోకి వెళ్ళాడు.

పెరట్లో శశి కొండెత్తు బట్టల మూటను ఉతుకుతూ కనబడింది. ఆ దృశ్యం చూసి భుజంగరావు కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"ఏమ్మా శశీ! వాషింగ్‌మెషీన్‌కు డబ్బులు పంపానుగా? కొత్తది కొనలేదా? బట్టలెందుకు ఉతుకుతున్నావు?" అడిగాడు జాలితో.

"వాషింగ్ మెషీన్‌కు డబ్బులు పంపావా? ఎందుకు పంపావు? నాకు తెలీదే?" అంది శశి.

వెంటనే హాల్లోకి వచ్చాడు భుజంగరావు. గుండెల్లో అగ్నిగుండాలు బద్దలవుతున్నా అణచుకున్నాడు.

"వాషింగ్ మెషీన్‌కు డబ్బులు పంపించాగదమ్మా!" విశాలాక్షితో అన్నాడు.

"అవునన్నయ్యా! మీరు పంపించారు. కొత్తది కొందామని ఆయన చిత్తూరు వెళ్ళాడు. స్టాక్ లేదనీ, ఇప్పుడు రాపో! అప్పుడు రాపో! అని రెండు నెలలుగా తిప్పుకుంటూనే ఉన్నాడు షాపువాడు. ఈలోగా శశికి బాగా అలవాటైంది" అని తానేదో బట్టలు ఉతకడం నేర్పించినట్లు గర్వంగా చెప్పుకొంటూ వచ్చింది విశాలాక్షి.

నిజానికి వాళ్ళు కొత్త వాషింగ్‌మెషీన్ కొనాలని అనుకోలేదు. పంపించిన డబ్బులు వేరే అవసరాలకు వాడుకున్నారు. అలాగని వాళ్లేమీ డబ్బులు లేనివాళ్ళు కాదు కూడ!

కడుపు తరుక్కుపోయింది భుజంగరా

వుకు. ఇక ఉండబట్టలేక "వస్తానమ్మా!" అంటూ బయలుదేరాడు.

"భోజనం చేసి వెళ్ళండన్నయ్యా!" అంది విశాలాక్షి.

"వద్దులేమ్మా! చిత్తూరులో నాకు వేరే పని ఉంది. అర్జెంటుగా వెళ్ళాలి" అని అబద్ధం చెప్పి బయటికి వచ్చాడు.

బస్సులో చిత్తూరుకు బయలుదేరాడు. మనసు పరిపరి విధాలుగా పోతోంది. 'నిజంగా నేను తప్పు చేశానా? తొందర పడి ఎవరితో సంప్రదించకుండా సంబంధం కుదిర్చానా? నా ముద్దుల కూతురిని నేనే నరకకూపంలోనికి నెట్టి వేశానా? ఎంత అమాయకురాలు శశి! ఎన్ని కష్టాలు అనుభవిస్తోందో? ఒక్కరోజు కూడా అత్తామామల మీద తనకు ఫిర్యాదు చేయలేదు! అన్ని కష్టాలు కడుపులో పెట్టుకొనే అనుభవిస్తూ ఉంది. నిజానికి ఈ ఆరు నెలలుగా శశి నుండి తమకు ఫోన్ రానప్పుడే ఏదో అనుమానం మదిలో మెదలుతూ వచ్చింది. ఇప్పుడు రుజువైంది వియ్యంకుల నిజమైన రాక్షసత్వం. ఇంటికి చేరగానే విషయం చెప్తే రోహిణి ఎలా ఏడుస్తుందో? దాని ముఖం చూడగలనా? నిజంగా నేను శశికి అన్యాయం చేశాను' అని అనుకున్నాడు భుజంగరావు.

భుజంగరావుకు పూర్తి భిన్నం బద్రి నారాయణ. స్వంత కూతురు జ్యోతికి విడాకుల ప్రయత్నాలు చేస్తున్నాడతను.

ఒకరు ఉత్తర ధ్రువం, మరొకరు దక్షిణ ధ్రువం!

★ ★ ★

శశి పెళ్ళయి ఇప్పటికి ఎనిమిది నెలలు కావస్తోంది. "ఏమ్మా! ఏమన్నా విశేషమా? " అడిగింది విశాలాక్షి.

"లేదత్తయ్యా!" అంది శశి.

ఇంకొక నెల గడిచింది.

మళ్ళీ అదేవిధంగా అడిగింది విశాలాక్షి. శశి నుండి అదే సమాధానం.

"ఏమిటి! కొంతకాలం వరకు పిల్లలు పుట్టకూడదని ఇద్దరూ అనుకున్నారా? "

"అటువంటిదేమీ లేదత్తయ్యా" అంది శశి బిడియంగా.

పడకటింటి రహస్యాలు ఏమని చెప్తుంది? పడకగదిలో కూడా నరసింహ చాలా ముభావంగా ఉంటాడని ఎలా చెప్తుంది? పైగా నరసింహకు ఒక ప్రత్యేకమైన శాడిస్టిక్ అలవాటు ఉంది. ఎప్పుడైనా ఎక్కువ సంతోషమైనప్పుడు శశి చేయి పైభాగంలో పాదాల దగ్గర సిగరెట్టుతో చిరువాతలు పెడ్తాడు. అదోరకమైన రాక్షసానందం.

చేతుల మీద, పాదాల మీద కనబడే ఆ నల్లటి మచ్చలను బయట పడనీయకుండా తనలోనే దాచుకొనే ప్రయత్నం చేస్తుంది ఆ భూదేవి శశి.

ఇలా నరసింహ ప్రవర్తిస్తుంటే ఇద్దరూ కలిసి నిర్ణయాలు తీసుకోవడమా!

నరసింహ ఎంత ముభావంగా, సీరియస్‌గా ఉంటాడో తనూ అంతే సీరియస్‌గా పైపెచ్చు ఏహ్యాభావంతో ఉంటోంది. ఇటువంటి మనిషితోనా తాను జీవితాంతం సంసారం చేయాలి? అనుకుంటూ ఉంటుంది. తన ఆశలన్నీ పటాపంచలయ్యాయి.

విశాలాక్షికి అనుమానమొచ్చింది. అప్పటి నుండి ప్రతి చిన్న విషయానికి 'గొడ్రాలు' అని ఎత్తిపొడుపులు మొదలుపెట్టింది.

శశి భరించలేకపోయేది. ఎదురు మాట్లాడితే గజ్జికుక్కలా ఎగిరిపడ్తారు. అదేదో సామెతలాగా ఊరకుండటమే మంచిదనుకుంది.

విశాలాక్షి సహనం కోల్పోయింది.

విషయం బద్రి నారాయణకు చెప్పింది. దానికాయన వైద్య పరీక్షలు చేయిద్దామ

ని అన్నాడు. కొన్ని రోజుల తర్వాత నర సింహను, శశిని వైద్య పరీక్షల కోసం చిత్తూరు తీసుకెళ్లాడు. అందులో శశిలో ఎలాంటి లోపం లేదని తేలింది. ఉన్న లోపమంతా నరసింహలోనే!

'స్పెర్మ్ కౌంట్' చాలా తక్కువగా ఉంది!

పాకాల వచ్చారు. విషయం చెప్పాడు విశాలాక్షికి బద్రినారాయణ. అంతే! కుప్ప కూలిందామె.

అప్పటి నుండి శశిని గొడ్రాలు అనడం మానేసింది.

మూడు నెలలు గడిచాయి. నరసింహకు గుంతకల్లుకు ట్రాన్స్‌ఫర్ అయింది. పదిహేను రోజుల్లో డ్యూటీలో జాయిన్ కావాలి.

బద్రినారాయణకు విషయం చెప్పాడు. గుంతకల్లులో నీటి సౌకర్యం సరిగా ఉండదట. అందుకని అనంతపురంలో ఇల్లు అద్దెకు తీసుకొని గుంతకల్లుకు వస్తూపోతూ ఉంటాను అన్నాడు.

"సరే నీ ఇష్టం" అన్నాడు బద్రినారాయణ.

"మరి మీరందరూ వస్తారా? " అనుమానంగానే అడిగాడు నరసింహ.

"లేదురా! నాకు మదనపల్లెలో కోర్టు వ్యవహారాలు అవీ ఉంటాయి. ఏదో పాకాల దగ్గరగా ఉంది కాబట్టి ఇక్కడికి వచ్చాను. నువు గుంతకల్లుకు వెళ్లితే నేనూ మదనపల్లెకి మకాం మార్చేస్తాను. అక్కడ మనకు ఇల్లు, పొలాలు అన్నీ ఉన్నాయి కదా! వాటిని చూసుకోవాలి! నీవు అనంతపురంలో స్థిరపడ్డాక అమ్మనో, చెల్లినో పంపిస్తాలే" అన్నాడు.

బద్రినారాయణ, విశాలాక్షి, జ్యోతి తమ సామాన్లన్నీ ప్యాక్ చేసుకొని నరసింహ కంటే ముందరగానే మదనపల్లె వెళ్లిపోయారు.

నరసింహ అనంతపురంలో ఉన్న తన స్నేహితుడు భార్గవకు ఫోన్ చేశాడు, ఏదైనా అపార్టుమెంట్‌లో మంచి ఫ్లాట్ వెదికి పెట్టమని. తాను వారం రోజుల్లో బయలుదేరి వస్తున్నానని చెప్పాడు.

వెంటనే భార్గవ 'ప్రైమరీ ఎన్‌క్లేవ్'లో ఒక ఫ్లాట్ చూశాడు. విషయం నరసింహకు చెప్పాడు.

"ఫ్లాట్ బాగుంది. నువు ఎప్పుడైనా బయలుదేరి రావచ్చు. రెండు నెలల అడ్వాన్స్ నేనే ఇచ్చాను" అని చెప్పాడు.

వారం రోజులు గడిచాయి. నరసింహ, శశి తమ సామాన్లన్నిటినీ ప్యాక్ చేసుకొని అనంతపురం బయలుదేరారు.

"ఏమండీ! మనం అనంతపురం వెళ్తున్నాం గదా! మా అక్క నాగమల్లికను కొన్ని రోజులు తోడు ఉండమని పిలిపించుకుంటానండి!" అడిగింది శశి.

"సరే!" అన్నాడు నరసింహ.




**"అ**క్కా! కుమార్ సార్ ఇదే అపార్టుమెంటులో ఫస్టుఫ్లోర్‌లో ఉంటున్నారట. ఫ్లాట్ నెంబర్ నూటరెండు" అంటూ కూరగాయల సంచితో సంబరంగా ఇంట్లోకి వస్తూ అంది శశి.

హాల్లో కూర్చొని ఉతికి ఆరవేసిన బట్టలను మడిచిపెడుతూ ఉన్న నాగమల్లిక ఒక్కసారి ఉలిక్కిపడింది. శశి వంటింట్లోకి వెళ్ళింది. కొన్ని కూరగాయలు తరుగుదా

మని హాల్లోకి మళ్ళీ వచ్చింది.

"సార్‌వాళ్ళు సెలవులకని వెళ్ళారంట. వారం రోజుల్లో వస్తారంట" అంది శశి.

"అలా మార్కెట్‌కు వెళుతుంటే అపార్టు మెంట్ బోర్డు చూశాను. ప్రసన్నకుమార్, ఫ్లాట్ నెంబర్ నూట రెండు అని ఉంది. అక్కడే ఉన్న మరొక ఓనర్‌ను 'ప్రసన్నకు మార్ ఎవరండి?' అని అడిగాను. 'కాలేజీలో బాటనీ లెక్చరర్ అని చెప్పాడు" అని నాగమల్లికకు చెప్తూ...

"అక్కా! సార్ వాళ్ళు సెలవుల నుండి రాగానే ఒకసారి వెళ్ళి కలుద్దామా?" అని అడిగింది.

## కొత్తగాలి...



**నాయకుడంటే**
**ఊసరవెల్లి,**
**గోడపై పిల్లి కాదు!**
**ఆపదలో**
**ఆదుకునే హస్తం!!**

– వేమన, శ్రీకాకుళం

నాగమల్లికకు ఏం చెప్పాలో అర్థం కాలేదు. "కానీ.. చూద్దాం" అంటూ పక్క గదిలోనికి మడిచిపెట్టిన బట్టలతో జారుకుంది.

'ప్రైమరీ ఎన్‌క్లేవ్' అపార్టుమెంటులో శశివాళ్లు చేరి దాదాపు ఇరవై రోజులు అయింది. వాళ్లు నాలుగో ఫ్లోర్‌లో నాలుగు వందల రెండో ఫ్లాట్‌లో అద్దెకుంటున్నారు. పక్కనే ఉన్న ఫ్లాట్‌వాళ్ళు తప్ప ఇంకా ఎవరూ పరిచయం కాలేదు.

నరసింహా పొద్దున గుంతకల్లుకు డ్యూటీకి వెళ్ళి సాయంత్రమో, రాత్రికో ఇల్లు చేరుకుంటాడు. శశికి తోడుగా కొన్ని రోజులు ఉండిపోదామని నాగమల్లిక ఆ ఊరు వచ్చింది. శశి ఇప్పుడు మళ్లీ ప్రసన్నకుమార్ సార్ గురించి చెబుతుంటే ఆ మాటలను తప్పించుకొని గదిలోనికి వచ్చిందేకాని ఆమె కొంత కలత చెందింది.

సెల్‌ఫోన్ తీసుకుంది.

మంజులకు ఫోన్ చేసింది.

"హలో మంజులా! బాగున్నావా! అందరూ బాగున్నారా?" అంటూ మామూలుగా కుశల ప్రశ్నలు వేసింది.

అటువైపు నుండి "ఆ...! చెప్పు అక్కా! ఏమిటి విశేషం? శశి ఎలా ఉంది! మరిదిగారు ఎలా ఉన్నారు?"

"అంతా బాగానే ఉన్నారు. నీకిప్పుడు ఫోన్ ఎందుకు చేశానంటే వీలు చూసుకొని నువ్వు ఒకసారి అనంతపురం రాగలవా!" అని అడిగింది నాగమల్లిక.

"ఏంటి! మళ్ళీ ఏమన్నా ప్రాబ్లం వచ్చిందా!" అడిగింది మంజుల.

"ఇప్పటికేం లేదు కాని ప్రాబ్లం రావచ్చని అనుకుంటున్నాను. అందుకే ముందుగానే నీకు ఫోన్ చేస్తున్నాను."

"మా ఆయనతో చెప్పి వీలు చూసుకొని తప్పకుండా వస్తాను" అంది మంజుల. నాగమల్లిక కళ్ళు మూసుకొని ఆలోచనల్లో పడింది. గతమంతా కళ్ళముందు కదిలింది.

హాల్లో కూరగాయలన్నీ తరిగిన తర్వాత శశి వంటకుపక్రమించింది.

మధ్యాహ్నం ఒంటిగంటయింది. వంట రెడీ అయింది. 'నరసింహ గుంతకల్లు వెళ్లాడు. రా! భోం చేద్దువుగాని' అని అక్క నాగమల్లికను పిలిచింది శశి.

ఇద్దరూ మౌనంగా భోం చేస్తున్నారు. 'శశి మనసులో ఏమేమి ఆలోచనలు మెదలుతున్నాయో పాపం! అత్తారింటిలో చాలా నరకం అనుభవించింది. ఇక్కడికి వచ్చిన ఈ ఇరవై రోజుల్లోనే భార్యాభర్తల

మధ్య అనురాగం అంతంత మాత్రంగానే కనబడింది. కొత్త దంపతులు ఎంత సరదాగా ఉండాలి? ' ఇలా శశి గురించి ఆలోచనలతో సీరియస్‌గా ఫీలవుతూ ఉంది నాగమల్లిక.

"ఏమక్కా అంత సీరియస్‌గా వున్నావు? " అడిగింది శశి.

"ఏమీ లేదే! నాన్న ఆరోగ్యం ఎలా వుందో అని అనుకుంటున్నాను" అబద్ధం చెప్పింది నాగమల్లిక.

"బాగానే వున్నారుగా! రోజూ ఫోన్ చేస్తూనే వున్నావుగా!"

"అదే! అప్పుడప్పుడు అలా అనిపిస్తూ వుంటుంది" అంది నాగమల్లిక.

ప్రసన్నకుమార్ సెలవుల నుండి ఇక రెండు రోజుల్లో వస్తారనగా నాగమల్లిక మంజులకు మళ్లీ ఫోన్ చేసింది.

"నువు వెంటనే బయలుదేరి రా" అని ఫోన్‌లో చెప్పింది.

"అలాగే అక్కా! రేపు బయలుదేరి వస్తాను" అంది మంజుల.

మరుసటి రోజు సాయంత్రం మంజుల అనంతపురానికి వచ్చింది.

"నమస్కారం మరిదిగారు! బాగున్నారా? " అని అడిగింది మంజుల నరసింహను చూస్తూ.

"నమస్కారం! మీరు బాగున్నారా? ఎప్పుడొచ్చారు? " అడిగాడు.

"మీరు అనంతపురానికి వచ్చాక ఒకసారి చూసి పోదామని సాయంత్రం వచ్చాను" అంది.

నరసింహ ఒకట్రెండు మాటలు మాట్లాడి తన గదిలోనికి వెళ్ళాడు. అతను ఇంట్లో వున్నప్పుడు తాననుకున్న సమస్య గురించి మంజులతో మాట్లాడడానికి ఇష్టం లేదు నాగమల్లికకు. మరునాడు మధ్యాహ్నం నరసింహ డ్యూటీ మీద వెళ్తాడు. అప్పుడు మాట్లాడుకోవచ్చులే అనుకుంది.

మంజులను హైదరాబాద్ విశేషాలు చెప్పమని శశి, నాగమల్లిక అడిగారు.

ముగ్గురు అక్కచెల్లెండ్లు తాపీగా హాల్లో కూర్చుని మాట్లాడుకుంటున్నారు. నరసింహ అప్పుడప్పుడు వచ్చి కాసేపు కూర్చొని మరలా గదిలోకి వెళ్తున్నాడు.

మరునాడు మధ్యాహ్నం డ్యూటీ మీద గుంతకల్లు వెళ్లాడు.

శశి గదిలో పడుకొని వుంది.

"ఎందుకే పిలిచావు? " అడిగింది నాగిని మంజుల.

"ఏమీ లేదులే! ప్రసన్నకుమార్ సార్ ఇదే అపార్టుమెంటులో నూటరెండో నెంబరు ఫ్లాట్‌లో ఉన్నాడట. ఇప్పుడు వాళ్లు సెలవుల మీద వెళ్లారట. రేపో మాపో వస్తారట. శశి వాళ్ళను ఒకసారి కలుద్దామంటోంది" అంది నాగమల్లిక.

"సరే! అది వాళ్ళ సార్‌ను కలవవచ్చు అందులో తప్పేంలేదు" అంది మంజుల.

"కాని అదే సాకుతో వాళ్ళ ఫ్యామిలీతో సంబంధం పెట్టుకొని తరచూ వాళ్ళ ఇంటికి పోయివస్తూ వుంటే అపార్టుమెంటులోని వాళ్ళకు అనుమానం రావచ్చు గదా!" అంది నాగమల్లిక.

"ఎందుకు వస్తుంది? " అడిగింది మంజుల.

"ఎందుకంటే శశి ఆయన స్టూడెంట్ కాబట్టి. వాళ్ళకు ఇంతకుముందే పరిచయముందని కూడా మిగతా వాళ్లు చెడుగా అనుకోవచ్చు. కాని శశి ఎలాంటిదో మనకు తెలుసు. ఇంతకుముందే ప్రసన్నకుమార్‌ను ప్రేమించిందన్న విషయం అపార్టుమెంటులోని వారికి తెలిసిందంటే మన ఫ్యామిలీకి, ప్రసన్నకుమార్ గారి ఫ్యామిలీకి వున్న గౌరవం దెబ్బతింటుంది. ప్రసన్నకుమార్‌గారు మనకంటే ముందర ఎప్పుడో ఈ అపార్టుమెంటులో చేరారు. ఇప్పటి



వరకూ గౌరవమైన కుటుంబంగా ఇక్కడ మంచిపేరు ఉంది" అంది నాగమల్లిక సాలోచనగా.

"అవును! శశి స్టూడెంట్ డేస్‌లో ఏమీ తెలియని వయసులో అలా బిహేవ్ చేసి వుండవచ్చు. కాని ఇప్పుడు పెళ్ళయింది కదా! మరలా అలా ఎందుకు ప్రవర్తిస్తుంది? " అంది మంజుల.

"నిజమే! శశి మీద మనకు పూర్తిగా నమ్మకముంది. కాకపోతే నరసింహ తనతో సరిగా వుంటున్నాడా? తన జీవితంలో ఏమన్నా సంతోషంగా వుందా? ఎవరితోనైనా సరదాగా గడిపిందా? కాబట్టి ఎవరో ఒకరు పరిచయమైన వ్యక్తితో కాసేపు మాట్లాడుకుందామనుకుంటుంది. పైగా నరసింహ అప్పుడప్పుడు క్యాంపులకు వెళ్తుంటాడు. మనం పర్మినెంటుగా ఇక్కడ ఉండం. తెలిసిన వ్యక్తి, పైగా తాను ఎంతో అభిమానించే వ్యక్తి ఇదే అపార్టుమెంటులో వుంటున్నారు. ఈ అపార్టుమెంటులో చేరడం కేవలం యాదృచ్ఛికమైనా తెలిసిన వారు వుండటంతో ఆ మాత్రం చొరవ చూపడం సహజమే కదా!" అంది నాగమల్లిక, చెల్లెల్ని కన్విన్స్ చేయడానికి. మంజుల ఏం మాట్లాడలేదు.

"సరే! ఇప్పుడు తనకు పెళ్లయింది. ప్రసన్నకుమార్ మీద మునుపటిలా ప్రేమతో కాకుండా అభిమానం కొద్దీ అతని ఇంటికి వెళ్తూ, వస్తూ వుండవచ్చు. ఆయన భార్య కూడా శశితో బాగా స్నేహం పెంచుకోవచ్చు! పరిచయాలు పెరగవచ్చు. కాని శశి ఎప్పుడు వాళ్లింటికి వెళ్తూ వస్తూ వుంటుంది? నరసింహ డ్యూటీకి పోయినప్పుడే...! నరసింహను కూడా తీసుకునిపోయి వాళ్ళతో పరిచయం చేసి సరదాగా గడపవచ్చు. కాని నరసింహ అలా వచ్చే రకమా? అలా శశితో రాగలడా? డ్యూటీ, డ్యూటీ అని ఎప్పుడూ తిరుగుతూనే వుంటాడు. మనుష్యులతో సరదాగా కలిసిపోయే రకమూ కాదు.

లోకులు పలు కాకులు. ఒకవేళ శశి ఆ విధంగా ప్రసన్నకుమార్ ఫ్యామిలీతో సంబంధాలు పెట్టుకుంటే ఎవరో ఒకరు అనుమానం వెలిబుచ్చవచ్చు. అది ఆ నోట ఈ నోట పడి నరసింహ చెవిలో పడిందనుకో... అప్పుడెలా? ఇంతవరకు నరసింహకు శశి విషయంలో ఎటువంటి అనుమానమూ లేదు. ఒకసారి అనుమాన బీజం ఆయన మనసులో పడిందంటే ఇంకేముంది? శశి సంసారం సర్వనాశనమైనట్లే!" అంది నాగమల్లిక బాధగా.

మంజుల మౌనంగా ఆలోచిస్తోంది.

"అందుకని శశి ఎంత త్వరగా ఇల్లు ఖాళీ చేస్తే అంత మంచిది. ముందు ముందు ఎటువంటి అపవాదులకు తావివ్వకుండా వుంటుంది. నీ అభిప్రాయం కోసం నిన్ను ఇక్కడికి రమ్మని పిలిచాను" అంది నాగమల్లిక తన నిర్ణయం తెలుపుతూ.

అంతలో శశి హఠాత్తుగా తన రూములో నుండి హాల్లోకి వచ్చింది. "మీరు మాట్లాడుకున్నదంతా వింటూనే వున్నాను" అంది.

అక్కచెల్లెళ్లిద్దరూ బిత్తరపోయారు.

"అవును! మీకు అనుమానం రావడం సహజమే! కాని నేను అలాంటిదాన్నని మీరెలా అనుకుంటారు? నా బతుకు ఎలాగూ మంటగలిసిపోయింది. కాలేజీలో గడిపిన రోజులే నా జీవితంలో మంచి రోజులు. ఆ తర్వాత అన్నీ కష్టాలే. ఒక సుఖం లేదు, ఒక సంతోషం లేదు. ఇప్పుడు అభిమానంతో సార్‌ను పలకరిద్దామనుకొన్నా సంఘం, సమాజం, పరువు, ప్రతిష్ట అన్నీ అడ్డు వస్తున్నాయి. ఒక మనిషికి కోరికలంటూ ఉండకూడదా? నా దురదృష్టంకొద్దీ నా కోరిక సమాజం దృష్ట్యా ఆచరణయోగ్యమైంది కాదు.





అయినా మీ భయం కాని ప్రసన్నకుమార్ సార్‌ను కలిసినప్పుడు ఆయన నన్ను గుర్తు పట్టినా, మిగతా అందరితో ఎలా ప్రవర్తిస్తారో నాతో కూడా అలాగే ఉంటారు. ఎందుకంటే ఆయన దృష్టిలో ఎంతోమంది విద్యార్థినుల్లో నేనూ ఒకదాన్ని. కానీ థియరీ క్లాసులో కాకపోయినా ప్రాక్టికల్స్‌లో సన్నిహితంగా వుంటారు కాబట్టి కాస్తంత మాట్లాడవచ్చునేమో!" అంది శశి బాధగా.

"నాగి చెప్పిందంతా నిజమే కదా! నువు ఇల్లు ఖాళీ చేయడమే మంచిదేమో అని నాకూ అనిపిస్తూ వుంది" అంది మంజుల.

"సరేలే! మీరనుకున్నట్లే ఇల్లు ఖాళీ చేస్తాను. ఈ ఇంట్లో చేరి నెల రోజులు కూడా కాలేదు. వెంటనే ఖాళీ చేస్తే నరసింహకు అనుమానం రావచ్చు. ఎందుకు ఖాళీ చేయాలని అడుగుతాడు. అందుకని ఇల్లు సౌకర్యంగా లేదని, రోజూ ఏదో ఒక నెపం చూపించి ఒక ఆరు నెలలైన తర్వాత ఖాళీ చేయిస్తాను. అయితే రేపు ప్రసన్నకుమార్ సార్‌వాళ్లు వచ్చిన తర్వాత ఒకసారైనా కలుద్దాం. మీరేమంటారు" అంది శశి.

"తప్పకుండా కలుద్దామే! ఏదో నీ మంచి కొరకే చెప్తున్నాం. నీవు సుఖంగా వుండాలనే మా కోరిక" అని అన్నారు ఇద్దరు అక్కలు చెల్లిని దగ్గరకు తీసుకుంటూ.

ప్రసన్నకుమార్ ఫ్యామిలీ సెలవుల నుండి తిరిగి వచ్చిందని తెలిసింది. నరసింహ రేపు మరలా డ్యూటీకి వెళ్తాడు. పొద్దున్నే వెళ్తాడు. కాబట్టి ఎనిమిది గంటలకు వాళ్ళింటికి వెళ్లవచ్చునుకుంది శశి.

"అక్కా! రేపు పొద్దున ప్రసన్నకుమార్ సార్ ఇంటికి వెళ్దామా? " ఆ రాత్రి అడిగింది శశి.

"సరే!" అంది మంజుల.

మరుసటి రోజు నరసింహ డ్యూటీకి వెళ్ళాక ఎనిమిది గంటలకు శశి, మంజుల

## వర్షాలకు కారణమేంటో?

సంజీవ్‌దేవ్ తనతో సాన్నిహిత్యంగల ఆశా అనే విద్యార్థినికి రాసిన ఒక లేఖలో వర్షాల గురించి ప్రస్తావిస్తూ.. 'ప్రియమైన ఆశా, ఎండలు పోయి వర్షాలు వచ్చాయి. ప్రకృ



తిలోను, మానవునిలోనూ నవ చైతన్యం మేల్కొంది. ఎటుచూసినా ఆకుపచ్చ చీరె ధరించిన ప్రకృతి మాతే! మీ అక్కాబావ అంతా కులాసానా? మీ బావగారి సిగరెట్ల పొగయొక్క మేఘాలే ఈ వర్షాలకు కారణమనుకుంటాను. నువ్వేమంటావ్?' అని రాశారు చమత్కారంగా.

లిఫ్టులో కిందికి దిగి నూటరెండు ఫ్లాట్ దగ్గర ఆగారు. తలుపు వేసి వుంది. కాలింగ్ బెల్ నొక్కింది శశి.

కాసేపటికి తలుపు తీసింది ప్రసన్నకుమార్ భార్య కృష్ణవేణి.

"ఎవరండీ!" అడిగింది.

"ప్రసన్నకుమార్ సార్ వున్నారా? మాట్లాడాలి? " అంది శశి.

"రండి! కూర్చోండి. పది నిమిషాల్లో వస్తారు" అంటూ డ్రాయింగ్ రూంలో వున్న కుర్చీలను చూపించింది.

"పిల్లలను స్కూల్‌కు రెడీ చేయాలి. మీరు కూర్చొని వుండండి. ఆయన వస్తారు" అంటూ లోపలికి వెళ్ళింది కృష్ణవేణి.

శశి, మంజుల నిశ్శబ్దంగా కూర్చొని

వున్నారు.

లోపలి నుండి పిల్లల అరుపులు, కృష్ణ వేణి గదమాయింపులు అన్నీ వినపడ్తున్నాయి. డ్రాయింగ్ రూం మాత్రం గంభీరంగా సైలెంట్‌గా వుంది.

ప్రసన్నకుమార్ వస్తే ఎలా మాట్లాడాలో ముందే ఊహించుకుంటూ వుంది శశి. అసలు గుర్తుపడ్తారో లేదో! మనసులో ఎక్కడో ఒకచోట అనుమానం.

ఇంతలో ప్రసన్నకుమార్ డ్రాయింగ్ రూంలోకి వచ్చాడు.

ఆశ్చర్యం! అతను శశి బాటనీ లెక్చరర్ కాదు! అయినా ఇద్దరూ "నమస్కారం సార్" అన్నారు.

"కూర్చోండమ్మా!" అన్నాడు ప్రసన్నకుమార్.

"సారీ సర్! మీరు మా బాటనీ లెక్చరర్ అనుకున్నాను" తడబడుతూ అంది శశి.

"మీరు చిత్తూరు కాలేజీలో చదివారా? " అడిగాడు.

"అవును! చిత్తూరు గవర్నమెంట్ డిగ్రీ కాలేజీలో బి.ఎం.సీ. చదివాను" అంది.

"నేను ఈ ఊర్లో సర్వోదయ ప్రైవేట్ డిగ్రీ కాలేజీలో బాటనీ లెక్చరర్‌గా నాలుగేండ్ల నుండి పని చేస్తున్నాను. మీ లెక్చరర్ ప్రసన్నకుమార్‌గారు ఈ ఊర్లో గవర్నమెంట్ డిగ్రీ కాలేజీలో పనిచేస్తున్నారు. లాస్టియర్ అనుకుంటా, ట్రాన్స్‌ఫర్ మీద ఇక్కడికి వచ్చారు. నేను ఆయన్ని ఇంతవరకూ చూడలేదు. నాకు కూడా అతన్ని ముఖాముఖి కలవాలని వుంది. ఇంకొక విశేషమేమంటే మా ఇద్దరి పేర్లు, సబ్జెక్టు ఒకే విధంగా వుండడం వల్ల ఒక్కొక్కసారి ఆయన ఉత్తరాలు నాకు, నా ఉత్తరాలు ఆయనకి ఇస్తుంటారు. నేను ఆయన ఉత్తరాల్ని మా అటెండర్ ద్వారా పంపిస్తూవుంటాను. ఆయన కూడా అలానే చేస్తూవుంటారు. ఏది ఏమైనా ఆయన్నోసారి తప్పకుండా కలుస్తా. మా వల్ల యూనివర్శిటీవాళ్లకు కూడా ఎన్ని తిప్పలుంటాయో! ఇదొక వింతైన పరిస్థితి. మీరూ ఆ విధంగానే పొరబాటు పడ్డారు" అన్నాడు ప్రసన్నకుమార్.

"అయినా మీరిక్కడికి ఎలా వచ్చారు? " అనుమానంగా అడిగాడు.

"మేము ఈమధ్యనే ఈ అపార్టుమెంటులో చేరాం. ఫ్లాట్ నెంబర్ నాలుగు వందల రెండులో వుంటున్నాం. మా ఆయన నరసింహ, గుంతకల్లు రైల్వేస్టేషన్‌లో ఉద్యోగం చేస్తున్నారు. తరచూ వెళ్తూ, వస్తూ వుంటారు. ఈమె మా అక్కయ్య మంజుల" అని పరిచయం చేసింది శశి.

"సరే సార్! ఇక వస్తాం. సారీ ఫర్ ద డిస్టర్బెన్స్" అంది మళ్ళీ శశి.

"కూర్చోండమ్మా. కాఫీ తాగి పోదురు గాని" అంటూ అతని భార్య కృష్ణవేణిని పిలిచాడు.

ఆమె హడావిడిగా వచ్చింది. భార్యను వాళ్ళకు పరిచయం చేశాడాయన.

"ఉండండి! కాఫీ తాగి పోదురు" అని ఆమె కూడా అంది.

"లేదండి! మాకు అర్జెంటుగా పని వుంది. వెంటనే వెళ్లాలి" అని చెప్పి అక్కాచెల్లెళ్లు ఇద్దరూ బయటికి వచ్చారు. తమ ఫ్లాట్‌కి చేరుకున్నారు.

నాగమల్లిక "ఏమే! అప్పుడే వచ్చారా!" ఆశ్చర్యంతో అడిగింది.

ఇంటికి వస్తూ లిఫ్టులో వస్తుండగా బిగపట్టుకున్న నవ్వు, నాగమల్లిక అడిగిన ప్రశ్నకు ఒక్కసారి పెల్లుబికి రాగా, ఒకరినొకరు చూసుకొని బిగ్గరగా నవ్వుకున్నారు. అలా కొంతసేపు నవ్వుకుంటూనే వున్నారు.

"ఏమైందే! చెప్పండి? " ఆత్రుతతో అడిగింది నాగమల్లిక.

అతికష్టం మీద నవ్వునాపుకుంటూ విషయం చెప్పింది మంజుల.

విషయం తెలిశాక నాగమల్లిక కూడా నవ్వుకుంది.

"అయితే ఇక మీ అనుమానాలు తీరాయి గదా? " అంది శశి.

"ఇంకేముంది! నీవు పర్మినెంటుగా ఇక్కడ వుండిపోవచ్చు" అంది ఏదో పర్మిషన్ ఇచ్చినట్లు మంజుల.

"సరేనే! ఇక నేను రేపు నరసింహ వచ్చింతర్వాత హైదరాబాద్ వెళ్తాను" అంది మంజుల.

"నేను కూడా వెళ్తాను. ఇక్కడికి వచ్చి చాలా రోజులైంది. అక్కడ చిత్తూరులో అమ్మానాన్న ఎలా వున్నారో! వాళ్ళను చూసుకోవాలి గదా!" కాస్త ఆందోళనగా అంది నాగమల్లిక.

మరుసటి రోజు నరసింహ వచ్చాడు.

నాగమల్లిక, మంజుల ఇద్దరూ "ఏమండీ! మేము ఊరెళ్ళి వస్తాం. నిన్ననే వెళ్లుండాల్సింది. మీకు చెప్పి వెళ్దామనుకొన్నాం" అన్నారు.

"ఏమిటి తొందర? అప్పుడే వెళ్తున్నారు. కొన్ని రోజులు వుండి వెళ్ళండి" మామూలుగా అందరితో అనే ధోరణిలో అన్నాడతను.

"లేదులెండి! వెళ్ళాలి" అని చెప్పారు.

ఎలాగైనా 'ఉండండి' అని బలవంతం చేయడని తెలుసు. అక్కయ్యలిద్దరికీ బస్‌స్టాండ్‌లో 'బై' చెప్పి ఇంటికి వచ్చింది శశి.

★ ★ ★

ఎనిమిది నెలలు గడిచాయి.

ఒకరోజు ఫ్లాట్ ఓనరు దశరథరామయ్య నరసింహ ఇంటికి వచ్చాడు.

"నమస్కారం దశరథరామయ్యగారూ! రండి, కూర్చోండి" అంటూ ఆహ్వానించాడు నరసింహ.

ఆజానుబాహువు దశరథరామయ్య. తెలుగుదనం ఉట్టిపడేలా తెల్లని పంచెకట్టు, అట్లాగే తెల్లని పల్చని లాల్చీ భుజాన పైపంచె... వెరసి పదహారణాల తెలుగు వాడిలా వున్నాడు.

"నమస్కారం నరసింహగారూ" అంటూ కుర్చీలో కూర్చున్నాడు.

"మొన్ననేగా హౌస్‌రెంట్ పంపించాను" అన్నాడు నరసింహ.

"నేను హౌస్‌రెంట్‌కు రాలేదు"

"మరి? "

"మీతో ఎలా చెప్పాలో నాకర్థం కావడం లేదు. అయినా చెప్పక తప్పదు"

"ఏమిటో చెప్పండి? "

"ఏమీ లేదు. మూడు నెలల్లో అంటే శ్రావణమాసంలో నా రెండో కూతురి పెళ్ళి వుంది. అసలే ఈ ఊళ్ళో నాకు బంధువర్గం ఎక్కువగా వుంది. పైగా బయటి ఊళ్ళ నుండి వచ్చేవాళ్ళు కూడా ఎక్కువే. మిమ్మల్ని బాధపెట్టదలచుకోలేదు. కానీ ఈ పెళ్ళి ఆకస్మికంగా కుదిరింది కాబట్టి పెళ్ళికి ఈ ఇల్లు అవసరమవుతోంది. మీరు ఏమీ అనుకోకుండా మూడు నెలల్లో ఖాళీ చేస్తే నాకు ఎంతో సహాయం చేసినవారవుతారు. ఇలా చెప్తున్నందుకు నన్ను క్షమించాలి" అన్నాడు.

నరసింహకు కోపం వచ్చింది.

"ఇంట్లో చేరి ఎనిమిది నెలలే అయింది కదండి. అప్పుడే ఇల్లు ఖాళీ చేయమంటే ఎలా? మూడు నెలల్లో మాకు ఇంకో ఇల్లు దొరుకుతుందని గ్యారెంటీ ఏది?

మీరు మమ్మల్ని బాగానే ఇబ్బంది పెడ్తున్నారు. అయినా మూడు నెలల్లో నాకు వేరే ఇల్లు దొరికితేనే నేను ఖాళీ చేస్తాను. లేదంటే ఇక్కడే వుంటాను" అని కటువుగా చెప్పాడు నరసింహ.

"అట్లాగే, అట్లాగే. మరి నేను వస్తాను" అంటూ మూడు నెలల్లో వీళ్ళకు ఇల్లు దొర

కకపోతుందా అనే ధీమాతో వెళ్ళిపోయాడు దశరథరామయ్య.

దశరథరామయ్యతో నరసింహ అలా అన్నాడే గాని మరుసటి రోజు నుండి ఇల్లు వెదికే వేటలో పడ్డాడు.

దశరథరామయ్య ఎలా అయినా ఇల్లు ఖాళీ చేయమని నెత్తిన పడ్డాడు. ఎందు కన్నా మంచిది ఇప్పటి నుండే చూసు కొంటే బాగుంటుందని అభిప్రాయపడ్డాడు నరసింహ.

మళ్ళీ భార్గవకు ఫోన్ చేశాడు.

"భార్గవా! నాకు వెంటనే బాడుగకు ఇల్లు కావాలి. మా ఓనర్ ఖాళీ చేయమంటు న్నాడు" అని విషయమంతా వివరంగా చెప్పాడు.

నరసింహ వారాంతపు సెలవులో ఉన్నప్పుడు భార్గవతో ఇల్లు వెదకటం ఆరంభించాడు.

దాదాపు పదిహేను రోజుల్లో రామచంద్రనగర్‌లోని 'ప్రియా రెసిడెన్సీ'లో థర్డ్ ఫ్లోర్‌లో ఫ్లాట్ నెంబర్ మూడు వందల ఆరు దొరికింది నరసింహకు. విషయం దశరథరామయ్యకు చెప్పాడు. రెండు రోజుల్లోనే ఇల్లు ఖాళీ చేస్తున్నానని కూడా చెప్పాడు.

ఇల్లు ఖాళీ చేయడానికి రెండు రోజులు సెలవు కూడా పెట్టాడు. సామాన్లన్నీ ప్యాక్ చేసుకొని భార్గవ సహాయంతో రామచంద్రనగర్‌లోని కొత్త ఇంట్లో చేరాడు నరసింహ, శశితోబాటు.

శశి ఇంట్లో సామాన్లన్నీ చక్కగా సర్దుకుంటూ వుంది. ఇంకా చాలా సామాన్లు సర్దుకోవాలి. సహాయానికి ఎవరూ లేరు. తానే స్వయంగా చేసుకొని, అలసిపోయింది.

నరసింహ కూడా బయటి పనులు, ఇంటి పనులతో బాగా తిరిగాడు. కాబట్టి అతనూ అలసిపోయాడు.

మరుసటి రోజు ఉదయాన్నే లేచింది శశి.

"ఏమండీ! పాల ప్యాకెట్లు తెస్తారా? నేను తేనా? " అడిగింది గాఢనిద్రలో ఉన్న నరసింహను.

"నువ్వే తీసుకొనిరా!" నిద్రమత్తులోనే గొణిగాడు.

ఫ్లాట్ బయట తాళం వేసి బుట్టతో బయలుదేరింది శశి. లిఫ్టులో కిందికి దిగి అపార్టుమెంట్ గేటు తీసుకొని బయటికి వస్తూ ఎదురుగా వున్న ఇండిపెండెంట్ హౌస్ వైపు చూసింది.

అంతే! ఎదురింటి వసారాలో తమ బాటనీ లెక్చరర్ ప్రసన్నకుమార్ పేపర్ చదువుతూ కనిపించాడు.

పాల ప్యాకెట్ల కోసం వడివడిగా నడిచింది. మనసులో ఎన్నో ఆలోచనలు! సార్ ఇల్లు ఇదన్నమాట! ప్రసన్నకుమార్ సార్‌ను ఓసారి వారి ఇంటికి వెళ్లి కలిస్తే బాగుంటుందనుకుంది. నరసింహ ఈ రోజు డ్యూటీకి వెళ్తాడు. నరసింహ వెళ్ళాక వాళ్ళింటికి వెళ్దామనుకుంది. పనులన్నీ చకచకా చేసుకుంది. నరసింహ పొద్దున్నే పదిగంటల కల్లా వెళ్లాడు కాబట్టి క్యారియర్ కోసం వంట కూడా త్వరగా చేసేసింది. నరసింహ డ్యూటీకి బయల్దేరి వెళ్ళాడు.

## కొత్తగాలి...

**కడుపు నొప్పి అన్నాను**
**గుండెల్ని పిండేశారు!**
**బిల్లు చూపించి!!**

– మండా రిత్విక్,
హైదరాబాద్

శశి ఇంటికి తాళం వేసుకొని లిఫ్టులో కిందికి దిగి ఎదురింటికెళ్ళింది. తలుపు మూసివుంది. కాలింగ్ బెల్ నొక్కింది. ఒక అందమైన ఆవిడ తలుపు తీసి "ఎవ రండీ?" అని అడిగింది. బహుశా ఆమె సార్ భార్య కావచ్చనుకుంది. ఆమెను చూడగానే చాలా సంతోషించింది శశి. మనిషి చక్కగా వుంది. పెద్ద కళ్ళు, మొన దేలిన ముక్కు, విశాలమైన నుదురు, నుదు రుకు అందం తెచ్చే పెద్ద బొట్టు, పొడు గాటి వాల్జడ, ప్రసన్నకుమార్‌కు తగిన భార్యే అని మనసులో అనుకుంది.

"నా పేరు శశి. నేను ప్రసన్నకుమార్ సార్ స్టూడెంట్‌ని" అని అంది.

"లోపలికి రండి! నేను ప్రసన్నకుమార్ భార్యను. నా పేరు వాసంతి. కూర్చోండి" అని ఇంట్లోకి ఆహ్వానించింది ఆమె.

హాల్లో సోఫాలో కూర్చుంది శశి. హాలునంతా కలియజూసింది. చాలా చక్కగా అమర్చి వుంది. 'ఇంటీరియర్ డెకొ రేషన్ బాగానే చేసుకుంది' అనుకుంది శశి మనసులోనే మెచ్చుకుంటూ.

"సార్ కాలేజీకి వెళ్ళారు. మీరెలా సార్‌కు స్టూడెంట్. మీరు ఎక్కడుంటారు?" అడిగింది వాసంతి.

"నేను చిత్తూరు గవర్నమెంట్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజీలో బి.ఎం.సి. చది వాను. సారు మాకు బాటనీ క్లాసులు తీసు కొనేవారు. మేము ఈ వూరికి ట్రాన్స్‌ఫర్ అయి దాదాపు ఎనిమిది నెలలు కావ స్తోంది. మావారు రైల్వే డిపార్టుమెంటులో గుంతకల్లులో పని చేస్తూ వుంటారు. ఈ రోజు పొద్దున్నే డ్యూటీకి వెళ్లారు. ఖాళీగా వున్నాను గదాని మీ ఇంటికి వచ్చాను. మేము ఎదురుగా వుండే అపార్టు మెంటులో నిన్ననే దిగాం. ఫ్లాట్ నెంబర్ 306" అని చెప్పింది శశి.

"చాలా సంతోషం. నాకు మీ అపార్టు మెంటులో కొంతమంది స్నేహి తులున్నారు. ఇప్పుడు మీరు కొత్త స్నేహి తురాలు! కూర్చోండి. కాఫీ తీసుకొస్తాను" అంది వాసంతి.

"వద్దండి! నాకు కాఫీ, టీలాంటివి ఇప్పు డేమీ వద్దు"

"అయితే పండ్ల రసం తీసుకొస్తాను" అని చెప్పి వంటింట్లోకి వెళ్ళింది.

హాలు గోడనిండా ఫొటోలు చాలా వున్నాయి. ఇద్దరు చిన్నపిల్లల ఫొటోలు ప్రత్యేకంగా, ఆకర్షణీయంగా వున్నాయి. సార్ పిల్లలేమో అనుకుంది శశి.

ఐదు నిమిషాల్లో బత్తాయి రసం గ్లాసు లతో హాలులోకి వచ్చింది వాసంతి.

"తీసుకోండి!" అంది.

శశి ఒక గ్లాసు తీసుకొని "వాళ్ళు మీ పి ల్లలా?" అని అడిగింది.

"ఔను! పెద్దవాడి పేరు శ్రీకాంత్. ఫిఫ్త్ స్టాండర్డ్ చదువుతున్నాడు. రెండోవాడు శ్రీశాంత్. సెకండ్ స్టాండర్డ్ చదువుతు న్నాడు"

"మీరు ఉద్యోగం చేయడం లేదా?" ఆమె చదువుకునే వుంటుందనుకొని కుతూ హలంగా అడిగింది శశి.

"లేదు! నేను హౌస్‌వైఫ్‌ని. ఎం.ఎ. సోషి యాలజీ చేశాను" అంది వాసంతి.

"అదేంటి? ఏదన్నా ఉద్యోగం చేయొ చ్చుగా?" అడిగింది శశి.

"ఆయనకిష్టం లేదు. అట్లాగే నాకూ ఇష్టంలేదు" అంది వాసంతి.

"ప్రసన్నకుమార్ సార్ మాకు బాటనీ సబ్జెక్టు చాలా చక్కగా చెప్పేవారు. కాలే జీలో సార్‌కు మంచి పేరుంది. మేమం దరం సార్ క్లాసులంటే చెవి కోసుకునేవా ళ్లం" అంటూ ప్రసన్నకుమార్‌ను పొగిడే సింది శశి.

"ఔను! నాకూ తెలుసు! చాలామంది స్టూడెంట్స్ ఇంటికి వచ్చి డౌట్స్ క్లియర్

చేసుకొని వెళ్ళేవారు" అంది వాసంతి.

"ఇక నేను వస్తానండీ! సార్‌ను మరోసారి ఎపుడన్నా వచ్చి కలుస్తాను. మీరు మా ఇంటికి రండి" అంది శశి.

"అప్పుడప్పుడు వస్తూ పోతూ వుండండి. ఇప్పుడు మనం ఫ్రెండ్స్" అంది వాసంతి.

"తప్పకుండా వస్తూ వుంటాను లెండి!" అంటూ బయల్దేరింది.

ఇంటికి వస్తూ ఆలోచనల్లో పడింది.

వాసంతి ఎంత అదృష్టవంతురాలు! ఉన్నత చదువు చదివినా, భర్త కోసం గృహిణిగానే వుండిపోయింది. వాళ్ళది ఎటువంటి ఒడిదుడుకులు లేని కుటుంబం లాగా వుందనుకుంది. తన విషయం... దురదృష్టం ముందు పుట్టి తను తర్వాత పుట్టానా? అన్నట్టుంది తన జీవితం! తను ఇలాగే కృంగిపోవలసిందేనా? జీవితాన్ని ఇలాగే కష్టాలతో ఈడ్చుకు రావలసిందేనా? వాసంతితో తన జీవితాన్ని పోల్చుకొంటే కొంచెం బాధనిపించింది. అయితే ఆమెపట్ల ఈర్ష్యపడలేదు. 'ఎవరి అదృష్టం వారిది' అని సరిపుచ్చుకొంది.

శశి, వాసంతిల మధ్య రాకపోకలు ఎక్కువయ్యాయి. స్నేహబంధం బలపడింది. ఒకరోజు ప్రసన్నకుమార్ ఇంట్లో వుండగానే వాసంతి ఇంటికి వెళ్ళింది శశి.

"సార్! నేను గుర్తున్నానా? " ప్రసన్నకుమార్‌ను అడిగింది.

"ఆ! గుర్తున్నావు. వాసంతి చెప్పింది, మీరు ఎదురుగా వుండే అపార్టుమెంటులో వున్నారనీ. ఎవరో అనుకున్నాను. ఇప్పుడు నిన్ను చూడగానే గుర్తుకొచ్చావు" అన్నాడు.

శశి వివరాలన్నీ తెలుసుకున్నాడు ప్రసన్నకుమార్. ఇంతలో వాసంతి ఫలహారాలతో హాల్లోకి వచ్చింది. ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటుండగా శ్రీకాంత్, శ్రీశాంత్‌లు కూడా స్కూల్ నుండి వచ్చారు. పిల్లలతో అందరూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ గడిపారు.

"సార్! మీరూ, పిల్లలు, వాసంతి అంతా కలిసి మా ఇంటికి రండి! మా వారిని పరిచయం చేస్తాను. మా ఇంట్లోనే భోజనం కూడా" ఆహ్వానించింది శశి.

"తప్పకుండా వస్తానమ్మా! ఏదో ఒక సెలవురోజు, మీ వారికి డ్యూటీ లేనప్పుడు వస్తాం" అన్నాడు ప్రసన్నకుమార్.

శశి ఎంతో సంతోషపడింది. ఆ రోజు ఎప్పుడు వస్తుందా? అని ఆలోచిస్తూ, ఇంటికి వచ్చింది.

★ ★ ★

ఒకరోజు నరసింహ ఇంట్లో వున్నాడు. డ్యూటీకి మరుసటి రోజు పొద్దున వెళ్ళాలి.

"ఏమండీ! మన అపార్టుమెంటు ఎదురుగా వున్న ఇంట్లో మా బాటనీ లెక్చరర్ ప్రసన్నకుమార్‌గారి ఫ్యామిలీ వుందండి. వాళ్ళావిడ నాకు బాగా పరిచయమైనారు. ప్రసన్నకుమార్ సార్‌కూ, వాళ్ళ పిల్లలకూ ఈ రోజు సెలవట. మీకూ డ్యూటీ లేదు కదా! మధ్యాహ్నం వాళ్ళను మనింటికి భోజనానికి పిలుద్దామండి! మిమ్మల్ని పరిచయం చేస్తానని కూడా చెప్పాను. కాస్త సరదాగా ఈ రోజు గడుపుదాం. మీరేమంటారు? " భయంభయంగా అడిగింది శశి.

నరసింహ 'మూడ్' క్షణక్షణానికి మారుతూవుంటుంది. పైగా కోపిష్టి. ఏమంటాడో అని అనుమానం మరి!

"అంటే.. ముందరగానే ప్రోగ్రామ్ ఫిక్స్ చేసుకొని నా పర్మిషన్ కోసం అడుగుతున్నావా? " కోపంగా అడిగాడు నరసింహ.

"అలా కాదండీ! నేను వారికి ఎలాంటి మాట చెప్పలేదు. మీరు ఒప్పుకున్న తర్వాతే వాళ్లకు చెబుదామనుకుంటున్నా" అంది శశి.

"సరే! ఏదో ఒకటి కానియ్" విసుగ్గా అనేసి వెళ్ళిపోయాడు.

శశి వెంటనే మొబైల్ తీసుకుంది.

"అక్కా! ఈ రోజు మధ్యాహ్నం మీరందరూ మా ఇంటికి భోజనానికి తప్పకుండా రావాలి. ఒంటిగంటకంతా భోజనాలు సిద్ధం చేస్తాను. కాస్త ముందరగానే వస్తే కబుర్లు చెప్పుకోవచ్చు. సార్‌కు కూడా చెప్పండి" అంటూ వాసంతికి చెప్పింది.

"సరేనమ్మా! తప్పకుండా వస్తాం. అయినా ఈ ఫార్మాలిటీస్ ఎందుకు చెప్పు! చాలా శ్రమ తీసుకుంటున్నావు" అంది వాసంతి.

"లేదక్కా! నా సంతోషం కొద్దీ మిమ్మల్ని పిలుస్తున్నాను. మీకూ మా గురువుగారికి ఈమాత్రం ఆతిథ్యమివ్వలేనా? " అంది శశి సంతోషంగా.

"అబ్బో! పెద్దమాటలే మాట్లాడుతున్నావు. ఇక నేనేం మాట్లాడతాను. పన్నెండు గంటలకు మీ ఇంట్లో వుంటాం" నిర్ధారిస్తూ చెప్పింది వాసంతి.

స్వతహాగా ఇంటి పనిలో దిట్ట కాబట్టి త్వరగా వంట చేయడానికి ఉపక్రమించింది శశి. రకరకాల వంటకాలు, స్వీట్స్ కూడా తయారుచేసింది. అనుకున్న టైం కన్నా ముందరే అన్ని పదార్థాలను సిద్ధం చేసింది.

ఇంతలో కాలింగ్‌బెల్ శబ్దం వినపడింది.

శశి తలుపు తీసింది. "రండి!" అంటూ వాసంతి, ప్రసన్నకుమార్, పిల్లలు శ్రీకాంత్, శ్రీశాంత్‌లను లోపలికి ఆహ్వానించింది.

నరసింహ కూడా బెడ్‌రూం నుండి హాల్లోకి వచ్చాడు. నరసింహకు షేక్ హ్యాండ్ ఇస్తూ "అయామ్ ప్రసన్నకుమార్"




అంటూ తనను తాను పరిచయం చేసుకొంటూ వాసంతిని, శ్రీకాంత్, శ్రీశాంత్‌లను కూడా పరిచయం చేశాడు సార్.

"అయామ్ నరసింహ! రండి, కూర్చోండి" సోఫాను చూపిస్తూ ఆహ్వానించాడు నరసింహ.

శశి వంటింట్లోకి వెళ్ళింది. వాసంతి కూడా శశికి సహాయం చేద్దామని వెళ్ళింది. అమ్మతోబాటు బుడుతలిద్దరూ వంటింట్లోకి దూరారు. ప్రసన్నకుమార్, నరసింహ కబుర్లలో మునిగిపోయారు. కాసేపటికి శశి, వాసంతి వంట పదార్థాలన్నిటినీ డైనింగ్ టేబుల్ మీద అమర్చారు. మొదట పిల్లలకు అన్నం పెట్టి ఆ తర్వాత అందరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేయడానికుపక్రమించారు. శశి చేసిన వంటకాలన్నీ బాగా వున్నాయి. దాంతో ఉండబట్టలేక మనసులోని మాటను బయటపెడుతూ "పదార్థాలన్నీ చాలా రుచికరంగా వున్నాయి. ఏ వన్!" అంటూ శశిని పొగిడేశాడు ప్రసన్నకుమార్.

శశి సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బు అయింది! భర్త లేదా ఇంటికి వచ్చిన అతిథులు తాను చేసిన వంట బాగుందంటే ఆ ఇల్లాలు పొందే ఆనందం అంతా ఇంతా కాదు! పైగా ఆ మాట అన్నది ఎవరో కాదు. అక్షరాలా మూడు సంవత్సరాలు తనకు పాఠాలు చెప్పిన, తనకెంతో ఇష్టమైన గురువుగారు! తన చీకటి జీవితంలో మెరిసిన మెరుపులాంటి మాట అది! అందుకే శశి మొఖం వెయ్యి వోల్టుల బల్బులాగా వెలిగిపోయింది.

భోజనాలన్నీ ముగించాక, కాసేపు భుక్తాయాసం తీరిన తర్వాత "ఇక మేము వస్తామండి. చాలా థ్యాంక్స్" అంటూ లేచారు ప్రసన్నకుమార్ దంపతులు.

వాసంతి కూడా "ఒకరోజు మీరిద్దరూ మా ఇంటికి భోజనానికి రావాలి" అని హృదయపూర్వకంగా శశి దంపతుల్ని ఆహ్వానించింది.

"అలాగేనమ్మా! తప్పకుండా వస్తాం" అన్నాడు నరసింహ.

ఇంటికి వచ్చాక నరసింహ గురించి ప్రసన్నకుమార్ ఏమనుకున్నాడో ఆరా తీద్దామనుకొని "ఏమండీ! మీతో నరసింహ సరదాగానే మాట్లాడాడా? " అని అడిగింది వాసంతి.

"నువు కూడా అక్కడనే వున్నావు గదా? ఎందుకలా అడుగుతున్నావు? " కుతూహలంగా అడిగాడు ప్రసన్న.

"నేనూ శశీ వంటింట్లో వున్నప్పుడు మీతో ఎలా మాట్లాడాడు? " ఇంకొంచెం ఆరా తీయడానికి ప్రయత్నించింది.

> **కొత్తగాలి...**
>
> **భారతీయ సాహిత్యం**
> **పై జారి, 'జ్ఞాన పీఠం'పై**
> **కూర్చోడానికి 'పాకుడురాళ్లు'కి**
> **పట్టినకాలం నలభైఎనిమిదేళ్లు!**
>
> – పెన్మెత్స సూరిబాబు,
> హైదరాబాద్

"బాగానే మాట్లాడాడు. కాకపోతే పొడి పొడి మాటలు. అంత కలుపుగోలుగా ఏమీ మాట్లాడలేదు. కాస్త సీరియస్‌గా వుండే వ్యక్తి" అని తాను అతని గురించి మొదటిసారి గ్రహించిన విషయాన్ని చెప్పాడు ప్రసన్నకుమార్. అప్పుడు శశి సంసారం గురించి, అత్తారింటిలో ఆమె పడ్డ కష్టాల గురించి వాసంతి తన భర్తకు చెప్పింది. మామూలుగా శశి తన సంసారం గురించి ఎవ్వరికీ చెప్పదు. తన తల్లిదండ్రులకు కూడా చెప్పని రోజులున్నాయి. ఎందుకో వాసంతిని చూడగానే

ఒక రకమైన ఆప్యాయత పెల్లుబికి రాగా తన విషయాలు ఆమెతో చెప్పుకుంది.

"అయ్యో! నా స్టూడెంట్ ఇన్ని కష్టాలు అనుభవించిందా?" అంటూ గురువాత్సల్యాన్ని వెలిబుచ్చాడు ప్రసన్నకుమార్.

★ ★ ★

సరిగ్గా ఇది జరిగిన కొన్నిరోజులకు ఉదయం పది గంటలకు శశి ఇంట్లో ఘర్షణ మొదలయింది.

నరసింహ శశిని విపరీతంగా తిడ్తున్నాడు. కారణం ఆ రోజు తాను ఇష్టపడిన 'గుత్తి వంకాయ' కూర వండలేదని! ఇది చిన్న విషయమే అయినా రెండు మూడు రోజులుగా తన మనసులో రగులుతున్న కోపం గుత్తి వంకాయకూర ద్వారా బయటికి వచ్చింది. హైదరాబాదులో జరగబోయే నాలుగు రోజుల కాన్ఫరెన్స్‌కు కొంతమంది సిగ్నలింగ్ టెక్నికల్ స్టాఫ్‌కు ఆహ్వానాలందాయి. ఆఫీస్‌లో తన సహోద్యోగులు మాట్లాడుకుంటుండగా విన్నాడు. కొంతమందికి వచ్చిన ఆహ్వాన పత్రాలలో తన పేరు కూడా వుందని గ్రహించాడు. అందరికీ అది ఆర్డినరీ పోస్టులో వచ్చింది. తన ఇంటి అడ్రస్‌కు రాలేదని మండిపడుతున్నాడు.

మరుసటిరోజు జరగబోయే కాన్ఫరెన్స్‌కు ఆ రోజు బయలుదేరి పోవాలి. ఇల్లంతా వెదికితే ఆ ఉత్తరం షోకేస్ ఎడమవైపు వున్న అరలో కనబడింది. అంతే! కోపం కట్టలు తెంచుకొని వచ్చింది.

"ఈ ఉత్తరం వచ్చి ఎన్ని రోజులయింది? నాకెందుకు చెప్పలేదు. పైగా డిగ్రీ చదివానన్నావు? ఏం ప్రయోజనం? చదువురాని గొర్రెలాగా ఇంట్లో పడి వున్నావు. ఎందుకు నీ బతుకు!" అంటూ చిందులేసాడు.

ఉత్తరం సంగతి తనకు చెప్పలేదని, హడావుడిగా సూట్‌కేస్ సర్దుకోవలసి వచ్చిందని, ఇష్టమైన గుత్తి వంకాయకూర వండలేదని అరుస్తూ, అగ్గిమీద గుగ్గిలమై శశిని ఇంట్లోంచి బయటికి నెట్టేసి, లోపల గడియ పెట్టుకొన్నాడు. వండిన తిండి కాస్త తిని, బయటికి వచ్చి ఇంటికి తాళం పెట్టి, ఆ తాళంచెవిని జేబులో వేసుకొని సూట్‌కేస్‌తో గబగబా రైలు అందుకోవాలని పరుగుతీశాడు. పాపం! శశి చేసిన తప్పల్లా ఉత్తరం గురించి నరసింహకు చెప్పకుండా మరచిపోవడం! ఆరోజు ఇంట్లో వంకాయలు లేనందువల్ల కూర వండకపోవడం!

నరసింహ ప్రవర్తనకు హడలిపోయింది శశి! ఇలా ఎప్పుడూ తనను ఇంట్లోంచి బయటికి గెంటేయలేదు! పైగా తాళం వేసి తాళం చెవి జేబులో పెట్టుకొని వెళ్లిపోయాడు! తను ఇంట్లోకి ఎలా వెళ్ళాలి? అదృష్టవశాత్తు అపార్టుమెంటు వసారాలో ఎవరూ లేరు. ఎవరైనా చూసి వుంటే తన సంసారం వీధిన పడి వుండేది కదా! ఇంత కోపమా మనిషికి! అనుకుంది.

నరసింహ బయటికి నెట్టేసినప్పుడు గుమ్మం దగ్గర వుంటే గొడవ అందరికీ తెలుస్తుందని లిఫ్టులో కిందికి వచ్చింది. నరసింహ ఎప్పుడు బయటికి వెళ్ళాడో తాను గమనించలేదు. దిక్కుతోచక ఏడుస్తూ ఎదురింటికి వెళ్ళింది. వాసంతి

**కొత్తగాలి...** 

**ఏ నేత చరిత్ర చూసినా**
**ఏమున్నది గర్వకారణం?**
**రాజకీయ రంగం మొత్తం**
**అవినీతికి దాసోహం!**

– పి. లక్ష్మీప్రసన్న

తలుపు తీసింది. ఏడుస్తూ తన గొడవ చెప్పుకుంది. వాసంతి కూడ చాలా ఆశ్చర్య పడింది. 'ఇంతటి కఠినాత్ములు కూడా వుంటారా!' అనుకుంది.

"అక్కా! మీరు డబ్బు సర్దుబాటు చేస్తే నేను చిత్తూరుకు వెళ్తాను. ఇలా అడుగుతు న్నందుకు నన్ను అపార్థం చేసుకోవద్దండి! మీ డబ్బు వెంటనే తిరిగి ఇచ్చేస్తాను" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకొని దీనంగా అడి గింది.

వాసంతి మనసు కరిగిపోయింది. డబ్బు సర్దుబాటు చేయడం గొప్ప సంగతి కాదు. నరసింహ ఎప్పుడు వస్తాడో తెలి యదు. అంతకాలం శశిని తన ఇంట్లోనే పెట్టుకోవచ్చు. కాని దానివల్ల సమస్య ఇంకా జటిలమౌతుంది. శశిని ఒంటరిగా అంత దూరం పంపించడమూ శ్రేయ స్కరం కాదు. ఇలా ఆలోచిస్తూ...

"నీవేం భయపడకు. నీకు అండగా మేమున్నాం. నువు ఒంటరిగా చిత్తూరుకు పోవడం కూడా బాగుండదు" అని శశికి చెప్పి వెంటనే మొబైల్ అందుకుంది.

"ఏమండీ! శశికి ఒక సమస్య వచ్చింది. మీరు రెండు రోజులు సెలవు పెట్టి రావాలి. సాయంత్రం కాస్త త్వరగా ఇంటికి రండి" అని భర్తకు చెప్పింది.

"అదేం అక్కా! సార్‌ను సెలవుపెట్టి రమ్మన్నారు? " కుతూహలంగా అడిగింది శశి.

"అవును! మీ సార్, నేను కలిసి నిన్ను చిత్తూరులో వదిలిపెడ్తాం" అని శశి మొఖంలోకి సూటిగా చూస్తూ అంది.

అంతే! అంతవరకు కన్నీళ్ళతో ముడుచు కుపోయిన శశిమొఖం ఒక్కసారిగా విప్పా రింది.

"చాలా థాంక్స్ అక్కా! మీరు నా కోసం చాలా శ్రమ పడ్తున్నారు. మీరంతా వస్తే మా అమ్మానాన్నలు చాలా సంతోషప డ్తారు!" ఆనందం పట్టలేక అంది శశి.

"నిజానికి సార్ ఎంత బిజీగా ఉన్నారో నాకు తెలియదు. అయినా మనం ఇప్పుడు బాగా ఫ్రెండ్స్ అయ్యాం కాబట్టి రాకపో కలు తప్పవులే!" అంది వాసంతి.

కాలేజీకి రెండు రోజులు సెలవు పెట్టి, సాయంత్రం తన రోజూవారీ పనులను పక్కన పెట్టి డ్యూటీ అయిపోయిన వెంటనే ఇంటికి వచ్చాడు ప్రసన్నకుమార్.

వాసంతి శశి పరిస్థితిని వివరంగా చెప్పింది. ప్రసన్నకుమార్ కూడా దిగ్భ్రాంతి చెందాడు.

"చాలా మంచి పనిచేశావు. ఈ రాత్రి శశి మన ఇంట్లోనే ఉంటుంది. రేపు తెల్ల వారుజామునే చిత్తూరుకు బస్సులో బయ లుదేరి వెళదాం. పిల్లలు కూడా స్కూలుకు 'డుమ్మా' అంటే ఎగిరి గంతేస్తారు" అన్నాడు ప్రసన్నకుమార్.

వెంటనే మొబైల్ అందుకున్నాడు. శశి నాన్న పేరు, నంబర్ అడిగి, డయల్ చేశాడు.

"హలో! ఎవరండీ!" అటు వైపు నుండి భుజంగరావు గొంతు.

"హలో! నమస్కారమండి భుజంగరావు గారు. నా పేరు ప్రసన్నకుమార్. రేపు తె ల్లవారుజామున నేను, నా భార్య, ఇద్దరు పిల్లలు, శశి బస్సులో బయలుదేరి చిత్తూ రుకు వస్తున్నాం. వివరాలు అక్కడికి వచ్చిన తర్వాత చెప్తాం"

"నమస్కారమండి ప్రసన్నకుమార్‌గారు. సంతోషం, మీరే మా వూరికి వస్తున్నామం టున్నారు. మీ గురించి మా శశి చెప్తూ వుంటుంది. మరి నరసింహ మీతో రావడం లేదా? " కుతూహలంగా అడిగాడు భుజంగరావు.

"లేదండీ! ఆయనకు హైదరాబాద్‌లో కాన్ఫరెన్స్ ఉందంట" అన్నాడు ప్రసన్నకు మార్.

"సరే! ఒకసారి శశికి మొబైల్ ఇస్తారా? " అడిగాడు భుజంగరావు.

ప్రసన్నకుమార్ మొబైల్‌ను శశికిచ్చాడు.

"హలో నాన్నా!" అంది శశి.

"ఏమ్మా శశీ! నీ మొబైల్‌కు ఫోన్ చేస్తూనే వున్నాను. రింగవుతూనే వుంది గాని రెస్పాన్స్ రావటం లేదు. ఏమిటి? ఎందుకని రిసీవ్ చేసుకోలేదు? " విషయం తెలియని భుజంగరావు ఆత్రుతగా అడిగాడు.

"లేదు నాన్నా.. బజారుకు వెళ్లినప్పుడు సెల్‌ఫోన్ వ్యానిటీ బ్యాగ్‌లోంచి ఎక్కడో పడి పోయింది" అబద్ధం చెప్పింది శశి.

"సరేనమ్మా! మీ మాష్టారు, మీరంతా కలిసి వస్తున్నారంట! చాలా సంతోషం. రాత్రికి బస్సులో బయలుదేరితే రేపు ఉదయానికల్లా ఇక్కడ వుంటారు. మీకోసం ఎదురుచూస్తూ వుంటాం" అని చెప్పి ఫోన్ పెట్టేశాడు భుజంగరావు.

★ ★ ★

మరుసటిరోజు నరసింహ ఉదయం పదిగంటలకల్లా హైదరాబాదులో కాన్ఫరెన్స్‌కు హాజరయ్యాడు. ఎంతోమంది సహోద్యోగులు వారి వారి స్థానాల్లో కూర్చొని వున్నారు. వేదిక మీద సీనియర్ ఆఫీసర్లు ఉపన్యాసాలు ఇస్తున్నారు. నరసింహ శారీరకంగా హాల్లో కూర్చొని వున్నాడేగాని మనసంతా ఆలోచనల్లో మునిగిపోయింది. క్షణికావేశంలో తాను చేసిన తప్పుకు బాధపడిపోతున్నాడు. ఇప్పుడు శశి ఎక్కడికి వెళ్ళుంటుంది? తాళం చెవి తన జేబులోనే వేసుకొని వచ్చానే! డూప్లికేట్ తాళం చెవి ఇంట్లోనే వుంది. శశిని ఎక్కడున్నావని కనుక్కుందామంటే ఆమె మొబైల్ కూడా ఇంట్లోనే వుండి వుంటుంది. రెస్పాన్స్ రాదు. నేనేమో కడుపారా తిని వచ్చాను. కాని శశి తినిందా లేదా అనే ఆలోచన కూడా రాలేదు. ఎంత మూర్ఖంగా ప్రవర్తించాను! ఒకవేళ ఎదురింటి ప్రసన్నకుమార్ ఇంటికి వెళ్ళిందో ఏమో! వాళ్ళు తప్ప అపార్టుమెంటులో ఇంకా ఎవరూ పరిచయం కాలేదు. ప్రసన్నకుమార్‌కు ఫోన్ చేద్దామంటే ఆయన నంబర్ తనకు తెలియదాయె! పెళ్ళైన తర్వాత మొదటిసారిగా నరసింహ వెన్నులో వణుకుపుట్టింది! లంచ్ విరామంలో భుజంగరావుకు ఫోన్ చేశాడు.

"మామయ్యా! శశి ఫోనేమన్నా చేసిందా? చిత్తూరుకేమన్నా వచ్చిందా? " ఆత్రుతగా అడిగాడు నరసింహ.

నరసింహ ఎంతటి శాడిస్టు, కఠినాత్ముడు అయినప్పటికీ మొదటిసారిగా భయమంటే ఏమిటో అనుభవమయింది.

"ఔను అల్లుడుగారు! ప్రసన్నకుమార్ గారు ఫోన్ చేశారు. ప్రసన్నకుమార్, ఆయన భార్య, శశి అందరూ కలిసి ఇంక కాసేపట్లో మా ఇంటికి వస్తున్నారు!" అని చెప్పాడు భుజంగరావు.

ఇప్పుడు మనసు కుదుటపడింది నరసింహకు. ప్రసన్నకుమార్‌కు ఎలా థ్యాంక్స్ చెప్పాలో ఊహించుకోలేకపోయాడు.

"సరే మామయ్యా! రెండు రోజుల్లో కాన్ఫరెన్స్ అయిపోవడంతోటే అనంతపురానికి వస్తాను. మీరు శశిని తీసుకొని వద్దురుగాని" అని ఫోన్ పెట్టేశాడు.

ప్రసన్నకుమార్, వాసంతి, శ్రీకాంత్, శ్రీశాంత్, శశి అందరూ చిత్తూరు చేరుకున్నారు.

"రండి మాస్టారు లోపలికి" అంటూ ఆహ్వానించింది శశి.

భుజంగరావు, రోహిణి, నాగమల్లిక హాల్లోకి వచ్చారు.

"అయామ్ ప్రసన్నకుమార్" అంటూ షేక్‌హ్యాండ్ ఇచ్చాడు భుజంగరావుకు. అట్లాగే భార్యను, పిల్లలను కూడా పరిచయం చేశాడు.





"చాలా సంతోషం! మీ గురించి శశి మాకు చెప్తూనే వుంటుంది. మీకు ప్రియమైన శిష్యురాలు ఔనో కాదో తెలీదు కాని మీరు మాత్రం శశికి ప్రియమైన గురువుగారు!" భుజంగరావు సంతోషంతో అన్నాడో పశ్చాత్తాపంతో అన్నాడో పసిగట్టడం కష్టం!

ప్రయాణ బడలిక తీరాక, కాసేపు విశ్రాంతి తీసుకున్నాక మధ్యాహ్నం భోజనానికి కూర్చున్నారు అందరూ. భోజనం చేస్తూ ప్రసన్నకుమార్, వాసంతి విషయం ఎలా మొదలుపెట్టాలో ఆలోచిస్తూ వున్నారు. శశి మౌనంగా అన్నం తింటూ వుంది. తన మాష్టారు, ఆయన భార్య, పిల్లలను ఇంటికి పిలుచుకొని వచ్చిన శశి ఎంతో సంతోషంగా వుండవలసిన మనిషి, ఎప్పుడూ లేని విధంగా ఇలా గంభీరంగా వుండడం రోహిణి, నాగమల్లికకు కూడ అర్థం కాలేదు. భోజనాలయ్యాయి.

శశికి జరిగిన విషయాన్ని ప్రసన్నకుమార్, వాసంతి భుజంగరావు, రోహిణికి చెప్పారు. వాళ్ళ కళ్ళలో నీళ్లు తిరిగాయి. నాగమల్లిక కూడ దుఃఖం ఆపుకోలేకపోయింది. శశి ఏడుస్తూనే వుంది.

"మీ మేలు మరవలేమండి! మా శశిని ఆదుకున్నారు. పాపం! దాని సంసారం ఎప్పుడు కుదుటపడుతుందో ఏమో" అంటూ భోరున ఏడ్చేశాడు భుజంగరావు.

"మీరేం అధైర్యపడకండి! మేమున్నాం శశికి అండగా! నరసింహ అనంతపురానికి వచ్చాక మీరు శశిని తీసుకొనిరండి. మీరు, మేము నరసింహతో మాట్లాడుదాం!" అని ధైర్యం చెప్పాడు ప్రసన్నకుమార్. ఇలా చెప్పగానే అందరి మనసులు కాస్త కుదుటబడ్డాయి. అందరూ సరదాగా గడపడం మొదలుపెట్టారు. క్యారంబోర్డు, చెస్, ఇలా ఇండోర్ గేమ్స్ ఆడసాగారు. వాసంతి పిల్లలు శశి, నాగమల్లిక, రోహిణిలతో బాగా కలిసిపోయారు. భుజంగరావు, రోహిణిలు కూడా వాసంతి, ప్రసన్నకుమార్లతో బాగా పరిచయమున్న వ్యక్తుల లాగా ఎంతో ఆప్యాయతతో మాట్లాడసాగారు. కోటేశ్వరరావు, నాగలక్ష్మి కూడా భుజంగరావు ఇంటికొచ్చి వాళ్ళతో గడిపారు. తన సంసారంలో ఎన్ని ఒడిదుడుకులున్నా, అవన్నీ మరచిపోయి తన మనసులో ఎంతగానో ఆరాధించుకున్న వ్యక్తే స్వయంగా తన ఇంటికి వచ్చి సరదాగా గడిపేస్తోంటే శశి ఆనందానికి అవధుల్లేకుండా పోయింది. ఉండబట్టలేక ప్రాణ స్నేహితురాలు చంద్రికకు ఫోన్ చేసింది.

"చంద్రికా! నీకొక ఆశ్చర్యకరమైన వార్త చెప్పేదా? " అంది శశి.

## కొత్తగాలి...

**మంచు కరిగితే**
**నీరు**
**మనసు కరిగితే**
**కన్నీరు!**

– తాజీ ప్రసాద్,
చెన్నై

"ఏమిటది? చెప్పు" ఆత్రుతగా అడిగింది చంద్రిక.

"ప్రసన్నకుమార్ సార్, వాళ్ళ భార్య, పిల్లలు చిత్తూరులో మా ఇంటికి వచ్చారు. ఇప్పుడు ఇక్కడే వున్నారు" అని అదేదో ప్రధానమంత్రి తన ఇంటికి వచ్చినట్లు చాలా గొప్పగా చెప్పింది శశి.

"వెరీ హ్యాపీ! వివరాలన్నీ తీరిగ్గా మళ్ళీ చెబుదువులే. మేమంతా ఇప్పుడు ప్రాజెక్ట్ వర్క్‌తో బిజీగా వున్నాం. వైదేహి, విజయలు కూడా ఇక్కడే పక్కనే వున్నారు. ఇలాంటి మంచివార్త పూర్వాపరాలు

మాకూ వినాలని వుంది. తర్వాత సావకాశంగా వింటాం. ఏమీ అనుకోకు!" అని చెప్పింది చంద్రిక.

"సరే! మీరేదో బిజీగా వున్నట్టుంది. తర్వాత చెప్తాలే!" అని ఫోన్ కట్ చేసింది. ఇన్ని జరిగినా ఒక చిదంబర రహస్యం మాత్రం అలాగే ఉండిపోయింది. చదువుకునే రోజుల్లో శశి, తనను ప్రేమించినట్లు ప్రసన్నకుమార్‌కు తెలియకపోవడం!

భుజంగరావు ఇంట్లో ఆరోజు సరదాగా గడిపారు. మరుసటిరోజు ప్రసన్నకుమార్, వాసంతి అనంతపురానికి బయలుదేరారు.

"ఇక మేం వస్తామండీ! మీ ఇంట్లో చాలా సరదాగా గడిపాం. మీ ఆతిథ్యం, ఆప్యాయత మమ్మల్నెంతో ఆకట్టుకుంది. ఇదే సాన్నిహిత్యం మనం ఎప్పుడూ కొనసాగిస్తే బాగుంటుంది. అనంతపురానికి వచ్చాక మా ఇంటికి తప్పకుండా రండి!" ఆహ్వానించాడు భుజంగరావును ప్రసన్నకుమార్.

వాళ్ళకు బస్‌స్టాండ్‌లో వీడ్కోలు చెప్పాక ఇంటికి వస్తూ ఆలోచనల్లో పడ్డాడు భుజంగరావు. ఎంతటి సంస్కారవంతులు! ఎంతటి ముచ్చటైన జంట! వాళ్ళే గనుక లేకపోతే తన కూతురి గతేమయ్యేది? చదువుకొనే రోజుల్లో ఇటువంటి మనిషిని కోరుకోవడంలో శశి తప్పేంలేదని ఇప్పుడనిపించింది భుజంగరావుకు!

★ ★ ★

కాన్ఫరెన్స్ ముగించుకొని నరసింహ అనంతపురానికి వచ్చాడు. వెంటనే మొబైల్ తీసుకొని భుజంగరావుకు ఫోన్ చేశాడు. "మామయ్యా! నేను అనంతపురానికి వచ్చాను. శశిని తీసుకుని రండి!" అన్నాడు.

నరసింహ ప్రవర్తనకు భుజంగరావుకు విపరీతమైన కోపం వచ్చింది. 'ఏ సంస్కారవంతుడైన భర్త కూడా అటువంటి పని చేయడు. ఇతను ఎంతటి క్రూరుడు' అనుకున్నాడు మనసులో.

"అట్లాగే! రేపు వస్తున్నాం" అంటూ సీరియస్‌గా మాట్లాడి ఫోన్ కట్ చేశాడు భుజంగరావు.

మరుసటిరోజు శశిని తీసుకొని భుజంగరావు అనంతపురానికి వచ్చాడు. నరసింహ మొహం చూడడానికి కూడా అతనికి ఇష్టం లేకుండాపోయింది. నేరుగా బెడ్ రూంలోకి వెళ్ళి పడుకున్నాడు. శశి కూడా మౌనంగా వంటింట్లోకి దూరి పనికుపక్రమించింది.

నరసింహ కూడా 'గిల్టీ ఫీలింగ్'తో ఏమీ మాట్లాడలేకపోయాడు. సాయంత్రం వాసంతి, ప్రసన్నకుమార్ సార్ తమ ఇంటికి వస్తే బాగుంటుందనిపించింది శశికి. పైగా మాస్టారు కూడా నరసింహతో మాట్లాడుతానన్నాడు కాబట్టి ఆయన వచ్చాకనే తాను కూడా భర్తతో మాట్లాడాలనుకుంది శశి.

మొబైల్ ఫోన్‌లో "అక్కా! మేము ఈరోజు వచ్చాం. మీరు, మాస్టారు కూడా సాయంత్రం వస్తే బావుంటుంది. మా ఆయన కూడా ఇంట్లోనే వుంటారు" అంది.

"సరేనమ్మా! సార్ కాలేజి నుండి వచ్చిన వెంటనే మీ ఇంటికి వస్తాం. మీ ఆయనతో మాట్లాడుతాం. నీవేమీ అధైర్యపడకు" అంటూ ధైర్యం చెప్పింది.

సాయంత్రం ఆరున్నరకు ప్రసన్నకుమార్ ఇంటికి వచ్చాడు.

"ఏమండీ! శశి, వాళ్ళ నాన్నగారూ ఈరోజు పొద్దున వచ్చారట. ఈ సాయంత్రం మనల్ని రమ్మనింది శశి" అంది వాసంతి.

"సరే! కాసేపయ్యాక వెళదాం. రెడీ అవ్వు మరి" అన్నాడు ప్రసన్నకుమార్. దాదాపు ఒక గంట తర్వాత శశి ఇంటికి బయల్దేరారు.

హాలులో భుజంగరావు సోఫాలో





కూర్చొని పేపరు చదువుతున్నారు. శశి ఏదో పని చేసుకొంటోంది. నరసింహ బెడ్ రూంలో వున్నాడు.

"నమస్కారం భుజంగరావు గారు" అంటూ అభివాదం చేశాడు ప్రసన్నకుమార్.

"నమస్కారమండీ. రండి.. కూర్చోండి" అంటూ ఆహ్వానించాడు.

ఈ లోపల బెడ్‌రూం నుండి నరసింహ కూడా హాల్లోకి వచ్చాడు.

"గుడ్ ఈవెనింగ్ నరసింహగారూ" అంటూ కరచాలనం చేశాడు ప్రసన్నకుమార్.

## కొత్తగాలి...

**తల్లుల దినం తండ్రుల దినం**
**మహిళాదినం టీచర్ల దినం**
**వీళ్లందరికీ సుదినాలెప్పుడో?**

– ఏకా లలితాపరమేశ్వరి,
మిర్యాలగూడ

శశి కూడా వంటింట్లోంచి హాలులోకి వచ్చింది.

"నమస్తే సార్! నమస్తే అక్కయ్యా! హాయ్ శ్రీశ్రీ" అంటూ పిల్లలిద్దరినీ మొదటి అక్షరంతో సరదాగా పలకరించింది శశి.

భుజంగరావు గంభీరంగా పేపరు చదువుతూనే వున్నాడు.

నరసింహ మౌనంగా సోఫాలో కూర్చున్నాడు.

అందరూ కూడా మౌనంగా వుండిపోయారు. వాతావరణమంతా నిశ్శబ్దంగా, గంభీరంగా వుంది. ఎవరి కోపతాపాలు వారివి! ఎవరి ప్రవర్తనలు వారివి! సంసారమన్నాక ఒడిదుడుకులుంటాయి గాని అవి మితిమీరిపోకూడదు.

నిశ్శబ్దాన్ని చీల్చుతూ ప్రసన్నకుమార్ ఇలా అన్నాడు "చూడండి నరసింహ గారూ! మీకు చెప్పేంత పెద్దవాణ్ణికాదు. అయినా ఈ విషయం మీతో ప్రస్తావించక తప్పదు. ఎందుకంటే ఈ మధ్యనే మన స్నేహం బాగా పెరిగిపోయింది. ఆ చొరవతోనే మీతో మాట్లాడాలనుకున్నాం. మీరేమీ అనుకోరనుకుంటాను"

ఏం చెప్తాడో నరసింహకర్థమయ్యింది. "సరే చెప్పండి! నేనేమనుకోను" అన్నాడు

"శశిని ఆ విధంగా వదిలి వెళ్ళిపోవడం ఏమీ సమంజసం కాదు. మీరు వెళ్ళింత ర్వాత ఇంట్లోకి పోదామంటే తన దగ్గర తాళంచెవి లేకపోయే! ఆ సమయంలో ఆమె దీనస్థితిని, మానసిక ఆందోళనను, ఆమె అనుభవించిన బాధను మనం ఊహించుకోలేం! అదృష్టవశాత్తు ఎదురుగా మేమున్నాం కాబట్టి సరిపోయింది! ఇంట్లో ఏవో చిన్న చిన్న గొడవలు వస్తుంటాయి. గోరంతలు కొండంతలు చేసుకోకూడదు కదా! అలా అమ్మాయిని వదిలివెళ్ళాక మీరుకూడ కలతచెంది వుంటారని అనుకుంటాను. శశి నా స్టూడెంట్. మూడేండ్లు ఆమెకు పాఠం చెప్పాను. ఆమె ఎంతటి క్రమశిక్షణ కలిగిన మనిషో నాకు తెలుసు. ఏదో తెలిసో తెలియకో చేసిన పొరబాట్లను మనం భూతద్దంలో చూసి హింసించడం ఏమంత సమంజసం కాదు! భర్తగా మీరు పెద్ద పొరపాటే చేశారు. కాని ఒకరినొకరు అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తే ఇటువంటివి జరగవు కదా! ఒకవేళ ఇంట్లో శశి ఏదైనా తప్పుచేస్తే సైలెంట్‌గా మా ఇంటికి వచ్చేయండి! కాసేపు మా ఇంట్లో వున్న తర్వాత కోపం ఎట్లాగూ చల్లారుతుంది. తర్వాత ఇంటికెళ్ళండి. మమ్మల్ని మీ ఆప్తులనుకోండి! అంతే తప్ప

శశిని ఇక మీరెప్పుడూ అలా ఒంటరిదాన్ని చేసి వెళ్ళకండి. పాపం! అటు చూడండి. భుజంగరావుగారి వయసు మీరుతోంది. పైగా ఆరోగ్యం కూడా సరిగా వుండటం లేదు. అంత పెద్దాయన తన కూతురికి ఇలా అయిందంటే తట్టుకోగలడా? మీ ప్రవర్తన వల్ల ఎంతమంది బాధపడ్డారో మీకు తెలుసా? ఇతరులను బాధ పెట్టే కంటే ఒక చిరునవ్వు, ఒక మంచిమాట వల్ల పనులు సర్దుకుంటాయని చెప్తారు కదా! నేనేమి మీకు హితబోధ చేయడానికి రాలేదు. మీ కుటుంబంలోగాని, మా కుటుంబంలోగాని ముమ్ముందు ఏవన్నా సమస్యలు వస్తే సామరస్యంగా మనమే పరిష్కరించుకొందామనే ఉద్దేశ్యంతోనే కాస్త చొరవ తీసుకొని మాట్లాడుతున్నాను. నన్ను అపార్థం చేసుకోరనుకుంటాను. మీరేమంటారు? "

ఇలా ప్రసన్నకుమార్ చెబుతూవుంటే భుజంగరావు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

"నిజమే ప్రసన్నకుమార్‌గారు! నేను చేసింది పొరపాటే. కాదనను. క్షణికావేశంలో నేనేమి చేస్తున్నానో నాకే తెలియకుండా పోతోంది. చిన్నప్పటి నుండి నాకు కోపం ఎక్కువే. మా ఇంటి వాతావరణం కూడా అట్లాగే ఉండేది! నాన్నకు విపరీతమైన కోపం... అమ్మా అట్లాంటి మనిషే. చెల్లి, నేనూ కీచులాటల మధ్య పెరిగాం. నాన్న ఎప్పుడూ ఇంట్లో అందర్నీ డామినేట్ చేసేవాడు. ప్రతి చిన్న విషయానికి, ప్రతి ఒక్కరితో కీచులాడేవాడు! చివరకు ఆటోరిక్షాలో వస్తే ఆటోవాడితో కూడా డబ్బుల విషయంలో గొడవపెట్టు కొనేవాడు. పాకాలలో మా వీధిలో అమ్మను చూస్తే అందరూ భయపడేవారు. 'గయ్యాళి' అని పేరు కూడా తెచ్చుకుంది. ఇక చెల్లి విషయం..మొగుడితో ఎప్పుడూ గొడవపడి ఇంటి పట్టునే ఉండి పోయేది. నాన్న దాని సంసారం బాగు చేయకుండా విడాకులకు ప్రోత్సహిస్తున్నాడు.

ఇటువంటి వాతావరణానికి విసుగొచ్చి కాస్త దూరంగానే వుండాలనుకునేవాణ్ణి. నేను మితభాషిని! నాపనేదో నేను చేసుకుంటూ వుంటాను. నేనో రకంగా 'ఇంట్రావర్ట్'. నాన్న డామినేటింగ్ నేచర్‌వల్ల నాకు ఈ లక్షణం అలవడిందో ఏమో! నాకు స్నేహితులు కూడా ఎక్కువగా లేరు. పెళ్లయిన తర్వాత నేను శశితో సంతోషంగా గడపలేకపోయాను. సరదాగా మాట్లాడలేకపోయాను. అయితే మొన్న శశిని ఆ విధంగా వదిలి వెళ్ళాక చాలా బాధపడ్డాను. కాన్ఫరెన్స్‌కు హాజరయ్యానేగాని ఆరోజు నేను చాలా ఆందోళన పడ్డాను. వేదిక మీద వక్తలు చెప్పే ఉపన్యాసాలు ఒక్కటి కూడా నాతలకెక్కలేదు. శశి ఏమయ్యుంటుందనే ఆలోచన తప్ప వేరే ఏమీ లేదు నా మనసులో! ఆ రోజు మధ్యాహ్నం లంచ్ అవర్‌లో మామయ్యకు ఫోన్‌చేస్తే మీరంతా కలిసి చిత్తూరు వెళ్తున్నారని తెలిసి కాస్త కుదుటబడ్డాను. నా ప్రవర్తనకు నేనే తిట్టుకున్నాను. ఇలా మీరు ఆప్తమిత్రునిగా ఆదుకున్నందుకు మీకు ఎలా కృతజ్ఞతలు చెప్పాలో తెలియడం లేదు. బహుశా మీ మంచితనం, నా పశ్చాత్తాపం నన్ను ఇన్ని మాటలు మాట్లాడిస్తున్నాయి. పైగా మీలాగా మంచి మాటలు చెప్పే వాతావరణంలో నేను పెరగలేదు. కాబట్టి నేనిలా కఠినాత్మునిగా మారానేమో!" అని పశ్చాత్తాప పడుతూ అన్నాడు నరసింహ మనస్ఫూర్తిగా.

ఎప్పుడూ ఇంత సుదీర్ఘంగా మాట్లాడని నరసింహ ఇన్ని మాటలు మాట్లాడటం విని అందరూ నిశ్చేష్టులయ్యారు. భుజంగరావు కళ్ళెంబడి నీళ్ళొచ్చాయి. అల్లుడుగారు నిజంగానే బాధపడుతున్నాడనుకున్నారా



యన.

"పోనీలే నాయనా! నీ తప్పు నీవు తెలుసుకున్నావు. మీరిద్దరూ సుఖంగా వుంటే అదేచాలు! వయసు మీద పడుతోంది కాబట్టి ఇక ఎదురుదెబ్బలు తట్టుకోలేను నాయనా!" అంటూ లేచి వచ్చి నరసింహ భుజం తట్టాడాయన.

అయితే "అన్నయ్యగారూ! మీరు శశిని బాగా చూసుకుంటానని మాటిస్తే, మీకిష్టమైన గుత్తివంకాయ కూర మా ఇంట్లో చేసి పెడ్తాను. మీరందరూ మా ఇంటికి ఈ రాత్రికే భోజనానికి రావాలి. ఇంకేం కాదనకూడదు" అంటూ ఆహ్వానించింది వాసంతి.

**కొత్తగాలి...** 

**కామాంధుల వేటలో**
**చిట్టితల్లి!**
**ఓట్లు కురిపించేందుకే**
**బంగారు తల్లి!!**

– వి.వి. రమణకుమార్,
చిలకలూరి పేట

"గుత్తి వంకాయ కూర మీరెలా చేస్తారో నాకు తెలీదుగాని, శశి చేస్తే చాలా రుచికరంగా ఉంటుందండీ" అని మొదటిసారి శశిని పొగిడేశాడు నరసింహ.

ఈ మాటలకు భుజంగరావు తాను గాలిలో తేలినట్లు ఫీలయ్యాడు. నిజంగా నరసింహలో ఇంత పరివర్తన వచ్చిందా అని ఆశ్చర్యపోయాడు. శశి కూడా నరసింహ తన గురించి ఇలా మాట్లాడుతాడనుకోలేదు.

"అయితే మా ఇంట్లో శశిచేత గుత్తి వంకాయకూర చేయిస్తా. మిగిలిన వంటకాలన్నీ వాసంతి చేస్తుంది" అన్నాడు ప్రసన్నకుమార్.

"ఇప్పుడు సమయం ఏడున్నర అయింది. నేనూ శశి రెండు గంటల్లో వంట చేసేస్తాం. ఈ లోపల మీరు ఇక్కడే ఉండి కబుర్లు చెప్పుకుంటారో, మా ఇంటికి వచ్చి చెప్పుకుంటారో మీ ఇష్టం. రా.. శశీ! ఇంటికెళ్ళి వంటపనిలోకి దూరుదాం!" అని శశి చెయ్యి పట్టుకుని తనతో తీసుకుని పోయింది వాసంతి.

భుజంగరావు, నరసింహ, ప్రసన్నకుమార్ కాసేపు అక్కడే కబుర్లు చెప్పుకున్నాక, ప్రసన్నకుమార్ ఇంటికి వెళ్ళారు. చిత్తూరు నుండి నరసింహను మింగేయాలన్నంత కోపంతో వచ్చిన భుజంగరావు ఇప్పుడు పూర్తిగా చల్లబడిపోయాడు.

ఎప్పుడూ నరసింహతో అంత సావకాశంగా మాట్లాడిందీ లేదు. తాను బయలుదేరిన వేళావిశేషమేమో! అనుకున్నాడు. శశి, నరసింహ మధ్య సఖ్యత కుదిరిందని తెలిస్తే రోహిణి, నాగమల్లిక ఎంత సంతోషిస్తారో! అనుకున్నాడు. దీనికంతటికి కారణం ప్రసన్నకుమార్ దంపతులు. వాళ్ళ రుణం ఎలా తీర్చుకోవాలి! ఎలా కృతజ్ఞతలు తెలుపుకోవాలి? ఇప్పుడు తన మనసు చాలా తేలికపడింది. విషయం వెంటనే రోహిణికి తెలియజేయాలి అనుకున్నాడు.

"అయితే అల్లుడుగారూ? రేపు నేను చిత్తూరుకు బయల్దేరతాను" అన్నాడు భుజంగరావు.

"అదేమిటి బాబాయిగారు! నాలుగు రోజులు వాళ్ళిద్దరితో గడిపి వెళ్ళొచ్చుగా! అప్పుడే ఏం తొందర మీకు. అమ్మాయ్ శశి! మీ నాన్న రేపే వెళ్తానంటున్నారు" అని బిగ్గరగా అరుస్తూ శశిని పిలిచాడు ప్రసన్నకుమార్.

శశి వంటింట్లోంచి వచ్చింది.

"అదేమిటి నాన్నా! నాలుగు రోజులు

ఉండండి. మాస్టారు కూడా అదే చెప్తున్నారు కదా!" బతిమిలాడుతూ అడిగింది.

ముద్దుల కూతురు వుండమంటే వుండ లేడా! ఎటొచ్చి రోహిణితో తన సంతోషాన్ని పంచుకోవాలన్న కోరిక వీళ్ళకర్థం కావటం లేదు! ఇటువంటివి ఫోన్లో చెప్పే వ్యవహారాలు కావు మరి! సరే! నాలుగు రోజులు వుండిపోయి తర్వాతనే చెబుదాంలే! అనుకున్నాడు భుజంగరావు.

వంటలు రెడీ అయ్యాయి. భోజనం చేస్తూ నరసింహ "ప్రసన్నకుమార్‌గారూ! నాదో రిక్వెస్ట్. అది కూడ మీరే చేయాలి" అన్నాడు.

"ఏమిటది? " అడిగాడు ప్రసన్నకుమార్.

"ఏమీ లేదు! మా చెల్లి సంసారం కూడా కాస్త చక్కదిద్దొచ్చుగా! దాని సంసారం కూడా అస్తవ్యస్తంగా వుంది. మనమంతా మదనపల్లెకెళ్ళి కాస్త నచ్చజెప్పితే మా మనసులకు సంతృప్తిగా ఉంటుంది. మనం చెబితే అది కూడా వింటుంది. మా అమ్మా నాన్నల వల్లే మా సంసారాలు సవ్యంగా లేకుండా పోయాయి. ఇప్పుడు నాకన్నీ అర్థమయ్యాయి. నాలో పూర్తిగా పరివర్తన వచ్చింది. నా చెల్లిలో కూడా మార్పు వచ్చిందంటే మాకందరికీ బాగుంటుంది" అని చెల్లిమీద తనకున్న వాత్సల్యాన్ని వెళ్ళగక్కాడు.

"తప్పకుండా వెళ్ళి చెబుదాం. రెండు పబ్లిక్ హాలిడేస్ కలిసి వచ్చేట్టుగా అంటే రెండోశనివారం, ఆదివారంతో బాటు సోమ, మంగళవారాల్లో, రెండురోజులు సెలవుపెట్టి మొత్తం నాలుగు రోజులు మదనపల్లె వెళ్ళి వద్దాం. మీరు కూడ సోమ, మంగళవారాల్లో సెలవు పెట్టండి" అని చెప్పాడు ప్రసన్నకుమార్.

"మొదట మనం మదనపల్లెలో మా

బావ ఇంటికెళ్దాం. అక్కడి నుండి రెండు కిలోమీటర్ల దూరంలో వుంది మాఇల్లు. మొదట బావకు నచ్చజెప్పి, మామయ్యా, అత్తయ్యలకు కూడా చెప్పి జ్యోతిని పిలిపిద్దాం. కచ్చితంగా జ్యోతి మా ఇంట్లోనే ఉండుంటుంది" అంటూ ప్రోగ్రాం చెప్పాడు నరసింహ.

★ ★ ★

అనుకున్నట్టుగానే భుజంగరావుతో బాటు అందరూ మదనపల్లెకు బయల్దేరారు. అనంతపురం నుండి బస్సులో మదనపల్లె చేరుకున్నారు. ఉన్నట్టుండి, ఎలాంటి ఇంటిమేషన్ లేకుండా ఇంత మంది తమ ఇంటికి రావడం చూసి ఆశ్చర్యపోయారు వాసుదేవరావు, సరస్వతి.

"ఏంటీ! ఇలా సడెన్‌గా వచ్చారు" ఆశ్చర్యం వ్యక్తం చేస్తూ అడిగాడు నరసింహను.

"మీకు ఆశ్చర్యం కలిగించాలనే ఇలా వచ్చాం. పైగా ముందుగా చెప్తే అమ్మానాన్నలకు కూడా విషయం తెలుస్తుంది. అది జరగకూడదనే ఇలా వచ్చాం. బైది బై ఈయన మా శ్రేయోభిలాషి ప్రసన్నకుమార్‌గారు!" అంటూ అందరినీ పరిచయం చేశాడు నరసింహ. భుజంగరావును పరిచయం చేయవలసిన అవసరం లేదు!

"ఏంటి భుజంగరావుగారూ! మీరు కూడా వీళ్ళతో వచ్చారు! అదెలా? " వాసుదేవరావుకేమీ అర్థం కాలేదు.

"అంతా వివరంగా చెప్తాం. మొదట కాఫీలు ఏమైనా ఉన్నాయా? " అడిగాడు నరసింహ చనువుగా.

నరసింహ తత్వం వాసుదేవరావుకు బాగా తెలుసు. 'ఏమిటి? ఎప్పుడూ ముభావంగా ఉండే మనిషి ఇలా కలుపుగోలుగా మాట్లాడుతున్నాడు? నరసింహ, శశిల మధ్య కూడా చంద్రశేఖర్, జ్యోతిల్లాగే సఖ్యతలేదని తనకు తెలుసు. ఇప్పుడేంటి? అందరూ కలిసి వచ్చారు? అంతా అయోమయంగా ఉంది' అనుకున్నాడు వాసుదేవరావు.

కాఫీ, టిఫిన్లు చేశాక నరసింహ అనంతపురంలో జరిగిన విషయాలన్నీ సవివరంగా వాసుదేవరావు, సరస్వతికి చెప్పాడు.

"అదీ మామయ్యా జరిగింది! ఇప్పుడు మేము జ్యోతి, చంద్రశేఖర్‌లకు చెప్పి వాళ్ళ సంసారం కూడా చక్క బెట్టాలని వచ్చాం" అన్నాడు నరసింహ.

"చాలా సంతోషం నాయనా! చాలా మంచి పని మీదే వచ్చావు. కాని జ్యోతి, మీ అమ్మానాన్నలు ఒప్పుకుంటారా? పైగా మీ నాన్న విడాకుల కోసం ప్రయత్నిస్తున్నాడుగా? మీ నాన్న సంగతి తెలుసుగా? నువు చెప్తే వింటాడా? వాళ్ళ సంసారం బాగుపడ్తుందంటే మాకు సంతోషమేగా? ఎన్ని పంచాయతీలు జరగలేదు? మీ నాన్న ఏమన్నా తల ఒగ్గాడా? మగపిల్లవాడి ఇంటివాళ్ళం మేమే సర్దుకుపోతున్నాం తప్ప మీ నాన్న ఎప్పుడైనా సర్దుకుపోయాడా? నీ ప్రయత్నం ఫలిస్తుందనుకుంటున్నావా? " అంటూ అనుమానం వ్యక్తం చేశాడు వాసుదేవరావు.

"అవునబ్బాయ్! జ్యోతి కూడ అత్తారింటిలో ఎలా ఉండాలో బొత్తిగా తెలియని మనిషి. పాపం! చంద్రశేఖర్‌ను ఎన్ని తిప్పలు పెట్టింది? అబ్బాయి మెతక మనిషి కాబట్టి దాని ఆటలు సాగాయి. ఇంకొకడయ్యుంటే తన్ని తరిమేసేవాడు" తన మనసులోని ఆవేదనను వెళ్లగక్కింది సరస్వతి.

"అవునత్తయ్యా! జ్యోతి చాలా తప్పు చేసింది. నేను ఇప్పుడు అందుకే వచ్చాను. ఏదో ఒకటి చేద్దామని వీళ్లను కూడా పిలుచుకొని వచ్చాను" అన్నాడు నరసింహ.

ఇంతలో చంద్రశేఖర్ కోర్టు నుండి వచ్చాడు. ఇంట్లో ఇంతమంది జనాన్ని





చూసి అతనూ ఆశ్చర్యపోయాడు. నరసింహ మరలా జరిగిన విషయమంతా చంద్రశేఖర్‌కు వివరంగా చెప్పాడు.

"సరే మామయ్యా! నేనిప్పుడే మా ఇంటికి వెళ్ళి జ్యోతిని తీసుకుని వస్తాను. మీరేమంటారు ప్రసన్నకుమార్‌గారు? " అన్నాడు నరసింహ.

"తప్పకుండా వెళ్ళి తీసుకురండి! మొదట ఆమెకు నచ్చజెప్పి ఆ తర్వాత మీ అమ్మానాన్నలతో మాట్లాడుదాం" అన్నాడు ప్రసన్నకుమార్.

నరసింహ తన తండ్రి ఇంటికెళ్ళాడు.

"అదేంట్రా! హఠాత్తుగా ఇలా వచ్చావు? " ఆశ్చర్యపోతూ అంది విశాలాక్షి.

"నాన్న లేరా? " అడిగాడు నరసింహ.

"ఏదో పనుందని బైటికెళ్ళాడు! నువ్వేం పని మీద వచ్చావు? " కుతూహలంగా అడిగింది.

విశాలాక్షి మాటలను ఏమీ పట్టించుకోకుండా "జ్యోతి ఎక్కడ? " కనబడకపోయేసరికి అడిగాడు.

"పెరట్లో ఉంది... జ్యోతీ... జ్యోతీ... ఎవరొచ్చారో చూడు" బిగ్గరగా అరిచింది.

జ్యోతి పెరట్లో నుండి హాల్లోకి వచ్చింది.

"ఏంటన్నయ్యా! ఎప్పుడొచ్చావు? " ఆశ్చర్యంగా అడిగింది.

"ఇప్పుడే వచ్చాన్లే! నువ్వు వెంటనే నాతో బయల్దేరిరా! బావ ఇంటికెళ్దాం" అన్నాడు.

"అదేంట్రా? బావ ఇంటికంటున్నావు. అక్కడ దిగావా ఏంటి? పైగా దాన్ని కూడా తీసుకుని పోతానంటున్నావు.. ఏమయింది నీకు? నాన్న కూడా ఇంట్లో లేడు" అంది విశాలాక్షి.

"అందుకే దాన్ని తీసుకుని పోతున్నాను! వెంటనే బయల్దేరిరా! త్వరగా పోదాం" జ్యోతిని చూస్తూ అన్నాడు.

"నేను రాను" మొండికేస్తూ అంది జ్యోతి.

"రానన్నావంటే చెంప చెళ్ళుమంటుంది.. ముందు నడు" అని కోపంగా అన్నాడు.

నరసింహ ప్రవర్తనకు ఇద్దరూ ఖంగుతిన్నారు. చేసేది లేక జ్యోతి, నరసింహతో బయల్దేరింది.

వాసుదేవరావు ఇంటికి చేరుకోగానే జ్యోతికి భయమేసింది.

"రామ్మా! వచ్చి కూర్చో" పిలిచింది సరస్వతి.

"రా వదినా! బాగున్నావా? " శశికూడా పలకరించింది.

"ఏమ్మా జ్యోతి! బాగున్నావా? " భుజంగరావు కూడా అడిగాడు.

## కొత్తగాలి...

**'ధర'లో**
**'ధరలు' కనిపించట్లా!**
**అవి 'నింగి'లో**
**'తార'ట్లాడుతున్నాయి!**

– వాడపర్తి వెంకటరమణ,
విశాఖపట్నం

అందరూ ఆప్యాయతగా అడిగేసరికి జ్యోతి కాస్త కుదుటపడింది.

నరసింహ, ప్రసన్నకుమార్, వాసంతి అందరూ చేరి జ్యోతి చేస్తున్న తప్పును తెలియజేస్తూ బాగా హితబోధ చేశారు. మధ్య మధ్యలో వాసుదేవరావు, సరస్వతి, భుజంగరావులు కూడా తమ వంతు బోధన చేశారు జ్యోతికి.

"అమ్మానాన్నల ప్రోద్బలంతోనే నేనిలా అయ్యాను మామయ్యా! వాళ్ళు ఎలా చెప్తే అలా వినేదాన్ని. మా ఆయన నన్ను గట్టిగా దండించి ఉండుంటే ఇలా ఉండేదాన్ని కాదేమో? " అంటూ పశ్చాత్తాపం వ్యక్తం చేసింది జ్యోతి.





"నిన్ను దండించడానికి నాకు ఛాన్స్ ఎప్పుడిచ్చావు? " జోక్ వేశాడు చంద్రశేఖర్.

అందరూ నవ్వారు.

"లేదత్తయ్యా! ఇక మీద నుండి నేను సక్రమంగా ఉంటాను. నాన్న ఇంటికి రమ్మన్నా వెళ్ళను. ఇక్కడే ఉంటాను. నేను ఇక్కడే ఉంటానంటే నాన్న కూడా విడాకుల ప్రయత్నం చేయడు" అంది జ్యోతి.

★ ★ ★

సాయంత్రం ఏడు గంటలయింది. బద్రి నారాయణ ఇంటికొచ్చాడు.

ఇంట్లో కూతురు కనబడకపోయేసరికి "జ్యోతి ఎక్కడ? " అంటూ విశాలాక్షిని అడిగాడు. ఆమె భోరున ఏడుస్తూ.. ఉన్నవీ, లేనివీ అన్నీ కల్పించి జరిగింది చెప్పింది. బద్రి నారాయణ అసలే కోపిష్ఠి. పైగా ఇలా జరిగిందని తెలిసి మరింత కోపంతో రగిలిపోయాడు. వెంటనే భార్యను పిలుచుకొని వాసుదేవరావు ఇంటికి బయలుదేరాడు. వాకిట్లోంచే కోపంతో ఊగిపోతూ, బిగ్గరగా అరుస్తూ ఇంట్లోకి ప్రవేశించాడు. ఇంట్లో అంతమంది జనాన్ని చూసి ఒక్కసారి నివ్వెరపోయాడు.

"రండి... బావగారూ! రండి అక్కయ్యా! " అంటూ వారిని ఆహ్వానించాడు వాసుదేవరావు.

"ఈ మర్యాదలకేం గాని ..నరసింహ

'వీడేంటి? పిల్లిలా పడుండేవాడు.. ఇలా మాట్లాడుతున్నాడు' అనుకున్నాడు మనసులో.

"భలే ఘనకార్యం చేశావులే! నేను దాని విడాకుల కోసం ప్రయత్నం చేస్తున్నానని నీకు తెలీదా? ఎందుకు ఈ పని చేశావు? అసలు నీవెప్పుడొచ్చావు ఈ ఊరికి? సరాసరి మనింట్లో దిగకుండా ఇక్కడ దిగావెందుకు? " అని అడిగాడు సూటిగా కొడుకుని.

వాసుదేవరావు సహనం కోల్పోయాడు.

"ఏంటి బావగారూ! ఇదేదో పరాయివాళ్ళ ఇల్లు అయినట్టు మాట్లాడుతున్నారు. ఇప్పుడు నరసింహ ఏం చేశాడని? మంచిపనే చేశాడు. అసలు విడాకుల కోసం మీరు ఎంత ప్రయత్నం చేసినా వాళ్ళిద్దరూ ఒప్పుకోకపోతే మీరేం చేస్తారు? " కాస్త కటువుగా అడిగాడు వాసుదేవరావు.

"జ్యోతి తప్పకుండా ఒప్పుకుంటుంది" అన్నాడు బద్రినారాయణ.

"అడిగి చూడండి" అన్నాడు వాసుదేవరావు.

"ఏమే... రా ఇంటికి పోదాం. నీకు నచ్చని ఇంట్లో ఎందుకుంటావు? " జ్యోతిని చూస్తూ అన్నాడు.

"నేను రాను నాన్నా! ఇక్కడే మా మయ్య ఇంట్లో ఉంటాను. పెళ్ళయింత

జ్యోతినెందుకు తీసుకొచ్చాడు? " దౌర్జన్యంగా అడిగాడు.

"మీరు మరీ కోపంగా ఉన్నట్టున్నారు. కాస్త శాంతించండి.. సరస్వతీ.. కాస్త మంచి నీళ్ళు తీసుకొనిరా...!" అంటూ సరస్వతిని పిలిచాడు వాసుదేవరావు.

"నేనడిగినదానికి జవాబు చెప్పండి" గొంతు పెంచుతూ అడిగాడు బద్రి.

నరసింహకు తండ్రి మీద బాగా చిరాకేసింది. అతనికీ కోపం వచ్చింది.

"నేనే జ్యోతిని తీసుకొచ్చాను. పెళ్ళయ్యాక అది ఎక్కడుండాలో అక్కడికే తీసుకొచ్చాను. ఏం తప్పా? " మొదటిసారిగా తండ్రిని ఎదిరించి మాట్లాడాడు.

ఖంగుతిన్నాడు బద్రినారాయణ.

ర్వాత ఇక్కడే ఉండాలి కదా!" అని జవాబిచ్చింది జ్యోతి.

తన కూతురు కూడా అలా మాట్లాడేసరికి ఒక్కసారిగా ఆశ్చర్యపోయాడు బద్రినారాయణ. ఇంట్లో ఉన్న జనాన్ని చూసి వీళ్ళేదో కుట్ర పన్నారనుకున్నాడు. లేకపోతే ఏంటి? ఎప్పుడూ తనకు ఎదురు తిరగని కొడుకూ, కూతురు ఇలా మారిపోయారు. అసలేం జరిగింది? దీనికంతా ఎవరు కారణం? భుజంగరావు కూడా ఇక్కడెందుకున్నాడు? అన్నీ యక్షప్రశ్నలు గానే ఉండిపోయాయి బద్రినారాయణకు.

ఇంతలో శశి ఫలహారాలు, మంచినీళ్లు తీసుకొచ్చి బల్ల మీద పెట్టింది.

"తీసుకోండి మామయ్యా! అత్తయ్యా... మీరు కూడా తీసుకోండి" వాళ్ళను కాస్త శాంతింపజేద్దామనుకుంది.

"తీసుకోండి అన్నయ్య గారూ! వదిన... తీసుకో" అంటూ సరస్వతి కూడా గొంతు కలిపింది.

వాళ్ళు ఫలహారాలు తీసుకుంటుండగా నరసింహ నిదానంగా అసలేం జరిగిందీ? అన్న విషయం గురించి మొత్తం వివరించాడు బద్రినారాయణకు.

"ఇదిగో! వీరే గనుక లేకుండా ఉండి ఉంటే నేను, జ్యోతి ఇలా మారిపోయి ఉండేవాళ్ళమే కాదు" ప్రసన్నకుమార్‌ను చూపిస్తూ అన్నాడు నరసింహ.

"చూడండి బద్రినారాయణ గారూ! నా కూతురి సంసారాన్ని నిలబెట్టడంలో ప్రసన్నకుమార్, వారి భార్య వాసంతి పాత్ర ఎంతో ఉంది. ఇప్పుడు నా మనసు చాలా తేలికపడింది. నా అల్లుడు... అంటే మీ అబ్బాయి చాలా మారిపోయాడు. అలా మారిపోవడం వల్ల చెల్లి సంసారాన్ని కూడా గాడిలోకి పెడదామనుకున్నాడు. చెల్లి మీద తనకుండే ప్రేమను చాటిచెప్పాడు. మీరు ఇక్కడికి రాకముందు జ్యోతిని పిలుచుకొనివచ్చి మేమందరం చంద్రశేఖర్, జ్యోతిలకి బాగా నచ్చజెప్పాం. దీనిలో ప్రసన్నకుమార్‌గారి పాత్ర చాలా ఉంది. ఇప్పుడు వారిద్దరూ తమ తప్పు తెలుసుకున్నారు. పెద్దవాళ్లం మనం వాళ్ళను కలపాలి గాని విడదీయకూడదు గదా! మీ ప్రయత్నాలు, మీ పట్టుదలలు మానుకోండి. అందరూ కలిసి ఉంటేనే చాలా ఆనందంగా ఉంటుంది. ఈ ఇల్లే చూడండి.. ఎంత కళకళలాడుతోందో! అందరూ సరదాగా, సంతోషంగా ఉన్నారో? పెద్దవాళ్ళమైన మనమే వారికి నచ్చజెప్పి సరైన దారిలో పెట్టాలేగానీ తప్పుదోవ పట్టించకూడదు!" బద్రినారాయణ ముఖకవళికలను నిశితంగా గమనిస్తూ అన్నాడు భుజంగరావు.

"చూడండి బాబాయిగారూ! మీరు కోర్టు వ్యవహారాల్లో బాగా దిట్ట అని విన్నాను. అట్లాగని చంద్రశేఖర్ మీ పని చేసి పెట్టలేదని అల్లుణ్ణి కోపగించుకోవడం ఏమంత సమంజసంగా లేదనుకుంటాను. నాకు తెలుసు... మీకు చంద్రశేఖర్ మీద ఆ ఒక్క కారణం తప్ప ఇక ఎటువంటి దురభిప్రాయం లేదు. చంద్రశేఖర్ నిజాయితీగా పనిచేస్తున్నప్పుడు మెచ్చుకోవలసిన దానికి బదులు అతనిపై ద్వేషం పెంచుకోవడం భావ్యంగా ఉండదు గదా! అయినా ఇంటి వ్యవహారాలు కోర్టుకు పోతాయి గాని కోర్టు వ్యవహారాలు ఇంటికి వస్తాయా? బయటి ప్రపంచంలో మీకు పలుకుబడి బాగా ఉంది. మీరే ఇటువంటి పని చేస్తే మీ సన్నిహితులు ఏమనుకుంటారు? మీ ముందర ముఖస్తుతి కోసం బాగానే మాట్లాడుతారు గాని మీ వెనుక నవ్వుకుంటారు. అది మీరర్థం చేసుకోవాలి! నరసింహ చెప్పాడు. మీకు కోర్టు పనులంటే చాలా సరదా. దాన్ని ఒక హాబీగా తీసుకుంటారని తెలుసు. నిజమే! మీకు

న్యాయశాస్త్రం మీద మక్కువ ఎక్కువ ఉండొచ్చు. అలాగని మనుషులను వెంటేసుకొని కోర్టు చుట్టూ తిరగడం బావుండదు కదా! మీకు అంతగా ఇష్టం ఉంటే ప్రైవేట్‌గా 'లా డిగ్రీ' చేయండి. ఈ వయసులో ఇంకేం చేసేదిలే అనుకుంటే 'లా జర్నల్స్' చదవండి. వివిధ రకాలైన కేసులను న్యాయమూర్తులు ఎంత చాకచక్యంగా పరిష్కరించి తీర్పులిచ్చారో అందులో ఉంటాయి గదా! అలా కాలక్షేపం చేయండి! అసలు మీకు లా డిగ్రీ లేనప్పుడు అలా సాహసించడం ఒక్కొక్కసారి బెడిసికొడుతుంది కూడా! వైద్యంలో నాకు ఏదో కొద్దిపాటి ప్రవేశం ఉందని నేను ఆపరేషన్ చేయగలనా? అట్లాగే ఇది కూడా! మీ అభిరుచులను కించపరుస్తున్నానని అనుకోవద్దు. దయచేసి నేను చెప్పేదాన్ని మనసు పెట్టి ఆలోచించండి" అని సుదీర్ఘంగా కాస్త పొగుడుతూ, అక్కడక్కడా చురకలు వేస్తూ అంత మందిలో ప్రసన్న కుమార్ చెప్పేసరికి బద్రినారాయణలో ఏదో 'గిల్టీ ఫీలింగ్' పొడచూపింది. మౌనంగా అలాగే ఉండిపోయాడు. దీర్ఘంగా ఆలోచనల్లో పడ్డాడు. విశాలాక్షి కూడా భర్త పక్కనే మౌనంగా ఉండిపోయింది. అందరి ముందు ఒక దోషిగా బద్రినారాయణ నిలబడదలచుకోలేదు. అటు భుజంగరావు, ఇటు ప్రసన్నకుమార్ తనలోని బలహీనతలను వేలెత్తి చూపడంతో కాస్త ఖంగు తిన్నాడు.

నిజమే! తనతో ఎవ్వరూ ఈ విధంగా మాట్లాడలేదు. ఎవరూ తన ప్రవర్తన గురించి అడ్డు చెప్పలేకపోయేసరికి ఇలా విర్రవీగి పోయాడా? ఒక్కసారి తన జీవితాన్ని వెనుదిరిగి చూసుకుంటే ఎన్ని తప్పులు చేశాడో అర్థమైంది బద్రినారాయణకు.

"సరే! ఇక జ్యోతి, నరసింహ పూర్తిగా మారిపోయాక, నా పిల్లల్లోనే ఇంత పరివర్తన వచ్చాక నేను కూడా చేసేదేముంది?

## జూన్ - 2013
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ ఐదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **చుండూరు అప్పల నరసింహం**
   - కొడిగెహళ్లి, బెంగళూరు
2. **పానుగోటి నరసింహారావు**
   - టోలీచౌక్, హైదరాబాద్
3. **వి. అయోధ్య రామారావు**
   - నిజాంపేట, హైదరాబాద్
4. **డి. వసుంధరా దేవి**
   - కాకినాడ, తూ.గో.జిల్లా
5. **వి. సీతానరసింహారావు**
   - కరెన్సీనగర్, విజయవాడ

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. సెల్మెన్ | 6. జైదాత్ |
| 2. షామిల్ | 7. లారిస్ మెలికోవ్ |
| 3. ప్రిన్స్ వొరొంట్సోవ్ | 8. ........ |
| 4. మార్యా డిమిట్రియెవ్నా | 9. ఛాయా దర్శనం |
| 5. యూసఫ్ | 10. మూడవ |

ఇంత వయసు వచ్చాక మనసులో దృఢంగా పాతుకుపోయిన అభిప్రాయాలు అంత త్వరగా మాసిపోవు గదా! దానికీ కొంత సమయం పడుతుంది. కానీ చూద్దాం.. నిదానంగానైనా మార్పుకోసం ప్రయత్నిస్తాను. ప్రసన్నకుమార్ చెప్పినట్లు నిజంగా నాకు చంద్రశేఖర్ మీద ఎలాంటి ద్వేషమూ లేదు. ఏదో అది అలా జరిగిపోయింది!" అన్నాడు బద్రినారాయణ.

అయితే "అన్నయ్యగారూ! మీరు రాత్రికి ఇక్కడనే భోంచేసి పడుకోండి. పొద్దునే

వెళ్దురుగాని" అంది సరస్వతి.

"అవును బావగారూ! ఈ రాత్రికి ఇక్కడనే సరదాగా గడపండి! మరో మాట చెప్పొద్దండి!" అంటూ వాసుదేవరావు కూడా బలవంతం చేశాడు.

"ఇప్పటికే లేటయింది. ఆడవాళ్ళం ఒకరికి నలుగురం ఉన్నాం కాబట్టి త్వరగానే వంట చేసేస్తాం" అంది సరస్వతి.

"సరే! ఈరోజు మేము మీ ఇంట్లోనే గడిపేస్తాం. ఇలా మనమందరం కలిసిన శుభసందర్భంగా రేపు మా ఇంట్లో 'సత్యనారాయణ వ్రతం' చేస్తామని అనుకుంటున్నాను. మీరందరూ రావాలి. ఏమంటావు విశాలాక్షి? " అంటూ భార్యవైపు చూశాడు.

"మీరు చెప్తే కాదంటానా? " అంగీకారం తెలిపింది విశాలాక్షి.

"అయితే శశీ! మీ అమ్మగారికి, అక్కయ్యకు వెంటనే ఫోన్ చేయి, రేపు పొద్దున్నే చిత్తూరు నుండి బయలుదేరమని" అన్నాడు నరసింహ, శశి వైపు చూస్తూ.

వెంటనే మొబైల్ ఫోన్ అందుకుంది శశి. "అమ్మా! నేను ఇక్కడ మదనపల్లెలో అత్తయ్య ఇంటి నుండి మాట్లాడుతున్నాను. నాన్నగారు కూడా ఇక్కడే ఉన్నారు. రేపు అత్తయ్య ఇంట్లో సత్యనారాయణ వ్రతం చేస్తున్నారు. నిన్ను, నాగిని పొద్దున్నే మదనపల్లెకు బయలుదేరి రమ్మంటున్నారు"

ఇంతలో విశాలాక్ష్మి "అమ్మాయ్! ఫోన్ ఇలా ఇవ్వు. మీ అమ్మగారితో నేను మాట్లాడుతాను" అంటూ శశి నుండి ఫోన్ తీసుకొని, "రోహిణి వదినగారూ! రేపు మీరూ నాగమల్లిక పొద్దున్నే మదనపల్లెకి బయలుదేరి రండి. సత్యనారాయణ వ్రతం చేస్తున్నాం. తప్పకుండా రావాలి" అని తన వియ్యపురాలిని ఆహ్వానించింది విశాలాక్షి.

"అదేమిటి? శశివాళ్ళ నాన్న అనంతపురానికి వెళ్ళారు గదా! ఇప్పుడు శశి మదనపల్లె నుండి మాట్లాడుతోంది. మీరేమో సత్యనారాయణ వ్రతం అని చెబుతున్నారు. నాకేమో అంతా అయోమయంగా ఉంది" ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసింది రోహిణి.

"అవును! ఇప్పుడు మీకు అలానే అనిపిస్తుంది. మదనపల్లెకి వచ్చాక అంతా వివరంగా వెండితెరపై చూద్దురు గాని" అంటూ జోక్ చేసింది విశాలాక్షి.

ఇంతలో భుజంగరావు "బావగారూ! నాదో రిక్వెస్ట్" అంటూ బద్రినారాయణను అడిగాడు.

"ఏమిటో! చెప్పండి" అన్నాడు బద్రినారాయణ.

"నా స్నేహితుడు కోటేశ్వరరావు, ఆయన భార్యను కూడా పిలుద్దామండి" అన్నాడు భుజంగరావు.

"అవును! మీ స్నేహితం గురించి నాకు బాగా తెలుసు. నెంబర్ చెప్పండి. నేనే ఫోన్ చేస్తాను" అన్నాడు బద్రినారాయణ.

భుజంగరావు నంబర్ చెప్పాడు.

"హల్లో! కోటేశ్వరరావుగారు! నేను మదనపల్లె నుండి బద్రినారాయణ. భుజంగరావు గారు కూడా ఇక్కడే ఉన్నారు. రేపు మా ఇంట్లో సత్యనారాయణ వ్రతం చేస్తున్నాం. మీరూ మీ భార్య తప్పకుండా పొద్దున్నే బయలుదేరి రండి. మీ కోసం ఎదురుచూస్తూ ఉంటాం" అని ఆహ్వానించాడు.

భుజంగరావు ఫోన్‌ను తనకివ్వమని సైగ చేశాడు.

"ఒరేయ్ కోటేశ్వరరావు! రేపు నీవు, నీ భార్య మదనపల్లెకి పొద్దునే బయలుదేరి రండి. బావగారు చెప్పారుగా! రోహిణి, నాగి కూడా రేపు పొద్దున్నే బయలుదేరుతున్నారు. నీవు, నీ భార్య వాళ్ళతో కలిసి వస్తే బావుంటుంది. తప్పకుండా రారా!" అని తాను కూడా కోటేశ్వరరావును ఆహ్వానించాడు.

బద్రినారాయణకు మందీమార్బలము

# అక్షరధార

వేల ఏళ్ల క్రితం మన ప్రాచీనులు మనిషి ప్రవర్తనా నియమావళిని నిర్దేశిస్తూ వాటిని శ్లోకబద్ధం చేశారు. అవి అన్ని కాలాలకి, అన్ని ప్రదేశాలకి చెందిన అందరికీ సమానంగా వర్తించే నిత్య సత్యాలు.

## ప్రయత్నం

ఉద్యమేన హి సిద్ధ్యంతి
కార్యాణి నమనో రథైః!
న హి సుప్తస్య సింహస్య
ప్రవిశంతి ముఖే మృగాః!!

భావం: ఉద్యమించి, ఒళ్ళుదాచుకోకుండా, మెలకువతో శక్తికొద్దీ ప్రయత్నించి పని చెయ్యడం ద్వారా మాత్రమే పనులను సాధించగలుగుతాం. మృగరాజే అయినా, నోరు తెరచుకుని నిద్రపోతుంటే సింహం నోట్లోకి జింకలు వచ్చి పడవు కదా!

## రెండు మంచి గుణాలు

ద్వావిమౌ పురుషౌ రాజన్
స్వర్గస్థోపరితిష్ఠితః!
ప్రభుశ్చ క్షమయాయుక్తో
దరిద్రశ్చ ప్రదానవాన్!!

భావం: ప్రతీకారం చేయడానికి సమర్థుడై ఉండి కూడా ఓర్పు కలిగి ఉండేవాడు, పేదవాడైనా దానం చేసే స్వభావం కలవాడు స్వర్గలోకం కన్నా పైలోకానికి అర్హులు అవుతారు.

## పాలనా రహస్యం

క్షత్రియస్తు ప్రజాంశ్చైవ క్షితిం ధర్మేణ పాలయేత్!
పుష్ప మూలం విచినుయాత్ మూలచ్ఛేదం నకారయేత్!!

భావం: రాజు ప్రజల్ని ధర్మ మార్గంలో పాలించాలి తప్ప పీల్చి పిప్పి చేయకూడదు. పూల మాలలని కట్టే మాలకారుడిలా చెట్టుని పోషించి పువ్వులని కోసుకోవాలి కానీ బొగ్గుల్ని కాల్చేవాడిలాగా మూలచ్ఛేదం చేయకూడదు.

## ప్రతికూల స్నేహితులు

లోకయాత్రా భయం లజ్జా దాక్షిణ్యం ధర్మశీలతా!
పంచ యస్మి న్న విద్యన్తే
న కుర్యాత్ తేన సంగతిమ్!!

భావం: లోక వ్యవహారం, భయం, సిగ్గు, దయ, ధర్మగుణం - ఈ ఐదూ లేనివారితో స్నేహం చేయరాదు.

## గోప్యంగా ఉంచాల్సినవి...

అర్థనాశం
మనస్తాపం
గృహదుశ్చరితాని చ!
పంచనం చావమానం చ
మతిమాన్న ప్రకాశయేత్!!

భావం: బుద్ధిమంతుడు తనకు కలిగిన ధననష్టం, మనస్తాపం, ఇంట్లోని చెడు, తను మోసపోయిన విధం, తనకు జరిగిన అవమానం మొదలైనవాటిని బయటికి చెప్పుకోడు.

సేకరణ : లిపి

ఉంది కాబట్టి క్షణాల్లో వ్రతానికి సంబంధించిన పనులన్నీ చేయించాడు. పురోహితుల్ని పిలిపించాడు. పూజాసామగ్రిని తెప్పించాడు.

తన వీధిలోని వాళ్ళను, స్నేహితులను, పొలంలో పనిచేసే పాలేర్లు, ఇతర పనివాళ్లను, ఇలా చాలామందిని ఆహ్వానించాడు.

సత్యనారాయణ వ్రతం చాలా ఘనంగా జరిపించాడు. ఆ ఇంట్లో పెద్ద పండుగ వాతావరణం నెలకొంది. ఎప్పుడూ లేనంత విధంగా అందరూ చాలా ఉల్లాసంగా, ఉత్సాహంగా పాల్గొని వ్రతాన్ని జయప్రదం చేశారు. రెండు వందల మందికి భోజనాలు కూడా పెట్టించాడు బద్రినారాయణ.

ఇంతలో రోహిణి నరసింహ దగ్గరికి వస్తూ "అల్లుడు గారూ! మీరొప్పుకుంటే శశిని నాలుగురోజులపాటు చిత్తూరుకు తీసుకొని వెళ్ళి మళ్ళీ అనంతపురానికి పంపిస్తాను" అని ప్రాధేయపడుతూ అడిగింది రోహిణి.

నిజానికి రోహిణి ఇలా అడగడం ఏ మాత్రం సమంజసంగా లేదు. ఎందుకంటే నాలుగు రోజుల క్రితమే శశిని భుజంగరావు అనంతపురానికి తీసుకెళ్ళాడు.

"అట్లాగే అత్తయ్యగారూ! శశిని మీరెన్నాళ్ళు ఉంచుకుంటారో ఉంచుకోండి. మీకిష్టం వచ్చినప్పుడే పంపించండి" అన్నాడు పూర్తిగా మారిపోయిన నరసింహ.

అంతే! మరుసటి రోజు భుజంగరావు, రోహిణి, నాగమల్లిక, శశి, కోటేశ్వరరావు, నాగలక్ష్మి అందరూ చిత్తూరుకు బయలుదేరి వెళ్ళారు.

నరసింహ, ప్రసన్నకుమార్, వాసంతి, పిల్లలు అనంతపురానికి బయలుదేరి వెళ్ళారు. బద్రినారాయణ, విశాలాక్షి ఇంట్లోనే మిగిలిపోయారు.

ఏడాది గడిచిపోయేసరికి పండంటి కొడుకుకు జన్మనిచ్చింది జ్యోతి.

వాడికి 'ప్రసన్నకుమార్' అని పేరు పెట్టుకుందామనుకున్నారు జ్యోతి చంద్రశేఖర్లు. ఇదే విషయాన్ని బద్రినారాయణ, విశాలాక్షిలకు చెప్పారు.

"చాలా మంచి నిర్ణయం బాబు! జాతకాలు, నక్షత్రాలు, రాశులు అవసరం లేకుండానే ప్రత్యక్ష దైవంగా భావించే వాళ్ళ పేర్లు పెట్టుకోవడంలో ఎటువంటి తప్పు లేదు. త్వరలోనే నామకరణానికి కావలసిన ఏర్పాట్లు చేస్తాలే" అన్నాడు బద్రినారాయణ. కొన్నిరోజుల తర్వాత బంధువులను, స్నేహితులను, ప్రసన్నకుమార్, వాసంతిలను కూడా పిలిపించి ఘనంగా బారసాల చేశాడు చంద్రశేఖర్ మామ బద్రినారాయణ.

పిల్లవాడికి తన పేరు పెట్టడం ఏ మాత్రం ఇష్టపడని ప్రసన్నకుమార్ ఇదే విషయాన్ని బద్రినారాయణకు, ఇతర బంధువర్గానికి చెప్పాడు.

"ఏదో బాబు! వాళ్ల సంతోషం కొద్దీ, సంతృప్తి కొద్దీ అభిమానంతో పేరు పెట్టుకున్నారు. కాదనకండి! మాకందరికి ఆనందంగానే ఉంది" అన్నాడు బద్రినారాయణ.

తను ఆరాధించిన మాస్టారు తన కుటుంబంలో మళ్లీ వసంతశోభను రంగరించినందుకు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకుంది శశి.

©

## కొత్తగాలి...

**రాజకీయాల్లో**
**శాశ్వత మిత్రులూ**
**శత్రువులూ లేరు**
**అవును! కప్పదాట్లూ**
**జంపుజిలానీలు! గోపిలు!!**

– జి.హరితశ్రీ, బెంగళూరు

జ్ఞానపీఠ గ్రహీత

**ఇందిరాగోస్వామి**

**అస్సామీ కథ**

# పాపం

**అనువాదం : పాలకోడేటి కృష్ణమూర్తి**

**అ**సోంలో దక్షిణ కామరూప్ జిల్లాలోని ఓ ప్రాచీన సత్రం నేపథ్యంగా సాగే కథ ఇది. ఓ కుటుంబంలో వంశాంకురం ఉదయించే క్రమంలో హిందూ సంప్రదాయ చట్రంలో చిక్కుకున్న వితంతువు పడ్డ వేదన ఈ కథలో ఉంది. ఆమె అగ్రవర్ణానికి చెందిన ఒక వ్యభిచారిణి. ఒళ్లు అమ్ముకున్న పాపానికి యుగయుగాల సంప్రదాయం, ధర్మం ఆమెపై ఏ ప్రభావం చూపించాయో కళ్లకు కడుతుందీ కథ. జ్ఞానపీఠ అవార్డు గ్రహీత ఇందిరాగోస్వామి కలం నుండి జాలువారిన అస్సామీ కథ ఇది.

**పీ**తాంబర్ మహాజన్ తన ఇంటి ముందు కూర్చున్నాడు. అతని కాళ్లకి ఉన్న బూట్లు మందంగా బురదతో అట్టకట్టి వున్నాయి. కానీ అతను వాటిని తొలగించ లేదు. పైగా వాటివంక గర్వంగా చూసుకు న్నాడు. ఆ కుగ్రామంలో తనకీ, సత్రంలో ఉండే గోసియాన్‌కి మాత్రమే బూట్లు వున్నాయి.

పీతాంబర్ వయసు సుమారు యాభై ఏళ్లు. ఒకప్పుడు అతను బాగా బలిష్ఠంగా ఉండేవాడు. కష్టాలు, బాధలు అతన్ని నెమ్మది నెమ్మదిగా కుంగదీయడంతో ఆరోగ్యం దెబ్బతింది. గడ్డం కింద ముడ తలు పడ్డ చర్మం వదులుగా వేలాడు తోంది. ఇతరులతో మాట్లాడేటప్పుడు ముఖం తిప్పుకొని, తల వంచుకుని మాట్లా డతాడు. చూపులు నేలలో ఏదో తవ్వుతు న్నట్టుగా పాదాలవైపు ఉంటాయి.

అధిక వర్షాలతో నేలంతా చిత్తడిచిత్త డిగా మారింది. రోడ్డుకి ఇరువైపులా నీళ్లు నిలిచాయి. కొందరు పిల్లలు అరకొర బట్ట లతో నీళ్లలో ఆడుకుంటున్నారు. వర్షాల కారణంగా అనేక రకాల చెట్లు, 'హలేచి', 'నలకోచు' లాంటి తీగలు ఏపుగా పెరి గాయి. నీళ్లు నిలిచిన చిన్న చిన్న గుంతల్లో కప్పలు అటూ ఇటూ దూకుతున్నాయి. ఒక్కోసారి అవి పాదచారుల పాదాల్ని రాసుకుంటూ దుముకుతున్నాయి.

లావుపాటి బుగ్గలున్న ఓ పిల్లాడు దిస మొలతో 'నలకోచు' తీగల మధ్య చిక్కు కున్న చేపలుపట్టే గాలం దారాన్ని లాగుతు న్నాడు. పీతాంబర్ ఆ పిల్లాడివైపు తదే కంగా చూస్తున్నాడు. ఇంతలో అతని ఆలోచనలకు భంగం కలిగిస్తూ "ఇతరుల పిల్లల్ని చూడ్డం కాదు. నా పిల్లలు అని చెప్పుకోటానికి పిల్లలెవరూ లేని నువ్వు ఆ

పిల్లాడికి దిష్టి తగిలేలా చూస్తావెందుకు? గుడికి వెళ్లి వస్తున్నప్పుడల్లా నేనీ విషయం గమనిస్తున్నాను! అది సరే, నీ భార్యకి ఎలా ఉంది? " వస్తూనే అన్నాడు ఊరి పురోహితుడు కృష్ణకాంత్.

అతని మాటలు చిరాకు పుట్టించాయి పీతాంబర్‌కి.

"అలాగే వుంది. చాలాసార్లు గౌహతికి తీసుకువెళ్లాను. అక్కడి ప్రభుత్వాసుపత్రిలో చూపించాను. ఫలితం కనిపించలేదు. ఆమె శరీరంలో ఎందుకో వాపు కూడా కనిపిస్తోంది. ఏం చేయాలో అర్థం కావడం లేదు" అయిష్టంగానే చెప్పాడు పీతాంబర్.

"అంటే ఆమెకు పిల్లలు కలిగే యోగం లేదన్నమాట. నిజంగా ఇది చాలా బాధాకరం. ఎందుకంటే మీ వంశాభివృద్ధికి విఘాతమే ఇది. మీ వంశం, మీ ఇంటిపేరు, ఆస్తి ఇవన్నీ నిష్ఫలమే"

పీతాంబర్ మౌనం వహించాడు. పూజారి అక్కడే నిలబడ్డాడు. మోకాళ్లపైకి ఓ పాత పంచె కట్టుకున్నాడతను. గొర్రె చర్మం రంగులో పొడిగా వున్న అంగవస్త్రంతో భుజాల్ని నిండుగా కప్పుకున్నాడు. నోట్లో రెండు దంతాలు మాత్రమే మిగలడంతో బుగ్గలు లోపలకుపోయి గుంటలు పడ్డాయి. దాంతో మాట్లాడేటప్పుడు ఆ మొహం జోకర్‌మొహంలా గోచరిస్తుంది. కళ్లు చిన్నవిగా గుంటనక్క కళ్లలా ఉన్నాయి. జుట్టు పల్చబడ్డంతో బట్టతల కన్పిస్తోంది.

కృష్ణకాంత్ కొద్దిగా వంగి "సరే మరో పెళ్లి సంగతేంటి? " అంటూ పీతాంబర్ చెవిలో గుసగుసలాడాడు.

పీతాంబర్ పైకండువాతో ముఖం తుడుచుకుంటూ సమాధానం చెబుదామనుకుంటుండగా రోడ్డుమీద వెళ్తున్న ఓ యువతిపై అతని దృష్టి పడింది. ప్రకృతి సుందరిలా అగుపించిందామె. ఆమెపేరు దమయంతి. చిన్న వయసులోనే భర్తను కోల్పోయిందామె. ఆమెభర్త ఒకప్పుడు సత్రంలో పూజారిగా ఉండేవాడు. వానకి ఆమె ఒళ్లంతా తడిసిపోయింది. బట్టల చివరలనుండి నీళ్లు కారుతున్నాయి. బట్టలు ఒంటికి అతుక్కుపోవడంతో తడిసిన ఆమె దేహంలోని ఎత్తుపల్లాలు, ఒంపుసొంపులు కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి. ఆమె శరీరచ్ఛాయ మరుగుతున్న చెరకు రసం నురుగులా తెల్లగా కళ్లు మిరుమిట్లు గొలుపుతోంది. లావుగా వున్నా, చాలా అందంగా ఉందామె. ఆమె గురించి ఎందరో ఎన్నో రకాలుగా చెబుతుంటారు. ఆమె తిరుగుబోతు అని కొందరు అంటుంటారు. బహుశా సత్రానికి చెందిన మొదటి వ్యభిచారిణి ఈమేనేమో!

"ఓ దమయంతీ! ఎక్కడినుంచి వస్తున్నావు? " అంటూ పిలిచాడు పురోహితుడు కృష్ణకాంత్.

"నువ్వు పట్టుపురుగు గూళ్లు చూడలేదా? " అంది· దమయంతి.

"అంటే నువ్వు మార్వాడీ వ్యాపారుల్నీ కలిసి వస్తున్నావన్నమాట. అవసరం వస్తే గాడిద కాళ్లైనా పట్టుకోవాలి మరి. అవునా? "

దయమంతి బదులు పలకలేదు. కానీ పూర్తిగా తడిసిన ఆమె లో పావడ నుంచి నీటిని పిండేందుకు ముందుకు వంగింది. ఆమె రవిక లాగినట్టు బిగుతుగా ఉంది. వాళ్లిద్దరూ ఆమె వక్షద్వయం మీంచి చూపులు తిప్పుకోలేకపోయారు. మాంసం దుకాణంలో కొక్కేనికి వేలాడదీసినట్టున్న తెల్లటి ఆమె కండల్ని కామంతో చూడసాగారు ఆ ఇద్దరూ. అలా చూడటం సంస్కారమనిపించక ఒక్కసారిగా ముఖాన్ని పక్కకు తిప్పుకున్నాడు కృష్ణకాంత్. కానీ పీతాంబర్ ఆబగా అలానే చూస్తూవుండిపోయాడు. ఆ అందం కాసేపు అతన్ని పిచ్చివాణ్ణి చేసింది. వారి చూపులు గమనించిన దమయంతి వెంటనే నిటారుగా





నిలబడి పావడా చటచటమంటూ చప్పుడ వుతుండగా వాళ్లవైపు చూడకుండా వెళ్లిపో యింది.

"మాంసం, చేపలు లాంటివి తింటోంద ట.." ఆమె వెళ్తున్నవైపు చూస్తూ అన్నాడు పీతాంబర్.

కృష్ణకాంత్ తలూపుతూ "తను పుట్టిన కులానికే చెడ్డపేరు తీసుకొచ్చిందామె. వితంతువులు పాటించవలసిన ఆచారాలు, నియమాలు గాలికొదిలేసింది ధూర్తురా లు" అన్నాడు.

"అవునవును, ఒకసారి రెండు బుట్టల ధాన్యం ఇచ్చి, ఓ జత 'ఖరయా' చేపలు తీసుకోవడం కళ్లరా చూశాను నేను"

"హవ్వ హవ్వ! ఓ వితంతువు.. ఖరయా చేపలా! ఛీఛీ! కలికాలం! కలి కాలం!" అరిచినట్టుగా పలికాడు పురోహితు డు కృష్ణకాంత్.

"ఓ పూజారీ! నోర్ముయ్! ఆవిడ చేపలు తింటుందని లోకమంతా తెలియాలా? బ్రహ్మపుత్రకు ఉత్తర దక్షిణాలు మాత్రమే కాదు, అన్ని చోట్లా ఇది మామూలే అని విన్నాను. కాలంచెల్లిన నీ ఆచార వ్యవహా



రాళ్ని ఇక కట్టిపెట్టు..."

గుఁయ్‌మంటూ చుట్టూ ఈగలు ముస రడంతో పైకండువా చివర్లతో వాటిని చెద రగొట్టేందుకు ఆగాడు పీతాంబర్. కృష్ణ కాంత్ నిట్టూరుస్తూ అక్కడే నేలకు వంగి ఉన్న ఓ చెట్టు కొమ్మపైన కూర్చున్నాడు.

"నువ్వు జరిపించే కర్మ సంబంధమైన ఆచార వ్యవహారాలు, సంప్రదాయాల సంగతేంటి? ఈ మధ్యన వాటి విష యంలో మీవాళ్లు నీపట్ల ఎలా వ్యవహరి స్తున్నారు? " అడిగాడు పీతాంబర్.

"నీకు తెలియందేముంది. అయినా అడు గుతున్నావు? నా పెద్దన్న నాతో దెబ్బ లాడి వ్యాపారంలో అధికభాగం లాక్కు న్నాడు. దాంతో సర్వనాశనమైపోయాను"

"బాపూ! నీకా సంస్కృతం సరిగా రాదు. ఈ విషయం అందరికీ తెలియచెప్పేశాడు మీ అన్న. ఇక సనాతనాచారాలు నిష్ఠగా పాటించేవారు నిన్ను దూరం పెట్టారు"

పీతాంబర్ మాటల్ని నిర్ద్వంద్వంగా తోసి పుచ్చుతూ కృష్ణకాంత్ "అయ్యో అది కాదు. ఒక సంగతి చెప్పు. నరహరి భగవతిలా సంస్కృతం తెలిసిన వాళ్లు ఉత్తరాదిన ఎందరున్నారని? నేనూ అతనూ ఒకే సంస్కృత పాఠశాలలో చదువుకున్నాం. అతను అస్తమానూ బెత్తం దెబ్బలు తినే వాడు. నేను ఎన్నడూ ఎలాంటి దెబ్బలు తినలేదు. నా గిరాకీలు ఎందుకు పోయా యో నాకు తెలుసు. నాలుగు వేదాలలో నూ మంచి ప్రావీణ్యంగలవాళ్లు కూడా తింటానికి తిండిలేక అల్లాడుతున్నారు. ఒకానొకప్పుడు మా కులపోళ్ల నుంచి ఇం టికి ఓ జంధ్యం, రెండు జతల పంచెలు, నెలకి ఐదురూపాయలు సంపాదించడం సులువుగా వుండేది. ఈ మధ్యన వాళ్లూ ఆచార వ్యవహారాలను పాటించడం తగ్గిం చేశారు. మన పాత గిరాకీ మణికంఠశర్మ ఖర్చు తప్పించుకోవాలని తన ఇద్దరు కొడు కుల ఉపనయనాలు 'కామాఖ్య' గుడిలో ఒకేసారి జరిపించాడు! ఇక మైసాన్‌పూర్ లో ఉండే మావాళ్లు చాలామంది తల్లి, తండ్రి శ్రాద్ధకర్మలు కలిపి ఒకే సమ యంలో జరిపించేస్తున్నారు"

కృష్ణకాంత్ చెప్పుకుపోతున్నాడు. అవున నిగాని, కాదనిగాని పీతాంబర్ ఏమీ మాట్లాడటం లేదు. అతని మనస్సంతా త ళుక్కుమని మెరిసిన దమయంతి శరీరం చుట్టూ తిరుగుతోంది. అలాంటి అపురూప సౌందర్యరాశిని, అంతటి అందాన్ని అతను ఎన్నడూ చూడలేదు. దాని అర్థం అతను ఎన్నడూ స్త్రీని చూడ్డంగాని, శరీరం తాక డంగాని చేయలేదని కాదు. అతని మొదటి భార్యకి పిల్లలు కలగలేదు. పిల్లలు పుడ తారనే ఆశతో రెండోదాన్ని తెచ్చుకున్నాడు. ఇప్పుడు ఆమె రోగిష్టిది. కీళ్లనొప్పులతో మంచం పట్టింది.

మంచంలో ఓ మూల ఎముకల పోగులా పడివుందామె. శరీరం పూర్తిగా క్షీణించి పీక్కుపోయింది. చికిత్సకోసం గౌహతి ప్రభుత్వ ఆసుపత్రి చుట్టూ చెప్పు లరిగేలా ఎన్నిసార్లు తిరిగాడో లెక్కలేదు. సంతానం లేకుండా మరణిస్తే వంశం అంతరించిపోతుందనే దిగులు, నిరాశా నిస్పృహలు ఇప్పుడు పీతాంబర్‌ను ఆవ హించాయి.

వంశం అంతరించిపోతుందన్న భయం మొదట్లో కొద్దిగా వున్నా, రోజులు గడు స్తున్న కొద్దీ, ఆ భయం ఎక్కువ కాసా గింది. భయానికి తోడు బాధ కూడా అధి కమయ్యింది. ఇవన్నీ అతను మానసికంగా కుంగిపోయేలా చేశాయి.

మట్టిఇంట్లో మంచంమీద ముడుచుకుని పడుకొని వున్న పీతాంబర్ భార్య బయట నిలబడివున్న పురోహితుడిని చూసింది. అ తను కూర్చునేందుకు చిన్న బల్ల బయట వేయమని అక్కడే నిలబడ్డ పనివాడికి కళ్లతో సైగ చేసింది. తనలోతాను లీనమై వున్నందున ఆ బల్లనుగాని, అది అక్కడికి

ఎలా వచ్చిందనిగాని గమనించలేదు పీతాంబర్.

కొంతసేపటి తర్వాత వెళ్లేందుకు లేచి నిలబడుతూ కృష్ణకాంత్ "నీ గురించి ఊర్లో వాళ్లు రకరకాలుగా అనుకుంటున్నారు... అదే, నీ మతి గతి తప్పిందనీ, నీ చెప్పుచే తల్లో లేదనీ. నీలాగా పిల్లలు లేనివారెం దరో ఈ లోకంలో వున్నారు. నువ్వూ అ లాగే ఆలోచించు. చివరాఖరికి ఈ పిల్లలు, పెళ్లాం, సంసారం ఇదంతా ఓ బూటకం. అర్థం చేసుకో" అన్నాడు.

పూజారి మాటలతో మెదడు మొద్దుబా రినట్లయింది పీతాంబర్‌కి. అతని తలలో తెల్ల వెంట్రుకల్ని గమనించాడు పురోహితు డు. అతని దుస్తులు మాసి వున్నాయి. మడ్డిగా వున్న అతని బూట్లు మాత్రం చెక్కుచెదరలేదు. పీతాంబర్ మీద పురోహి తుడికి జాలి కలిగింది. ఒకప్పుడు పీతాం బర్ చాలా అందంగా వుండేవాడు. అందరూ అతడిని 'సోగ్గాడు' అనేవారు. ఇప్పుడు అతనికి డబ్బు పుష్కలంగా ఉంది. గాదెల నిండా ధాన్యం వుంది. ఒక టని ఏంటి, అతని దగ్గర సమస్తం ఉన్నాయి. అయినా అతను సంతోషంగా వున్న దాఖలాలు లేవు. అకస్మాత్తుగా పురోహితుడి బుర్రలో ఏదో మెరుపు మెరి సినట్లయింది. చుట్టూ ఒకసారి చూశాడు. పీతాంబర్ బెడ్‌రూం తలుపు తెరిచేవుంది. మంచంమీద పడుకుని ఉన్న అతని భార్య కనబడింది. ఆమె కళ్లని చూశాడు పూజారి. కారడవిలోని జంతువు కళ్లలా ఎర్రగా వున్నాయవి. ఆమె భర్తకి అతను ఏమైనా చెబుతాడేమోనని శక్తినంతటినీ కూడదీసుకుని చెవులు రిక్కించి వినేందుకు ప్రయత్నిస్తున్నట్టుగా వుందామె. బెడ్‌రూం దూరంగా వున్నా అక్కణ్ణించి రెప్పవాల్చ కుండా చూస్తున్న ఆమెకళ్లు చింతనిప్పుల్లా ఎర్రగా వున్నాయి!

పురోహితుడు వెంటనే ఓ నిర్ణయానికి వచ్చి కొద్దిగా వంగి పీతాంబర్ చెవిలో "నువ్వు పడుతున్న బాధలనుంచి విముక్తి కలగడానికి నేను నీకో సాయం చేస్తాను" అన్నాడు.

"ఈసారి మరో పరిష్కారమా? "

"అవును ఈసారి కచ్చితంగా"

"నీ తీరు నాకు అర్థం కావడంలేదు"

"ఈసారి ఆమె గర్భం నిలవదనే ప్రశ్న ఉదయించదు! అప్పట్లో ఆమె అబార్షన్లు చేయించుకుంది. తన పాప భారాలను పెరట్లో వున్న వెదురు తోపులో పాతిపె ట్టింది"

పీతాంబర్ ఉలిక్కిపడుతూ "నువ్వు చెబుతోంది దమయంతి గురించా? " గట్టిగా అన్నాడు.

"అవును! అవును! ఈ రోజుల్లో 'పెద్ద' కులాల యువతులు చేపలుపట్టేవారిని కూడా పెళ్లాడుతున్నారు. 'ధనేశ్వరి' నది ఒడ్డున నివసించే గోసియాన్ కూతురు ఓ ముస్లిం యువకుడ్ని పెళ్లి చేసుకుంది. గాంధీమహాత్ముడు మనకి దారి చూపిం చాడు. బంగారంలాంటి ఈ అవకాశాన్ని జారవిడుచుకోకు"

"నువ్వేం మాట్లాడుతున్నావో అర్థం కావ డం లేదు. కాస్త అర్థం అయ్యేలా చెప్పు" అరిచాడు పీతాంబర్ ఉద్రేకంగా.

"నువ్వు కోరుకుంటే దమయంతి నీదవు

**కొత్తగాలి...**

**పనికి దూరం**
**ఖజానాకు భారం**
**నిద్రకు ఆధారం**
**గవర్నమెంటాఫీసు!**

– డి. చందూవంశీ,
కర్నూలు

తుంది!" అంటూ-

కృష్ణకాంత్ తలతిప్పి మంచంమీద పడుకుని ఉన్న పీతాంబర్ భార్యవైపు చూశాడు. ఆమె రెప్పవాల్చకుండా తనవైపే చూస్తోంది. ఆమెకళ్లు ఇంకా అలాగే నిప్పు కణికల్లాగే ఉన్నాయి. పీతాంబర్ దేని గురించైతే కలగంటున్నాడో దాని గురించి వివరంగా చెబుతున్నాడు కృష్ణకాంత్! పీతాంబర్ కళ్లలోనూ, ముఖంలోను ఆనందం వెల్లివిరిసింది. పీతాంబర్ కృష్ణకాంత్ దగ్గరకంటూ వెళ్లాడు. కృతజ్ఞతా పూర్వకంగా చటుక్కున అతని చేతులు పట్టుకోబోయాడు. పీతాంబర్ ఎక్కడ తాకుతాడోనని కృష్ణకాంత్ వెనక్కు జరిగాడు. స్నానం చేసి ఎంతో సమయం కాలేదు. పైగా తను గోసియాన్ ఇంట్లో ఉన్న మురళీధర్ పెళ్లి కార్యక్రమానికి వెళ్లాలి. తనని ఇప్పుడు పీతాంబర్ గనక తాకితే తను మళ్లీ స్నానం చేయాల్సి వస్తుంది అనుకున్నాడు కృష్ణకాంత్.

నదిలో మునిగిపోతున్నవాడికి అకస్మాత్తుగా రంగురంగుల నావ కనబడినట్లయింది పీతాంబర్‌కి. పురోహితుడి కాళ్లు పట్టుకోవాలో లేక చేతులు పట్టుకోవాలో అర్థం కాలేదతనికి.

"చాలా రోజులుగా నీలో ఈ కోరిక ఉంది, అవునా? " అని పీతాంబర్‌తో చెబుతూనే కృష్ణకాంత్ మంచంమీద నిస్తేజంగా పడుకుని ఉన్న ఆమెవైపు మళ్లీ చూశాడు. ఆమె కళ్లు మూసుకుని ఉంది. బహుశా దుర్భరమైన బాధవల్ల కావచ్చు.

"ఇది నీ వల్ల మాత్రమే సాధ్యమవుతుంది! దయచేసి దమయంతిని నాకు దక్కేలా చెయ్యి, కాదనకు. మా ఇద్దరినీ కలుపు. నేను ఆమెకు ఏ లోటూ రానివ్వను. అన్నివిధాలా సుఖపెడతాను. నీ మేలు ఈ జన్మలో మరచిపోను" అంటూ పురోహితుడి పాదాల దగ్గర మోకరిల్లాడు పీతాంబర్. అతని కళ్లలో ఆనందబాష్పాలు కదలాడుతున్నాయి.

కృష్ణకాంత్ బోసి నోటితో నవ్వాడు. ఆ నవ్వు వికృతంగా ఉంది.

"సరే.. లే! తప్పక ప్రయత్నం చేస్తాను. అలాగయితే నేను మరికొన్నిసార్లు ఇక్కడికి రావాల్సి వస్తుంది. దమయంతికి ఇద్దరు ఆడపిల్లలు కూడా ఉన్నారు. ఆమె వాళ్లని కూడా చదివించాలి, పెంచి పోషించాలి"

పీతాంబర్ మనస్సు అల్లకల్లోలమయింది. లేచి బెడ్‌రూంలోకి వెళ్లాడు. ద్వారం దగ్గరకి వెళ్లగానే కళ్లు పెద్దవిగా చేసుకుని భార్య తననే చూస్తోంది. డబ్బు, ఇంకా విలువైన వస్తువులు దాచి పెట్టిన చెక్కపెట్టెను తీయడం ఆమె చూసింది. కొంతసేపటి తర్వాత చెక్కపెట్టె మూత వేసి పురోహితుడి దగ్గరకి వచ్చాడు పీతాంబర్.

పీతాంబర్ ఇచ్చిన ఇరవై రూపాయలు తీసుకుని కూనిరాగం తీస్తూ వెళ్లిపోయాడు కృష్ణకాంత్.

వారం రోజులయ్యింది. కృష్ణకాంత్ జాడ లేదు. అతని కోసం ప్రతిరోజూ రోడ్డువైపు ఆత్రుతగా చూస్తున్నాడు పీతాంబర్. అతని మనస్సు నిండా కోర్కెలు రేకెత్తించే దమయంతి గురించిన ఆలోచనలే. గోసియానుల వీధిలో, జంధ్యాలు తయారుచేసేందుకు పత్తి పట్టుకుని దమయంతి గత ఏడు రోజులుగా తన ఇంటిని దాటిపోవడం చూశాడు పీతాంబర్. ఆమె రూపం, అందం, లావణ్యం అన్నీ అతన్ని వివశుణ్ణి చేశాయి. ఆమెను చూసినప్పుడల్లా ఆమె పొందుకోసం పీతాంబర్ మనస్సు ఉవ్విళ్లూరేది. అతడు ఆమె వ్యామోహంలోనే పూర్తిగా మునిగిపోయాడు. అతనికి చిత్ర విచిత్రమైన కలలు వస్తున్నాయి. దమయంతి కనబడినప్పుడల్లా ఆమె ధరించిన దుస్తులు మాయమైనట్లు, తెల్లని ఆమె నగ్నశరీరాన్ని చూస్తున్నట్లు అనిపించసాగింది పీతాంబర్‌కి.

# ఏడడుగుల అందగత్తె!



బ్రెజిల్ దేశంలోని పర అనే రాష్ట్రానికి చెందిన సిల్వా(17) ప్రపంచంలోనే అతి పొడుగైన అమ్మాయి. ఆమె ఆ వయసుకి ఉండాల్సిన ఎత్తుకన్నా చాలా అధికంగా, అంటే ఆరు అడుగుల పది అంగుళాల ఎత్తు ఉంది. బ్రగెంక అనే ఊళ్లో నివసించే సిల్వా తన పన్నెండో ఏట వరకూ ఎత్తు విషయంలో మామూలుగానే ఉంది. కాని గత ఆరేళ్లుగా ఆమె ఎత్తు అసాధారణంగా పెరిగింది. 1995లో జన్మించిన సిల్వా స్కూల్‌కి బస్సులో వెళ్లడం సాధ్యంకాక సైకిల్ మీద వెళ్లేది. థైరాయిడ్ సమస్య వల్ల ఆమెలో ఈ ఎదుగుదల ఉందని డాక్టర్లు చెబుతున్నారు. అందువల్ల తరచూ తలనొప్పి రావడం, దృష్టిలోపం కూడా ఆమెలో ఉన్నాయి. ఎదిగే వయసులో శరీరంలో హార్మోన్స్ అధికంగా ఉత్పత్తి అవడమే ఈ సమస్యలన్నిటికీ మూలకారణం. ఈ వ్యాధికి 'జైజాంటిజమ్' అనే వైద్యపరమైన పేరు. ఇలాంటి రోగగ్రస్థులు ఎక్కువ కాలం జీవించరని డాక్టర్లు చెబుతున్నారు. చికిత్సకి డబ్బులేని బీద కుటుంబంలో సిల్వా జన్మించింది. అకస్మాత్తుగా వార్తల్లో వ్యక్తిగా అవడం తనకు ఆనందంగా ఉందని సిల్వా ఓ ఇంటర్వ్యూలో చెప్పింది. తనతో ఫొటో తీయించుకోవడానికి అనేకమంది వస్తుండటం సంతోషం కలిగిస్తుందని ఓ పత్రికా జర్నలిస్టుకి చెప్పింది. మోడల్ అవ్వాలని ఆశిస్తున్న సిల్వా ఇప్పటికే వధువు దుస్తులతో ఓ చోట క్యాట్‌వాక్ చేసింది. బ్రెజిల్ బీదదేశం అయిందిగానీ ఇదే అమెరికాలాంటి దేశంలోనైతే ఆమె పంట పండేది. అనేక భాషలకు చెందినవాళ్లు తమ బ్లాగుల్లో సిల్వా ఫొటోని ఉంచడంతో విదేశాల నుంచి ఇప్పుడిప్పుడే ఆమెను మోడల్‌గా తీసుకోవడం జరుగుతోంది. ఈమె థైరాయిడ్ క్యాన్సర్‌కి లేజర్ టొమోగ్రఫి చికిత్సకి కొందరు ఆర్థిక సహాయం చేయడానికి ముందుకు వచ్చారు. సిల్వా తన తల్లి, సవతి తండ్రితో కలిసి జీవిస్తోంది. ఆమెకి ఇద్దరు చెల్లెళ్లు. వారి పొడవు సామాన్యంగానే ఉంది.




కామరూప్‌లోని ధనేశ్వరి నది ఒడ్డున ఉన్న 'రౌతా'లో దమయంతి జన్మించినట్టుగా జనం చెప్పుకుంటుంటారు. ధనేశ్వరి నది ఒడ్డున పుట్టిన పెద్దకులానికి చెందిన ఆడపిల్లల్ని మించిన అందగత్తెలు ప్రపంచంలో మరెక్కడా ఉండరని అక్కడివాళ్ల నమ్మకం. దమయంతిని చూసింతర్వాత ఆ విషయం నిజమనిపించింది పీతాంబర్‌కి.

క్రమం తప్పకుండా ప్రతిరోజూ నదీతీరాన తిరుగుతూ, అక్కడ గట్ల వెంబడి దొరికే ఆకుకూరలు, కూరగాయల్ని కోసుకోవడానికి వస్తూ వుంటుంది దమయంతి. సరిగ్గా అదే సమయంలో పీతాంబర్ తన ఇంటి ముందు కూర్చునేవాడు.

రోజూలాగే ఆరోజు కూడా కూరగాయల్ని పట్టుకుపోవడానికి వచ్చింది దమయంతి. ఆమె ముందు నడుస్తుంటే నగ్నంగా, బక్కపల్చగా ఉన్న ఆమె పిల్లలిద్దరూ బాగా వెనకగా నడుస్తున్నారు. సరైన పోషణలేక, దుర్బలమైన వాళ్ల శరీరాలు సమస్త భోగభాగ్యాల్ని పొందిన ఆరోగ్యవంతమైన తల్లి శరీరానికి విరుద్ధంగా ఉన్నాయి. రాగి రంగుతో ఉన్న దమయంతి నిడుపాటి కేశాలు పీతాంబర్ కళ్లకి ఆకర్షణీయంగా కనబడ్డాయి.

దమయంతి ఆకుకూరలు కోస్తుండగా పీతాంబర్ ఎక్కడలేని ధైర్యం తెచ్చుకుని ఆమె దగ్గరికంటా వెళ్లి "నువ్వు ప్రతిరోజూ ఇలాగే మురికి నీళ్లలో నిలబడుతూ, నానుతూ ఉంటే జలుబు చేస్తుంది" అన్నాడు.

వెనక్కి తిరిగి చూసింది దమయంతి. ఆశ్చర్యంతో ఆమె కళ్లు విప్పారాయి. కానీ ఆమె సమాధానం చెప్పలేదు.

పీతాంబర్ మాట్లాడటం కొనసాగిస్తూ "నేను పనివాడ్ని పంపుతాను. నీకు ఏమేం కావాలో, ఎంత కావాలో వాడికి చెప్పు, కోసి పెడతాడు. ఇంకా..."

పీతాంబర్ మాట పూర్తికాకుండానే మళ్లీ వెనక్కి తిరిగి చూసింది దమయంతి. నిర్లక్ష్యంగా ఉన్న ఆమె చూపుల్ని పీతాంబర్ తట్టుకోలేకపోయాడు. వెంటనే వెనక్కి తిరిగి వెళ్లి తన ఇంటిముందున్న చెట్టు కొమ్మ మీద కూర్చున్నాడు. మంచంమీద పడుకున్న భార్యని చూశాడతను. రెక్కలు తెగిన పక్షిలా ఉందామె. ఉదయం బాగానే ఉంది. గదిలో పచార్లు కూడా చేసింది. ఇప్పుడు మళ్లీ మంచం ఎక్కింది. పీకల్దాక కోపం వచ్చింది పీతాంబర్‌కి. భార్యవంక కోపంగా చూశాడు. అరిగిపోయిన కాళ్లు మడిచినప్పుడల్లా ఆమె మోకాళ్లనుంచి ఎముకలు చేసే శబ్దాలు కూడా అతనికి వినిపిస్తున్నాయి. ఆమెవైపు ఉరిమి చూశాడు. ఆమెకి మరోసారి మందులు వేయాల్సిన సమయం అది. కానీ అతను లేవలేదు. తన బూట్లకేసి చూసుకున్నాడు. జేబురుమాలు బయటికి తీసి బూట్లు తుడుచుకున్నాడు. కృష్ణకాంత్ వస్తాడేమో నని మాటిమాటికీ వీధిలోకి చూస్తూనే ఉన్నాడతను. ఇంతలో అకస్మాత్తుగా కిర్రు కిర్రుమంటూ బండి చప్పుడు వినిపించింది. అది ఏమిటో అతనికి తెలుసు. పొలంలో పండిన పంటలో అతని వాటా ధాన్యం తీసుకువస్తున్నారు కౌలుదార్లు. సాధారణంగా అలా బండి కనిపించగానే పీతాంబర్‌లో సంతోషం వెల్లువెత్తేది. కొత్త ధాన్యం తెచ్చే తాజా పరిమళాన్ని పీలుస్తూ బస్తాలు దింపేటప్పుడు లెక్కపెట్టడానికి పరిగెత్తేవాడు. అలాంటిది ఇప్పుడు కదలకుండా కూర్చుండిపోయాడు. నౌకర్లు బయటకి వచ్చి ధాన్యపు బస్తాలని ధాన్యపు కొట్టంలోకి చేరవేయసాగారు. పనులు జరుగుతుండగా అందరికీ టీ, అటుకులు, బెల్లం తెచ్చిచ్చారు పనివాళ్లు. వాటి రుచికి వాళ్లందరూ ఆనందించారు. తర్వాత వాళ్లందరూ బావి దగ్గరికి వెళ్లి చేతులు కడుక్కున్నారు. అక్కడే ఉన్న ఆకూవక్క వేసుకున్నారు. వెళ్లేముందు కౌలుదార్లు పీతాంబర్‌ని కలిశారు. పీతాంబర్ మౌనంగా ఉండడం వాళ్లని కలవరపరచింది. 'అయ్యో! నీకేమో సంతానం లేదు. ధాన్యపు కొట్టాలన్నీ పూర్తిగా ధాన్యంతో నిండిపోయాయి. డబ్బుకూ కొదవలేదు. ఇదంతా ఎవరికోసం! నీకా ముసలితనం వచ్చేస్తోంది. ఇకమీద దానధర్మాలు చేస్తూ భగవంతుని సేవలో గడపండి' అని పీతాంబర్‌కి చెప్పాలనుకున్నారు వాళ్లు.

పీతాంబర్ ఇంట్లోకి వెళ్లి డబ్బు తీసుకొచ్చాడు. ఒకరితర్వాత ఒకరికి అందరికీ డబ్బిచ్చి పంపేశాడు. తిరిగి వెనక్కి వచ్చి తన స్థానంలో కూర్చున్నాడు. తలుపులు తెరచి ఉండడంతో తన భార్యని చూడగలు

## కొత్తగాలి...

**ఆత్మనింద**
**ఆత్మస్తుతి**
**రెండూ**
**జారుడుమెట్లే**

– చక్కా లక్ష్మీప్రియ, కావలి

గుతున్నాడు అతను. ఆమె కళ్లు తెరుచుకునే ఉన్నాయి. మంచం కింద గిన్నె ఉంది. దాహం వేసిందేమో, మంచినీళ్లు తాగి ఉంటుంది. మందులు వేసుకునే సమయం దాటిపోయింది.

భార్యకి మందులు వేయాలనిపించింది పీతాంబర్‌కి. బూట్లు విప్పి ఒక మూలగా ఉంచాడు. ఇంట్లోకి అడుగు పెట్టబోతుండగా వెనకనుంచి ఎవరో దగ్గిన శబ్దం వచ్చింది. వెనక్కి తిరిగి చూశాడు పీతాంబర్. కృష్ణకాంత్! వెనక్కి పరుగెత్తి బూట్లు వేసుకున్నాడు పీతాంబర్. మందులు వేస్తాడేమోనని భార్య తనవంకే చూస్తోంది. కాసేపు అలాగే చూసింది. అలసటగా ఉందేమో.. కనురెప్పలు బరువుగా వెంటనే వాలిపోయాయి. ఆమె కళ్లలో మండుతున్న ఆవేశం పూర్తిగా దహించుకుపోయి చల్లారిపోయింది. కేవలం ఆ కళ్లలో బూడిద మాత్రమే మిగిలింది.

"బాపూ! ఏం వార్త మోసుకొచ్చావు? చెప్పు! తొందరగా!" అన్నాడు పీతాంబర్ ఆత్రుతగా. ఆ తత్తరపాటులో కృష్ణకాంత్‌ని కూర్చోమని చెప్పడం కూడా మరచిపోయాడు పీతాంబర్.

"చెప్పు! ఏంటి? "

పురోహితుడు చుట్టూ ఒకసారి చూశాడు. దుర్బలంగా ఉన్న ఆ రోగి వీధిలోకి కనబడుతోంది. మంచంమీద నిస్త్రాణగా పడుకుని వుందామె. ఆమె ఏమీ వినే పరిస్థితిలో లేదు.

"నేను చెప్పేది జాగ్రత్తగా విను! అన్ని విషయాలు తవ్వి తీశాను. ఇప్పుడైతే దమయంతి గర్భం ఖాళీగానే ఉంది. చివరి పాపభారం పాతిపెట్టి నెల రోజులు కూడా కాలేదు. ఈసారి గొయ్యి తవ్వేందుకు కాలేజీకి వెళ్లే ఓ స్టూడెంట్ ఇచ్చిన పార ఉపయోగించినట్టుగా ఆమె చిన్న కూతురు చెప్పింది. ఓ ఉన్నత కుటుంబంలోంచి వచ్చిన ఆ విద్యార్థి మంచి నడత లేని కుర్రాడు. కాలేజీ సమయంలో ఆ కుర్రాడు తిన్నగా దమయంతి ఇంటికి వెళ్లేవాడు. పాఠ్యపుస్తకాలను బియ్యం బస్తాలో దాచేవాడు. అతనికి పెద్దవాళ్లు ఇచ్చే కాలేజీ ఫీజు దమయంతి కాస్మోటిక్స్‌కి ఉపయోగపడేది" అంటూ పీతాంబర్ చెవిలో నెమ్మదిగా గుసగుసలాడాడు పురోహితుడు.

"...కటిక నేలమీద! హరిహరి! చిన్నపిల్లల ముందే సిగ్గు లేకుండా శృంగారం జరిపారు వాళ్లు. ఈసారి ప్రత్యక్షంగా ఆ కుర్రాడు.." తగ్గుపాటి స్వరంతో గొణిగాడు పురోహితుడు.

పురోహితుడు చెప్పడం కొనసాగించాడు.

"నీ గురించి అంతా దమయంతికి చెప్పాను. ఆమె మండిపడింది. కాండ్రించి

**కొత్తగాలి...**

**అణచుకోలేని**
**కోపం**
**అనర్థాలకు**
**రూపం**

– అంబటి వెంకటశివారెడ్డి,
యర్రగుంట్ల

ఉమ్మేసింది. 'ఆ కులం తక్కువవాడా! ఈ ప్రస్తావనను నాకు పంపడానికి వాడికెంత ధైర్యం! ఓ చిన్న కులానికి చెందిన మోసగాడు, దుష్టుడు అయిన ఆ మహాజన్‌కి నేనేమిటో, నేను పుట్టిన కులం ఏమిటో తెలియదా? నన్ను అప్రాచ్యపు పని చెయ్యమని చెప్పడానికి వాడికసలు నోరెలా వచ్చింది? - అంది. అందుకు బదులుగా నేను 'నువ్వు పాపకూపంలో పొర్లాడే దానివి. అలాంటప్పుడు ఏ కులంవాడైతే ఏంటి? ' అని ప్రశ్నించాను. అంతేకాదు, ఆమెను పెళ్లాడేందుకు వాళ్లకులంలోని వారెవరూ సమ్మతించడం లేదు. ఓ వితం

తువుని పెళ్లి చేసుకోవడానికి ధైర్యంగా ఎవరు ముందుకువస్తారు? అందులోనూ ఇద్దరు ఆడపిల్లలుండగా? కనీసం నువ్వయినా పీల్చి పిప్పిచేసి విసిరేసిన ఓ చెరకు గడలాంటిదాన్ని స్వీకరించేందుకు సిద్ధపడ్డావు. పంచాయతుల అనుమతితో హోమం పెట్టించి, సంప్రదాయబద్ధంగా నువ్వు ఆమెని పెళ్లి చేసుకుంటావని కూడా చెప్పాను. ఆమె నీ భార్య గురించిన వివరాలు అడిగినప్పుడు నీ భార్య ఓ గడ్డిపోచలాంటిదని, ఏ క్షణంలోనైనా కొట్టుకుపోతుందని చెప్పాను. ఇంకా ఆమె సంతోషంగా ఉండటానికి నువ్వు చేయగలిగినదంతా చేస్తావని కూడా చెప్పాను. ఊళ్లో ఖరీదైన బూట్లు ధరించేది నువ్వొక్కడివేనని చెప్పాను.

నేను చెబుతుండగా ఆమె ఒక్కసారిగా ఏడ్వడం మొదలెట్టింది. నాకేమీ అర్థం కాలేదు. కొంతసేపటి తరువాత పైటచెరగుతో కళ్లను తుడుచుకుంటూ దుఃఖం నిండిన స్వరంతో 'ఇప్పుడు నా ఆరోగ్యం అంత బాగా లేదు. ఏదైనా స్థిరంగా, శాశ్వతంగా, నిలకడగా ఉండే ఓ దారి చూసుకోవాలనుకుంటున్నాను' అంది. 'నువ్వు నాలుగైదు సార్లు పాపభారాలు పోగొట్టుకున్నావని విన్నాను. అటువంటప్పుడు ఆరోగ్యంగా ఉండాలనుకోవడం ఎలా సంభవం? పంచాయతులు దీనిమీద దృష్టి పెట్టినట్లయితే సత్రానికి అది చెడుగా పరిణమిస్తుంది. ఎవరైనా మీ ఇంటికి వచ్చి గ్లాసుడు మంచినీళ్లు స్వీకరించినా ఇరవై రూపాయలు జరిమానా విధిస్తారు. నీ కులాన్ని దృష్టిలో ఉంచుకుని నిన్ను మన్నించడం జరిగింది. కాని ఇలా ఎంత కాలం?' అంటూ వివరంగా నచ్చచెప్పాను. అందుకామె 'ఇందులో నేను చేసేదేముంది? నేను కూడా బతకాలి కదా? వాళ్లందరూ కలిసి జంధ్యాల తయారీ, మరమరాల ఆర్డర్లు నాకు లేకుండా చేశారు. నన్ను అపవిత్రమైనదాని గాను, నీతిమాలినదానిగాను, చెడిపోయినదాని గాను ముద్రవేశారు! ఇకపోతే కౌలుదార్లు! వాళ్లు పచ్చి దొంగలు, మోసగాళ్లు. నా వాటా ధాన్యం నాకివ్వడం మానేశారు ఆ దుర్మార్గులు. నా నిస్సహాయతను వాళ్లు అవకాశంగా తీసుకున్నారు. ఈ పరిస్థితులలో నా ఇద్దరు పిల్లలతో ఎక్కడికని వెళ్లను, ఎట్లా బతకను? భూమిశిస్తు కట్టలేదని ఉన్న కాస్త భూమిని కూడా జప్తు చేశారు! నేనేం చేయాలి?' అంటూ బదులు పలికింది"

"మరి నా సంగతి ఏం చేశావు?" అడిగాడు పీతాంబర్ అసహనంగా

"ఆఁ! ఆఁ! ఉండు! ఉండు! అక్కడికే వస్తున్నాను. దమయంతి నిన్ను కలవాలనుకుంటోంది. నిండు పున్నమి రాత్రివేళలో వడ్లు దంచే కొట్టం వెనక"

పీతాంబర్ సంతోషపడిపోయాడు. అది గమనించిన కృష్ణకాంత్ ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలనుకున్నాడు. వెంటనే పీతాంబర్ చెవిలో "ఇదిగో నేను చెప్పేది విను. ఓ నలభై రూపాయలు పట్టుకురా! పాడు దోమలు ఎక్కువైపోయి కుట్టేస్తున్నాయి. దోమతెర కొనుక్కోవాలి" చెప్పాడు.

డబ్బులు తేవడానికి ఇంట్లోకి వెళ్లాడు పీతాంబర్. భార్య మెలకువగా ఉంది. అదేమీ పట్టించుకోకుండా తిన్నగా చెక్క పెట్టె దగ్గరకి వెళ్లి అందులోంచి కొంతడబ్బు తీసి బయటకు వస్తుండగా మంచంమీద ఉన్న భార్య రెప్పవాల్చకుండా తనవైపే చూస్తుండటం గమనించాడు పీతాంబర్.

"పాడు పీనుగా! ఎందుకలా చూస్తున్నావు? గుడ్లు పీకేస్తా" అంటూ కసిరాడు.

కృష్ణకాంత్ అంతా విన్నాడు. పీతాంబర్ పరిస్థితిని ఊహించిన కృష్ణకాంత్, అతడిచ్చిన డబ్బులు తీసుకుంటూ "చూడు, ఒక

వేళ ఆ మనిషి అదే పనిగా చూస్తున్నట్ల యితే ఒక్కడోసు నల్లమందు ఇచ్చేయ్. ఈమె నీ మొదటి భార్యలా గొడవల మారి కాదు. బహుశా తనకు పిల్లలు కలగలే దన్న విచారం ఆమెను బాధిస్తున్నట్లుంది" గొణిగినట్లుగా అంటూ ఓ బోసినవ్వు నవ్వాడు కృష్ణకాంత్.

మంచంమీదున్న బక్కప్రాణి మళ్లీ కళ్లు మూసుకుంది. కృష్ణకాంత్ నవ్వడం ఆపి "కానీ ఆ లం... దమయంతి ఆశపోతు. ధనదాహం ఎక్కువ! నువ్వు ఆమెని వద్దకొట్టం వెనక తాకవచ్చు..." అన్నాడు అతనికేదో మేలు చేసినట్లు సీరియస్‌గా.

లోపల పడుకున్న భార్యవైపు చూశాడు పీతాంబర్. అంత దూరం నించి కూడా ఆమె నుదురుమీద స్వేదబిందువుల్ని స్పష్టంగా చూడగల్గుతున్నాడు పీతాంబర్.

★ ★ ★

అది ఆగస్టు నెల. నిండు పున్నమి రాత్రి. పీతాంబర్ ఖరీదైన దుస్తులు ధరించాడు. బూట్లు శుభ్రం చేసుకున్నాడు. ఉదయాన్నే నున్నగా గడ్డం గీసుకున్నాడు.

అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకున్నాడు. వృద్ధాప్యం వల్ల ముఖం మీద అడ్డంగా ఏర్పడిన గీతల్ని అద్దంలో చూసుకున్నాడు. వలలో చిక్కుకున్న చేపలా అనిపించింది ఆ ముఖాన్ని చూస్తుంటే.

దమయంతి ఇంటికి బయలు దేరాడు పీతాంబర్. ఆమె ఇంటికి దట్టమైన అడవి గుండా ప్రయాణించాలి. అడవికి ఆవలి వైపు జనసమ్మర్దం లేని శివారుప్రాంతంలో ఉంది ఆ ఇల్లు. బహుశా పాడు పనులు చేయడానికి, చేసిన పాపాలను కప్పి పుచ్చు కునేందుకే నిర్మానుష్యమైన ప్రదేశాన్ని ఎంచుకుని ఉండవచ్చామె.

పండువెన్నెలలో కుక్కగొడుగు రంగులో ఉన్న ఆకాశం ఫిరంగి ఆకారంలో కనిపిం చింది పీతాంబర్‌కి. నింగిలోని చంద్రుణ్ని చూశాడు పీతాంబర్. చంద్రుడు ప్రకాశిస్తూ ముగ్ధమనోహరంగా ఉన్నాడు. ఇంతలో అకస్మాత్తుగా కోర్కెలు రేకెత్తించే దమ యంతి దిగంబర శరీరంలా గోచరించాడు

**కొత్తగాలి...**

**ఆకాశంలో**
**నక్షత్రాలను లెక్కపెట్టలేం**
**సముద్రంలో**
**కెరటాలను ఒడిసిపట్టలేం**

— పి.వి. రమణకుమార్,
చిలకలూరి పేట

చంద్రుడు. దమయంతి వక్షద్వయాన్ని ఊహించుకోసాగాడు పీతాంబర్. గర్భం దాల్చిన మేక కడుపులా గుండ్రంగా, తెల్లగా ఉన్నాయవి. ఆమె నడుము మృదువైన వెదురు కొమ్మలా ఉంది. అది భ్రమ. దమయంతిమీద గల కోరిక పీతాంబర్‌ని అలా ఊహల్లోకి తీసుకెళ్లింది. తల వం చుకుని కింద చూసుకుంటూ వేగంగా నడ వసాగాడతను. సాల వృక్షాల అడవి దగ్గర నక్కల గుంపొకటి రోడ్డుకడ్డంగా మెరు పులా మెరిసి మాయమయింది. దమ యంతి ఇంటికి చేరుకున్నాడు పీతాంబర్.



మెల్లగా, నిశ్శబ్దంగా అడుగులు వేస్తూ ప్రాంగణంలోకి ప్రవేశించాడు. గదిలోకి తొంగి చూశాడు. కిరోసిన్ దీపమొకటి మినుకుమినుకుమంటూ వెలుగుతోంది.

పనసపండ్లు, బియ్యంసంచుల మధ్య ఓ పిల్ల నిద్రపోతోంది. మరోపిల్ల ఆ గుడ్డి దీపం వెలుగులో పలకమీద ఏదో రాసు కుంటోంది.

వడ్లకొట్టం దగ్గర నిలుచున్న దమ యంతి పీతాంబర్‌ని చూసింది.

"వో... వో... ఇటూ... ఇటూ.. ఇక్కడ! ఇలాగ!" అందామె పీతాంబర్‌కి మాత్రమే వినబడేలా నెమ్మదిగా.

"హోహో" అనుకుంటూ క్రమశిక్షణతో కూడిన సిపాయిలా అటువైపు నడిచాడు పీతాంబర్. మసకబారిన ఓ ఆముదం దీపం వెలుగుతోంది వడ్లుదంచే కొట్టంలో. శిథిలావస్థలో వున్న ఓ గోడకి ఆనుకుని వుంది దమయంతి. తత్తరపాటుకి గురి అవుతూ ఆ మసకచీకటి వెలుగులో దమ యంతి మొహంలోకి సూటిగా చూడలేక పోతున్నాడు పీతాంబర్. అతనికి భయం భయంగా ఉంది. వెంటనే ఆ భయ మంతా భ్రాంతి అని తట్టింది అతనికి. ఆ మసక చీకటి వెలుగులో కనిపించిన ఆమె అస్పష్టమైన రూపం కూడా భ్రాంతి అని తేలిపోయింది. మదిలో తొలుస్తున్న ఆలో చనలని నియంత్రించుకున్నాడతను.

"డబ్బు ఏమైనా తీసుకొచ్చావా? " అడి గింది దమయంతి.

పీతాంబర్ నిర్ఘాంతపోయాడు. ముందు గానే ఇలా అడుగుతుందని ఊహించలేదు.

"ఇదిగో! ఇంద, తీసుకో! నా దగ్గర వున్న దంతా నీదే" నెమ్మదిగా అంటూ తన నడు ముకి వున్న తాడు విప్పి చిన్న సంచి తీసి ఆమె చేతిలో వుంచాడు పీతాంబర్. దాన్ని తన రవికెలోని రొమ్ముల మధ్య దోపు కుంది దమయంతి. లాంతరు తీసుకుని పీతాంబర్‌కి దారి చూపిస్తూ చిన్నపిల్ల చదువుకుంటున్న గదిలోకి నడిచింది దమ

# కాలంలో తెగిన ఓ గొలుసు!



మొదటి ప్రపంచ యుద్ధంలో అమెరికన్ సైనికుడు ఫ్రాంక్ ఉడ్రఫ్ బకిల్స్ పని చేసాడు. అతను అంబులెన్స్‌లను, మోటార్ సైకిళ్లను నడిపే డ్రైవర్‌గా పని చేసాడు. 1917లో అమెరికా సైన్యంలో చేరాడు.

మొదటి ప్రపంచ యుద్ధంలో అమెరిన్ సైనికులు 4.7 లక్షల మంది పాల్గొంటే, ఒక్క బకిల్స్ తప్ప క్రమేపీ అంతా మరణించడంతో అతన్ని 'లాస్ట్ సర్వైవర్ ఆఫ్ వరల్డ్‌వార్-1'గా అమెరికా గుర్తించింది. తన వయసు 15 అయినా, 18 అని అబద్ధం చెప్పి అతను సైన్యంలో చేరాడట. అంబులెన్స్ కోర్‌లో పనిచేసిన అతను గాయపడ్డ సైనికులకు ప్రాథమిక సపర్యలు చేసి, ఆస్పత్రికి తరలించేవాడు.

చతుర ప్రపంచం

రెండో ప్రపంచయుద్ధంలో కూడా పాల్గొన్న బకిల్స్‌ను జపాన్ సైనికులు బంధించి, యుద్ధ ఖైదీగా తీసుకెళ్లారు. ఫిలిప్పైన్స్‌లో బంధించబడ్డ అతను యుద్ధానంతరం విడుదలయ్యాడు. తిరిగి స్వదేశానికి చేరుకున్నాడు. శాన్‌ఫ్రాన్సిస్కోకి చెందిన ఓ మహిళను వివాహం చేసుకున్నాడు. అతనికి 98వ ఏట వరకూ భార్య జీవించే ఉంది. నూటఐదేళ్ల వరకూ అతడు పొలం పనులు చేసుకునేవాడు.

వాషింగ్టన్ డీసీ పేరును 'డిస్టిక్ట్ ఆఫ్ కొలంబియా వార్ మెమోరియల్'గా మార్చమని అతను ప్రచారం చేసాడు. ఆ సందర్భంలో సెనెటర్స్ సభకు వెళ్లి మాట్లాడిన అత్యంత వృద్ధుడిగా పేరుపొందాడు.

బకిల్స్ మొదటి ప్రపంచ యుద్ధంలో విక్టరీ మెడల్‌ను, 1999లో ఫ్రెంచ్ లీజియన్ ఆఫ్ ఆనర్ మెడల్‌ను పొందాడు.

2011 మార్చి15న తన నూటపదో ఏట బకిల్స్ మరణించాడు. ఆర్లింగ్‌టన్ నేషనల్ సెమెట్రీలో మిలిటరీ గౌరవంతో జరిగిన అతని అంత్యక్రియలకు అమెరికా అధ్యక్షుడు ఒబామా హాజరయ్యాడు. 'మొదటి ప్రపంచ యుద్ధ సమయానికీ, నేటికీ కాలంలో గల ఓ గొలుసు తెగిపోయింది' అని ఒబామా చెప్పాడు.

---

యంతి. ఆమె వెనకే పీతాంబర్ కూడా లోపలికి వెళ్లాడు. పిల్లలిద్దరూ మంచి నిద్రలో ఉన్నారు. పీతాంబర్‌ని పక్కగదిలోకి తీసుకెళ్లింది దమయంతి. ఆ గది నెమ్ముగా, చీకటి చీకటిగా ఉంది. ఇంకా ఆ గదిలో జామచెక్కతో చేసిన చిన్నపాటి మంచం వుంది. గోసియాన్ అంత్యక్రియల సమయంలో దమయంతి భర్తకి ఇచ్చారా మంచం! దమయంతి దీపం ఆర్పింది...

★ ★ ★

రెండు నెలలు గడిచాయి. ఆ రోజు సాయంత్రం బాగా పొద్దుపోయిన తర్వాత హడావిడిగా ఇంటికి బయలుదేరాడు పీతాంబర్. బడలికగా వుండడంతో బావి దగ్గరికెళ్లి స్నానం చేస్తోంది దమయంతి. సరిగ్గా అప్పుడే అక్కడికి వచ్చాడు పురోహితుడు కృష్ణకాంత్. "అదేంటి మీకులపు కుర్రాడితో పడుకున్నప్పుడు స్నానం చేయలేదు. మరిప్పుడేంటి? " అన్నాడు పూజారి నర్మగర్భంగా.

దమయంతి ఏమీ మాట్లాడలేదు.

"హే! నాకు తెలుసు. పీతాంబర్ తక్కువ కులంవాడు కావడం వల్లనే.. అవునా? "

ఉన్నపళంగా తడిబట్టలతో ఓ మూలకి పరుగెత్తింది దమయంతి. భళ్లు భళ్లున

వాంతి చేసుకుంది. నిశ్చేష్టుడయ్యాడు కృష్ణకాంత్. తర్వాత తేరుకుని దమయంతి దగ్గరకి వెళ్లి "ఇది పీతాంబర్‌దే..." అన్నాడు.

దమయంతి మౌనంగా వుండిపోయింది.

"అబ్బా! నిజంగా ఇది ఎంత మంచివార్త! ఈ వార్త విని పీతాంబర్ ఆనందానికి పట్టపగ్గాలు ఉండవు. పాపం, వారసుడికోసం కుమిలిపోతున్నాడతను"

పురోహితుడు ఇంతగా మాట్లాడినప్పటికీ దమయంతి మౌనంగానే ఉండిపోయింది.

"ఇప్పుడే ఈ సంతోషకరమైన వార్తని పీతాంబర్ చెవిలో వేస్తాను. ఇక నలుగురి సమక్షంలో అతను నిన్ను పెళ్లి చేసుకుంటాడు" అంటూ, పురోహితుడు దమయంతి దగ్గరకంటా వచ్చి "ఇక్కడ జరుగుతున్న వాటి గురించి తెలిసిన జనాలు భయపడిపోతున్నారు. పంచాయతీలో మీటింగు పెట్టాలనే వార్త కూడా వినపడుతోంది. ఇదిగో విను! మరో విషయం.. చాలా సీరియస్! 'బిజులి' బొంగుల వెనకాల నువ్వు పాతిపెట్టిన మూడు నెలల పిండాన్ని ఒక నక్క తవ్వితీసి సగభాగాన్ని తిని, మిగిలిన సగ భాగాన్ని గోసియాన్ ఇంటికి అనుకుని వున్న పూజారి ఇంటిముందు వదిలేసింది. నీకు తెలుసో లేదో గోసియాన్‌ల మురళీధరుడిని శుద్ధి చేసే మనిషి చాలా శ్రమించాల్సి వచ్చింది. రెండు గ్లాసుల ఆవుపేడ నీళ్లు గొంతులో పోసుకోవాల్సి వచ్చింది"

దమయంతి నోరు పెద్దగా తెరిచి 'యాక్ యాక్' అంటూ మళ్లీ వాంతి చేసుకుంది.

పురోహితుడు తన ధోరణిలో తాను చెప్పుకుపోతున్నాడు.

"అన్నీ తెలిసి కూడా నిన్ను పెళ్లాడేందుకు సిద్ధపడ్డాడు పీతాంబర్!" అంటూ జంధ్యాన్ని తీసి దానిమీద చేతులుపెట్టి, "ఇదిగో ఈ యజ్ఞోపవీతం మీద ఒట్టు. వచ్చిన ఈ అవకాశం సద్వినియోగం చేసుకుని నువ్వు చేసిన పాపాల నుంచి ఇకనైనా బయటపడకపోతే చనిపోయాక నరకలోకంలో మంటల్లో కాలిపోక తప్పదు!" అన్నాడు పురోహితుడు.

★ ★ ★

జీవితంలో రాబోయే శుభఘడియల గురించి పీతాంబర్‌కి వివరిస్తూ కృష్ణకాంత్ "మొత్తంమీద నీ కలలు ఫలించేరోజు రానే వచ్చింది. దమయంతి నిన్ను పెళ్లి చేసుకోవడం ఖాయం, ఒకవేళ ఇప్పుడు ఉన్న గర్భం నిలిచే పక్షంలో" అన్నాడు.

ఎప్పటిలాగానే తన ఇంటి ముందు చెట్టుకొమ్మపైన కూర్చున్న పీతాంబర్ తనకి బహుమానంగా వచ్చిన బూట్లు ధరించాడు. కృష్ణకాంత్ చెప్పింది వినగానే అతని కళ్లు మెరిశాయి. శరీరం ఒక్కసారిగా గగుర్పొడిచినట్లయింది. ఆశ్చర్యానందాలతో అపనమ్మకంగా చూస్తూ "ఏంటి ఇది నిజమా?" అరిచాడు పీతాంబర్.

'దమయంతి కడుపులో పెరుగుతున్నది తన బిడ్డేనా? నిజమే అయ్యుంటుంది. ఈ పురోహితుడు చెప్పేది అబద్ధం అయ్యుండదు. నిజంగా తనబిడ్డే!' అనుకుంటూ పీతాంబర్ లేచి నిలబడి ఆనందాశ్చర్యాలతో అటూఇటూ పచార్లు చేయసాగాడు.

"ఈ వయసులో తండ్రి కావడమా? ఇది అద్భుతమే. నిజంగా ఇది అదృష్టమే" అన్నాడు కృష్ణకాంత్.

తన ఆశయం నెరవేరబోతోందని తెలిసి వెంటనే పురోహితుడి ముందు మోకరిల్లాడు పీతాంబర్.

"బాపూ! దయచేసి నా ఆశలు వమ్ము కానీయకు. ముక్కలు చేయకు. నా గతం నీకు తెలియంది కాదు. మా తాత ముత్తాతలు ధైర్యస్థైర్యాలు కలిగిన వీరులు, పరాక్రమవంతులు. బర్మాయుద్ధంలో పోరాడిన ధీరులు? ఇప్పుడు గనక మా వంశం నాతోనే ఆగిపోయి వంశాభివృద్ధికి వారసుడంటూ లేకపోతే నా ఆత్మ ఎంతగా క్షోభి



స్తుందో నీకేం తెలుసు.. అనుభవించే నాకు తెలుసు. ఇకపోతే, ఆ వగలాడి నా జీవితాన్ని తన గుప్పెట్లో పెట్టుకుంది. అయ్యో బాపూ.. నేనేం చేసేది? "

"ఆ విషయంలో నీకేమీ ఫరవాలేదు. శవాన్ని గద్ద కాపలా కాసినట్టు దమయంతికి కాపలాగా నేను ఉంటాను. అంతే కాదు, గర్భం పోగొట్టడానికి ఎలాంటి ఔషధాలు దమయంతికి ఇవ్వొద్దని ఆ ముసలి మాయలాడికి గట్టిగా చెబుతాను" అంటూ అభయమిచ్చాడు కృష్ణకాంత్.

"కానీ డబ్బు లేకపోతే ఇలాంటివి అసంభవం. దీనికి చాలా డబ్బు అవసరమవుతుంది" చెప్పాడు కృష్ణకాంత్ సాంత్వనగా.

డబ్బుకోసం ఇంట్లోకి వెళ్లాల్సిన అవసరం రాలేదు పీతాంబర్‌కి. ఎందుకంటే ఆ రోజు 'ఆర్‌పుట్'లోని వ్యాపారికి అమ్మిన ఏడు పనసచెట్ల పళ్ల తాలూకు డబ్బు తన జేబులోనే ఉంది. ఆ డబ్బును తీసి కృష్ణకాంత్ చేతిలో పెట్టాడు పీతాంబర్.

ఆయన అతడిని ఆశీర్వదించి తృప్తిగా వెళ్లిపోయాడు.

పీతాంబర్ ఇంట్లోకి వెళ్లాడు. ఆ జబ్బు మనిషి తనవంక తదేకంగా చూస్తోంది. ఆ చూపులు నిందాపూర్వకంగా అనిపించడంతో పీతాంబర్ తత్తరపడ్డాడు. కానీ అది

క్షణికమే. పీతాంబర్ నిశ్చింతగా, మొండిగా ఆమె వంక చూస్తూ "ఓసీ గొడ్రాలా, దరిద్రపు గొట్టుదానా! గుడ్లగూబలా ఆ చూపు లేంటి? " అంటూ కర్కశంగా గద్దించాడు.

★ ★ ★

పీతాంబర్ తెగ సంబరపడిపోతున్నాడు. ఇంటి ముందు తనకి ఇష్టమైన చోట కూర్చొని దమయంతి కడుపులోని బిడ్డ గురించి కలలు కనసాగాడు. అతని మనసులో దమయంతి గర్భంలో పెరుగుతున్న శిశువు కదలాడాడు. మంచి యౌవనంలో పుష్టిగా ఉన్న తన కొడుకు తనని వాహ్యాళికి చెరువువైపు తీసుకువెళ్లినట్లు, సుదీర్ఘమైన, విలువైన వంశం తరతరాలుగా ప్రకాశమంతమైన బంగారు భవిష్యత్తులోకి తీసుకుపోతున్న అనుభూతి కలిగింది పీతాంబర్‌కి. తను, తన కొడుకు ఇద్దరూ సుదూరంగా భూమ్యాకాశపు అంచుల్లోని కాంతిపుంజంలోకి జారిపోతున్నట్టుగా ఊహల్లో తేలిపోయాడు.

## కొత్తగాలి...

**శిశిరం**
**ఆకు రాల్చకుంటే...**
**వసంతానికిన్ని**
**వన్నెలెక్కడివి...?!**

– వెల్మల రాంరెడ్డి,
కరీంనగర్

నౌకరు సాయంతో పడకగదిలోని అటక పైనుంచి పాత చెక్కపెట్టె నొకదానిని తీశాడు పీతాంబర్. దానిని శుభ్రంగా తుడిచి ఓ పక్కకి తీసుకువెళ్లి ఎవరికీ కనబడకుండా దాని మూతని తీశాడు. అందులో ఓ బుట్టలో కట్టిన మూట ఒకటి ఉంది. ఆ మూటలో సగం కాలిన తన తండ్రి అస్థికలతోపాటు, తన తండ్రి మెడలోని బంగారు పూసలగొలుసు ఉంది. తండ్రి మరణశయ్యమీద ఉండగా ఈ బంగారు గొలుసును తనకిస్తూ దీనిని మనవడికి అలంకరించాలని, ఈ గొలుసులో ఉన్న బంగారు పూసలు తన వంశ పతాకాన్ని ఎగురవేయటానికి ఎక్కే బంగారు మెట్లు అని తనతో చెప్పాడు.

వాటన్నింటినీ కొంచెంసేపు తనివితీరా చూసుకుని తిరిగి అదే బుట్టలో కట్టి యథాప్రకారం అటకమీద పెట్టేశాడు పీతాంబర్.

రోజులు గడుస్తున్నకొద్దీ సహనం కోల్పోతున్నాడు పీతాంబర్. పిండానికి ఐదు నెలలు నిండితే విచ్ఛిన్నం చేసే అవకాశం లేదని చూచాయగా విన్నాడు తను. ఈ అనిశ్చితికి ఎప్పుడు తెర దించాలా అన్నట్టుగా ఈ ఐదు నెలలూ అధైర్యంతో కాచుకుని ఉండాల్సి వచ్చింది తను. ఓ కొండ అతని ఎదురుగా ఉన్నట్టుగా తోచేది. రోజూ ఒక స్త్రీ పాదాలు తనవైపు వస్తున్నట్లుగా అనుభూతి కలిగేది. హోమం చేయించాల్సిందిగా దమయంతి అన్నట్టుగా విన్నాడు తను.

"నేను కదలలేను, మెదలలేను. అటూ ఇటూ తిరగలేను. చూడు, నా పొట్ట బానపొట్టలా ఎంతగా పెరిగిందో! నాలో విపరీతమైన ఆలోచనలు చోటు చేసుకుంటున్నాయి. హిందూ, ముస్లిమ్, అగ్రవర్ణ లేదా మరేదో నిమ్నకులమైనా.. ఏమైనా ఇవన్నీ మట్టి పిడత ముక్కలు. వీటికి అర్థం పర్థం లేదు. నాకు కావాల్సింది ఓ మనిషి. శరీరం కోస్తే రక్తం చిందాలి. అది స్వచ్ఛంగా ఉండాలి" అంది దమయంతి ఒకరోజు.

పీతాంబర్ అలసిన మనస్సుకి దమయంతి రూపం ప్రకాశమంతంగాను, అందమైనదిగాను కనిపించసాగింది. చెవులకింపైన ఆమె అందెల రవళి, నున్నటి వెదురు బొంగులాంటి చీలమండని గుర్తుకు తెచ్చు

కున్నాడతను.

మూడు నెలలు గడిచాయి. రేయనక, పగలనక ప్రతిరోజూ యౌవనంలో ఉన్న తన కొడుకు 'ధనేశ్వరి' నది ఒడ్డున విహరిస్తున్నట్టు భావించసాగాడు పీతాంబర్.

అది ఆగస్టు నెల. సాయంకాలం. ఎక్కడి నుంచి వచ్చిందో పెను తుపాను విరుచుకుపడింది. బయట హోరుమని వాన. వడ్లకొట్టం దగ్గర ఉన్న గది తలుపు మూసేందుకు వెళ్లాడు పీతాంబర్. భార్య కళ్లు వెడల్పు చేసుకొని మరీ చూస్తోంది. అలాగే నిలబడ్డాడు పీతాంబర్. ఆమె కళ్లు చీకట్లో మెరుస్తున్న పాముల్లా ఉన్నాయి.

తుపానుతో కూడిన ఈదురుగాలికి దీపాలు రెపరెపలాడి ఆరిపోయాయి. అంతటా అంధకారం అలముకుంది. పెద్ద శబ్దంతో ఒక ఉరుము ఉరిమి, ఆకాశం మెరిసిపోయింది. ఆ మరుక్షణమే ఫెళ ఫెళమంటూ పెద్దశబ్దం వినిపించింది పీతాంబర్‌కి. ఏమయ్యుంటుందబ్బా? అనుకున్నాడతను. ఇంటి ముందు ఉన్న చెట్టుపైన పిడుగు పడి రెండుగా చీలి పడిపోయిన శబ్దం అయ్యుండొచ్చు. అది ఏం చెట్టో?

ఆశ్చర్యంతో పీతాంబర్ బయటికొచ్చి అటూ ఇటూ పరుగెత్తాడు. నౌకర్లు అక్కడే ఉన్నారు. వాళ్లు కొబ్బరికాయల్ని వరండాలోంచి దేఖల్‌కి చేరవేస్తున్నారు. ఈదురుగాలికి కొన్ని కొబ్బరికాయలు ఇంటి ఆవరణలోకి వచ్చిపడ్డాయి.

ఉరుములు, మెరుపులు నెమ్మదిగా తగ్గుముఖం పట్టాయి. వానమాత్రం కుండపోతగా కురుస్తూనే ఉంది. ఇంతలో ఎవరో పిలవడంతో ఎవరై ఉంటారబ్బా అనుకుంటూ చేతిలో లాంతరుతో బయటికొచ్చాడు పీతాంబర్. మోకాళ్లపైకి పంచెకట్టి పూర్తిగా తడిసిన ఆకారం కనబడిందతనికి. అతని చేతిలో చిరుగులతో ఉన్న గొడుగు ఉంది. అస్థిపంజరంలా బక్కపలుచగా ఉన్నాడు. పీతాంబర్‌వైపు వచ్చాడతను.

ఈ వానలో ఎవరబ్బా? అనుకుంటూ పీతాంబర్ లాంతరు పైకెత్తి వెలుగులో అతణ్ని చూశాడు. అతను మరెవరో కాదు, కృష్ణకాంత్!

"బాపూ నువ్వా? ఈ గాలివానలోనా? ఏంటి విషయం? " అరిచినట్టుగా అన్నాడు పీతాంబర్.

అతికష్టంమీద వరండాలోకి వచ్చి గొడుగును మడిచాడు పురోహితుడు. అతని చేతులు వణుకుతున్నాయి. ఏదో కలవరపాటు కనిపిస్తోంది అతనిలో.

"పీతాంబర్! నీ మొదటి భార్య చనిపోయిన సమయం, నక్షత్రం మంచివి కావు. బహుశా ఇప్పుడు జరిగిందానికి అదే కారణం కావొచ్చు" అన్నాడు పురోహితుడు తడిసిన తన పంచెను పిండుకుంటూ.

"ఏవిటి? ఏవిటి నువ్వనేది? ఏం జరిగింది? "

"ఎవరైనా మరణించినప్పుడు నక్షత్రం, మరణించే సమయం మంచిది కాకపోతే వాళ్ల ఇంటి ఆవరణలో మొలిచిన గడ్డి మొక్క కూడా మాడి మసి అవుతుంది. ఇప్పుడు నీ పరిస్థితి కూడా అలాంటిదే. అంతా మాడి మసయ్యింది!"

"ఏమైంది? హరి హరీ! త్వరగా చెప్పు" అరిచాడు పీతాంబర్.

"అయ్యో! ఏం చెప్పమంటావు? ఘోరం జరిగిపోయింది. దమయంతి గర్భవిచ్ఛిత్తి చేసుకుంది. గర్భంలోనే బిడ్డని చిదిమేసి వదిలించుకుంది. తక్కువ కులానికి చెందిన విత్తుని మోయడం ఆమెకి ఇష్టంలేదు. ఉన్నత వంశానికి చెందిన స్త్రీ ఆమె. అయ్యో! పీతాంబర్, పీతాంబర్! నీ బిడ్డని నాశనం చేసిందామె"

పీతాంబర్‌కి అమాంతం తన నెత్తిమీద పిడుగు పడినట్లనిపించింది. కాల్పనిక జగత్తులో 'ధనేశ్వరి' నది ఒడ్డున విహరిస్తూ యౌవనంలో వున్న తన కొడుకు అకస్మా

త్తుగా ప్రవాహంలోకి జారిపోయాడు...

★ ★ ★

ఒకరోజు అర్ధరాత్రి ఇంటి వెనకాల పెరట్లో ఏదో చప్పుడు వినబడ్డంతో దమయంతికి మెలకువ వచ్చింది. ఏమిటా చప్పుడు? తనకు స్పష్టంగా వినిపిస్తోంది.

భయంతో పెద్దకూతురిని లేపిందామె. ఇద్దరూ చప్పుడు వస్తున్న దిశగా చెవులు రిక్కించారు. అవును, అవునవును. ఎవరో ఏదో తవ్వుతున్న చప్పుడు. పెరట్లో వెదురుతోపు దగ్గరనుంచి వస్తోంది ఆ చప్పుడు. తల్లీకూతుళ్లిద్దరూ కలిసి నెలలు తక్కువగా వున్న బిడ్డల్ని పాతిపెట్టేందుకు గతంలో గుంతలు తవ్విన చోటు అది!

**కొత్తగాలి...**

**మృగం నుండి**
**మనిషయ్యాడొకపుడు**
**ఆ మనిషి నుండి**
**మృగమయ్యాడిపుడు**

– ఏకా లలితాపరమేశ్వరి,
మిర్యాలగూడ

అవును, అవును, ఆ రాత్రి. కూతురు లాంతరు పట్టుకుంటే దమయంతి వణుకుతున్న చేతులతో పారతో నేలను తవ్వి మట్టి తీస్తుండగా నక్కలు ఊళలు వేశాయి. ఓ! అదెంత భయంకరం? అదే రాత్రి.

"ఢక్!... ఢక్!... ఢక్!.... ఢక్!" తవ్వుతున్న చప్పుడు..

నెమ్మదిగా కిటికీ తలుపులు తెరిచి తొంగి చూశారు దమయంతి, ఆమె కూతురు. దగ్గరలోని వెదురు బొంగుకు వేలాడుతున్న సన్నటి లాంతరు వెలుగులో ఒకమనిషి ఆకారం నీడలాగా కదులుతూ కనిపించింది వాళ్లకి. ఆ ఆకారం పారతో నేలను తవ్వుతున్న దృశ్యం కనబడింది.

దమయంతి గుండెలు దడదడలాడాయి. అతణ్ణి చూసి ఆమె కంగారుపడింది. అతను మరెవరో కాదు.. పీతాంబర్! అవును అతను పీతాంబరే! అతణ్ణి స్పష్టంగా చూడగలుగుతున్నారు వాళ్లు. అతను నేలను తవ్వుతున్నాడు. ఒంటరిగా, పట్టుదలగా, తవ్వేకొద్దీ శబ్ద తీవ్రత అధికమవుతోంది. పీతాంబర్ మహాజన్ శరీరం, ముఖం భయంకరంగాను, క్రూరంగాను కనపడసాగింది. నేలను తవ్వి తవ్వి వాళ్లు తెలియనివాడిలా చేతిగోళ్లతో మట్టిని బరుకుతున్నాడు.

దమయంతి శరీరం కంపించింది. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. గొంతు తడారిపోయింది. భయం ఆవహించిన ఆ క్షణాల్లో ఏం చేయాలో పాలుపోలేదు ఆమెకు. గట్టిగా అరవాలో లేక నోరుమూసుకుని వుండాలో అర్థం కాని పరిస్థితి.

"మహాజన్! మహాజన్!"

సమాధానం లేదు.

"ఢక్! ఢక్! ఢక్! ఢక్!"

దమయంతి శరీరం గగుర్పాటు చెందింది.

"మహాజన్! నీకేమైనా పిచ్చి పట్టిందా? అక్కడ నీకేమి దొరుకుతుంది? అవును, నేనే పాతిపెట్టాను దానిని అక్కడ. మగపిల్లాడు. నెత్తుటి ముద్ద, రక్తం, బురద, ఇంక ఆపు!" కోపంతో అరిచింది దమయంతి.

తల ఎత్తిచూశాడు పీతాంబర్. అతని కళ్లు అగ్ని గోళాల్లా ఉన్నాయి.

"అవును. ఆ నెత్తుటి ముద్దను, ఈ నా చేతులతో స్పృశిస్తాను. వాడు మా వారసుడు. మా వంశాభివృద్ధికి చిగురులాంటి వాడు. రక్త మాంసాలతో ఉన్న ఓ భాగం! నేను వాడిని స్పృశిస్తాను" రొప్పుతూ అరిచాడు పీతాంబర్. ©

# అకాక్క



**- తల్లాప్రగడ ప్రభాకర్**

కాలింగ్‌బెల్ అదే పనిగా మోగుతుంటే విసుక్కొంటూ వెళ్లి తలుపు తీసింది మృణాళిని. ఎదురింటి మందాకిని మందహాసంతో "ఆంటీ! నా కథ ఈనెల మేగజైన్‌లో పడింది. ఇది నా కాంప్లిమెంటరీ కాపీ. చదివి ఎలాగుందో చెప్పండి. అన్నట్లు మరిచాను. ఈరోజు సాయంత్రం ఆరింటికి మన సెల్లారులో చిన్న పార్టీ అరేంజ్ చేసాను. మీరు, అంకుల్ తప్పక రండి, ప్లీజ్" అంటూ హడావిడిగా వెళ్లిపోయింది.

తనకన్నా మహా అయితే నాలుగైదేళ్లు చిన్నదైతే కావచ్చు, అంత మాత్రాన ఆమె తనను ఆంటీ అనడం, తనభర్తను అంకుల్ అనడం అస్సలు నచ్చలేదు మృణాళినికి. ఉక్రోషంతో, కోపంతో మేగజైన్‌లోని పేజీలన్నీ తిరగేసింది. ఎక్కడో అరపేజీకన్నా తక్కువవున్న కార్డుకథ పడింది.

'ఓస్! దీనికే అంత బిల్డప్పా!' అనుకొంటూ పుస్తకాన్ని టీపాయ్ మీదికి విసిరికొట్టింది. మందాకిని కార్డుకథ రాస్తే, తాను కవరుకథే రాయగలదు. గతంలో దసరా, దీపావళి, సంక్రాంతి కథల పోటీలకు తానెన్ని కథలు పంపిందనీ! అఫ్‌కోర్స్! అవన్నీ తిరిగొచ్చాయన్నది వేరే సంగతి.

సంకల్పం కన్నా మంచిముహూర్తం లేదనుకొని మర్నాడే తన భర్త ఆంజనేయులుతో నాలుగు దస్తాల తెల్లకాగితాలు, బాల్‌పెన్నులు, చేర్పులు మార్పులకు పెన్సిళ్ళు, రబ్బర్లు తెప్పించుకొంది. తనని కొన్నాళ్ళు డిస్టర్బ్ చెయ్యొద్దని తినేవన్ని పక్కనున్న కర్రీపాయింట్ నుంచి తెచ్చుకు తినమని ఆర్డరేసేసింది మృణాళిని. రైటింగ్ టేబుల్‌మీద టేబుల్‌లైట్, పక్కన రాసే సరంజామా ఏర్పాటు చేసుకుంది. మందాకిని రాసిన కథ వృత్తాంతం ప్రేమపెళ్లి మీద. తను రాసే కథా వస్తువు సామాజిక స్పృహ కలిగించేలా వుండాలని వాటికే సంపాదకులు ప్రాధాన్యం ఇస్తారని తెగ ఆలోచించి ఒక్కసారి 'వావ్!' అని అరిచింది. ఆ కేకకు పక్కగదిలో టీవీ చూస్తున్న ఆంజనేయులు ఉలిక్కిపడి చేతిలోని రిమోట్‌ని జారవిడిచాడు. రిమోట్ పగిలి దానిలో బ్యాటరీలు దొర్లుకుంటూ సోఫాకిందకి వెళ్లాయి. ఇప్పుడు సంఘాన్ని వేధిస్తున్న సమస్య మద్యం మహమ్మారి. మాజీ సినిమా నటి విపక్ష మహిళాధ్యక్షురాలు మద్యానికి వ్యతిరేకంగా చేసిన ధర్నాలు, తన సహచరులతో బెల్టుషాపులపై దాడి చేసి విధ్వంసం చేసిన దృశ్యాలన్నీ మృణాళిని మదిలో మెదిలాయి. మంచి కథా వస్తువు స్ఫురించినందుకు తననుతాను అభినందించుకొంది.

## చతుర కతేలు

రాత్రనక, పగలనక గదిలో కూర్చుని పుంఖానుపుంఖానులుగా రాస్తోంది. రాసింది నచ్చక చింపి పోగులు పెడుతోంది. రాసింది తిరిగి చదివితే అది వ్యాసరచన పోటీకి పంపిన వ్యాసంలాగో, ఎదుటివారికిచ్చిన ఉపన్యాసంలాగో అనిపిస్తోంది తప్ప కథలో పొందిక కుదరట్లేదు.

ఎలాగైతేనేమి నెలరోజుల్లో మద్యం మహమ్మారి ఇతివృత్తం మీద పదిపేజీలకు మించకుండా కథ

రాసి పత్రికాఫీసుకి పంపి, ఊపిరి పీల్చుకొంది. కథ పడిన వెంటనే మందాకినిలా పిసినారితనం చేయకుండా మొత్తం అపార్ట్‌మెంటులో ఉన్నవారందరికీ డిన్నర్ ఇద్దామని నిశ్చయించుకుంది. ఈనెల రోజులూ ఆంజనేయులుకు ఆటవిడుపుగా ఉంది. మృణాళిని రాస్తూరాస్తూ కునికిపాట్లు పడుతుంటే ఏ అర్థరాత్రో ఫ్లాస్క్‌నిండా వేడివేడి ఇరానీచాయ్ తెచ్చి కప్పులో పోసి అందిస్తోంటే ఆంజనేయులు వైపు మురిపెంగా చూసింది తప్ప తాను తిన్నాడా, తాగాడా అనేది పట్టించుకోలేదు ఆమె.

రోజులు గడుస్తున్నాయి. ప్రతిరోజూ పత్రికాఫీసు నుంచి ఏదైనా సమాచారం వస్తుందేమోనని ఎదురుచూస్తోంది. రాత్రి పదకొండయింది. టి.వి. చూస్తున్న మృణాళినికి కాలింగ్‌బెల్ వినబడింది. తన భర్త దగ్గర డూప్లికేట్ కీ ఉండగా కాలింగ్ బెల్ ఎందుకు నొక్కాడా? అని ఆశ్చర్యపోతూ తలుపు తీసింది. నిజమే! ఎదురుగా ఆంజనేయులు చెదిరిన జుట్టుతో, తూలుతూ నిలబడ్డాడు. ఏదేదో నోటికొచ్చిందంతా వాగుతున్నాడు.

నోటిలోంచి దుర్వాసన!

"ఆంటీ! ఇందాకటి నుంచి అంకుల్ మీ తలుపు తీయబోయి తాళంతో మా తలుపులు తెరుస్తుంటే చప్పుడుకు బయటికి వచ్చాం" అంది సంజాయిషీ ఇస్తూ మందాకిని.

"ఆంజనేయులు సార్ పార్టీకి వెళ్ళినట్లున్నారు. లోపలికి తీసుకెళ్ళి మజ్జిగ తాగించండి. అన్నీ సర్దుకుంటాయి" అనే సలహా మందాకిని మొగుడు ఇచ్చేసరికి మృణాళినికి తల కొట్టేసినట్టయింది.

ఆంజనేయులుని ఒకచేత్తో పొదివి పట్టుకొని లోపలికి తీసుకొని వెడుతుండగా 'ఆంటీ! మరిచిపోయాను. ఓ నిమిషం ఆగండి' అంటూ లోపలికెళ్ళి బరువైన కవరుని తెచ్చి చేతిలోపెట్టింది.

"మధ్యాహ్నం పోస్ట్‌మేన్ ఈ కవరుని మీ మెయిల్‌బాక్స్‌లో వేస్తుంటే అది పట్టకపోతే మీకిమ్మని ఇచ్చాడు" అంటూ లోపలికి వెళ్ళిపోయింది.

ఒకచేతిలో తాగొచ్చిన భర్త, వేరొక చేతిలో పత్రికాఫీసు నుంచి తిరిగొచ్చిన తన కథను చూసి అవాక్కయింది మృణాళిని! ©

# ఒడిలో

- బి. పాండు రంగారెడ్డి

రంగారావు విజయవాడలో బస్సు దిగేసరికి రాత్రి పది అయింది. మరో అరగంటలో ఆటోలో గాంధీనగర్‌లో ఉన్న మామగారింటికి చేరుకున్నాడు. బ్రీఫ్‌కేస్ మరో చేతిలోకి మార్చుకుని కాలింగ్ బెల్ బటన్ నొక్కాడు.

అర నిమిషంలో తలుపులు తెరుచుకున్నాయి. ఎదురుగా అనిల!

ఆమెను గుమ్మంలోనే కౌగలించుకుని తన హృదయానికి హత్తుకున్నాడు. ఆమె బరువైన ఛాతీ అతని ఛాతీపై మెత్తగా గుచ్చుకుంది.

'అంత తొందర ఎందుకు? లోపలికి వచ్చేదాకా ఆగలేరా? ' అందామె.

'ఒక్క క్షణం కూడా ఆగలేను. నెలరోజులు అయింది' అన్నాడు అతను.

'మీ లెక్కలు తప్పు. నెలమీద పదిరోజులు'

'అవును' అంటూ అతను మరింత విజృంభించాడు.

'ముందు స్నానం చెయ్యండి' అంటూ ఆమె అతన్ని విడిపించుకుంది.

అతను బట్టలు మార్చుకుని బాత్‌రూమ్‌లో ప్రవేశించాడు. మళ్ళీ బయటికి వచ్చేసరికి ఆమె చీర విడిచి, నైట్ గౌన్‌లోకి మారిపోయింది.

★ ★ ★

రంగారావు ఎం.కామ్. పాస్ అయిన వెంటనే హైద్రాబాద్‌లో ఓ వాణిజ్య బ్యాంకులో ఉద్యోగం వచ్చింది. ఉద్యోగంలోకి చేరగానే పెళ్ళి సంబంధాలు రావటం మొదలుపెట్టాయి.

ఒక స్థితిలో అతనిముందు నాలుగు సంబంధాలు వున్నాయి.

భార్య ఉద్యోగం చెయ్యటంవల్ల సంవత్సరానికి ఎంత ఆదాయం వస్తుంది, దాన్ని తెలివిగా మరో చోట పెట్టుబడి పెట్టడంవల్ల ఎంత లాభం వస్తుంది, చివరికి జీవితకాలంలో ఎంత ఆస్తి సమకూర్చుకోవచ్చు తదితర విషయాలు బాగా ఆలోచించి లెక్కలు తయారుచేశాడు.

అంతేగాక, ఉద్యోగం చెయ్యని అమ్మాయిని పెళ్ళి చేసుకోవటంవల్ల ఎంతనష్టం వస్తుందో అంచనా వేశాడు.



అన్నింటినీ కూలంకషంగా పరిశీలించి, చివరికి అనిలను పెళ్ళి చేసుకున్నాడు. అనిల డిగ్రీ పాస యింది. అందంగా వుంటుంది. వీటన్నిటికి మించి ఉద్యోగం చేస్తోంది విజయవాడలో.

'కాపురానికి ఎప్పుడు తీసుకువెళతారు. ఇల్లు చూసారా? ' అని శోభనంనాటి రాత్రి మొగుడ్ని అడిగింది అనిల.

'కాపురానికి తీసుకువెళ్తే మరి ఉద్యోగం? ' అంటూ ఎదురుప్రశ్న వేశాడు.

'రిజైన్ చేస్తాను' అందామె.

మీకోసం నేను దేన్నైనా త్యాగం చెయ్యగలను అన్నభావం ధ్వనించింది ఆమె మాటల్లో.

కానీ అతను ఆమె మాటలకు ఉలిక్కిపడ్డాడు.

'ఎట్టి పరిస్థితుల్లోనూ నువ్వు రాజీనామా ఇవ్వ వద్దు' అన్నాడు.

'మరి మన కాపురం? '

'నేను విజయవాడకు ట్రాన్స్‌ఫర్ కోసం ప్రయత్నిస్తాను. అలాగే నువ్వు హైదరాబాద్‌కి ప్రయత్నించు. ఎవరికి ముందు ట్రాన్స్‌ఫర్ అయితే అక్కడ ఇల్లు తీసుకుని కాపురం పెడదాం. అంత వరకూ నువ్వు పుట్టింటిలోనే వుండు' అన్నాడు అతను.

'పెళ్ళి అయినా మనకీ ఎడబాటు తప్పదా? '

'అలాంటి దిగులు పెట్టుకోకు. హైదరాబాదు ఎంతో దూరం కాదుగదా! నిన్ను చూడాలనిపించి నప్పుడు అక్కడ బస్సు ఎక్కి ఆరు గంటల తరువాత విజయవాడ చేరుకుంటాను' అంటూ అతను ఆమెను ఊరడించాడు.

పెళ్ళయి సంవత్సరం అయింది. ట్రాన్స్‌ఫర్ కోసం వారు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు.

ఆమె విజయవాడలో,

అతను హైదరాబాదులో.

నెలకి రెండుసార్లు అతను విజయవాడ వచ్చి అనిలతో ఓ రాత్రి గడిపి తిరిగి వెళ్ళిపోతున్నాడు.

ఈ జీవితంపై అనిలకి విరక్తి కలిగింది. కేవలం డబ్బు ముఖ్యం అనుకుని చెరొకచోట ఉండటం అర్థరహితంగా తోచిందామెకు. ఉద్యోగానికి రిజైన్ చేస్తానంటే అతను అంగీకరించడు.

★ ★ ★

'రేపు ఉదయం అయిదు గంటల బస్సులో హైదరాబాదు వెళ్ళిపోవాలి' అన్నాడతను ఆమె నైటీ జిప్ లాగుతూ.

'రేపు సెలవేగదా? '

'సెలవేకానీ ఆడిట్ పార్టీ వస్తోంది. ఆఫీసులో పనివుంది'

'అయితే విజయవాడకు ఎందుకు వచ్చినట్లు? '

'నీకోసమే'

'నాకోసమా- ఇందుకోసమా? ' అంది ఆమె కొంటెగా.

'అందుకే అనుకోరాదా!'

'అందుకే అయితే, ఈ మాత్రం సుఖం మీకు హైద్రాబాదులో దొరక్కపోయిందా? నేను కూడా ఇక్కడ నాకు కావలసిన సుఖానికి తగిన ఏర్పాట్లు చేసుకుంటాను. నెలకి రెండుసార్లు మీరు అక్కడి నుండి రావటానికి బోలెడంత డబ్బు ఖర్చు అవుతుంది. ఇలా అయితే చాలా డబ్బు మిగులుతుంది' అందామె.

అంతే! ఆ మరునాడే ఆమెచేత ఉద్యోగానికి రిజైన్ చేయించి, తనతో హైద్రాబాదు తీసుకువెళ్ళిపోయాడు అతను.



# చతుర ప్ర.జ.

## పాఠకుల ప్రశ్నలకు అవధాన సరస్వతి డా. మేడసాని మోహన్ సమాధానాలు



ప్ర. బ్రహ్మదేవుడు మనిషి పుట్టినప్పుడే వారి వారి రాతలు రాస్తాడంటారు. అందుకే బ్రహ్మ ఎలా రాస్తే అలాగే జరుగుతుందంటారు. మరో పక్క మంచి జరగడానికి పూజలు, గ్రహశాంతులు చేయిస్తారెందుకు?

– బి. లక్ష్మీదేవి,
కొత్తపేట, హైదరాబాద్

జ. బ్రహ్మదేవుడు లలాటంలో లిఖించిన రాతను మార్చగలిగిన శక్తి గురుదేవునికున్నది- అని ఎన్నో గ్రంథాలు చెబుతున్నాయి. గురువులకే గురువైన పరమగురువు భగవంతుడు. కాబట్టి బ్రహ్మ రాతనైనా, గ్రహబలాన్నయినా శాసింపగలిగినది దైవబలం మాత్రమే. అందుకే శాంతి పూజలు, భగవదారాధనలూ చేస్తాం.

ప్ర. సన్యాసం స్వీకరించిన పీఠాధిపతులు సముద్రం దాటి వెళ్లకూడదని విన్నాను. మరిప్పుడు కొందరు పీఠాధిపతులు సముద్రయానం చేస్తున్నారు కదా! ఏమిటిది?

– వి.పు. శాస్త్రి, నిజామాబాద్

జ. సన్యాసం స్వీకరించిన పీఠాధిపతులు గానీ, అర్చనాది కైంకర్యాలు నిర్వహించేవారు గానీ సముద్రాలు దాటి వెళ్లకూడదన్నది ప్రాచీనకాలం నుంచి వస్తున్న సంప్రదాయం. అందుకే ప్రాచీన పీఠాలైన శృంగేరి, అహోబిలం- వంటి పీఠాధిపతులు ఆ సంప్రదాయాన్ని పాటిస్తున్నారు. అధునాతన కాలంలో మానవ జీవన ప్రస్థానంలో సంభవించిన పెనుమార్పుల దృష్ట్యా ఈ సంప్రదాయాన్ని కొందరు స్వామీజీలు పాటించడం లేదు. స్వామి వివేకానంద, స్వామి చిన్మయానంద సముద్రాలు దాటి విదేశాలకు వెళ్లి భారతీయ సంస్కృతీ వైభవాన్ని ప్రబోధించినందువల్లనే ఈ సంస్కృతి గొప్పదనం జగద్వ్యాప్తమైన అంశాన్ని కూడా మనం విస్మరింపకూడదు.

ప్ర. పురాణకాలంలో భగవంతుని దశావతారాలు చెప్పుకుంటున్నాం. మరి ఈ కలియుగంలో ప్రత్యక్షదైవంగా కొలుస్తున్న శ్రీవేంకటేశ్వరుణ్ణి పదకొండో అవతారంగా భావించవచ్చా?

– ఇంద్రకంటి జయకృష్ణ,
సికింద్రాబాద్

జ. కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీవేంకటేశ్వరుణ్ణి పదకొండో అవతారంగానైనా భావింపవచ్చు లేదా శ్రీకృష్ణావతారంగానూ భావింపవచ్చు. శ్రీనివాసుడు ఆయా సందర్భాలలో తాను దేవకీ వసుదేవుల బిడ్డగానే స్వయంగా చెప్పుకొన్నాడు. అన్నమయ్య అనేక సందర్భాలలో ఈ భావాన్నే వ్యక్తీకరించి ఉన్నాడు.

ప్ర. శ్రీమద్వాల్మీకి రామాయణంలో ప్రతినాయకుడు రావణుడు బ్రహ్మ వంశంలో పుట్టిన బ్రాహ్మణుడా? రాక్షసుడా? లేక బ్రాహ్మణుడూ రాక్షసుడునా?

– బమ్మిడి సుబ్బారావు,
రిట్టపాడు, శ్రీకాకుళం జిల్లా

జ. పులస్త్య బ్రహ్మ సంతతి వాడైనందువల్ల రావణుడు సాక్షాత్ బ్రహ్మవంశానికి చెందినవాడే. అయినా రాక్షస లక్షణాలు కలిగిన బ్రాహ్మణుడు. అలాగే రాక్షస వంశంలో జన్మించినా ప్రహ్లాదుడు బ్రాహ్మణ లక్షణాలు కలిగినవాడు. ఈ వ్యత్యయం సృష్టి లక్షణం.

ప్ర. భారతదేశంలోని నదులకు వేరువేరు సమయాల్లో పుష్కరాలు రావడానికి కారణమేమిటి?

– డా. తూములూరి పార్థసారథి,
హైదరాబాద్

జ. పుష్కరుడు ఆయా నదీజలాలలో ప్రవేశించే ముహూర్త సమయాన్ని బట్టి ఆయా

నదుల పుష్కరాలు ఏర్పడతాయి. అయితే పుష్కరాల ప్రసక్తి అత్యంత ప్రాచీన గ్రంథాలలో లేదు.

ప్ర. చిలుకను రామచిలుకగా ఎందుకు చెబుతారు? రామునికి చిలుకకు ఏమి సంబంధం?

*– పక్కి శ్రీదేవి, మెట్టపల్లి*

జ. చిలుకలకు పలుకులు నేర్పించడం మన సంస్కృతిలో పరిపాటి. ఆ పలుకులను 'రామ' శబ్దంతోనే ప్రారంభిస్తారు. రామశబ్దం స్పష్టంగా పలకడంతోపాటు, ఇక అన్నిశబ్దాలు చిలుక పలుకడం అభ్యాసం చేస్తూ ఉంటుంది. ఆ తరువాత అది రామచిలుకగా చెబుతారు. దీనికి సంబంధించిన కొన్ని జానపద కథలు కూడా ప్రచారంలో ఉన్నాయి. అయితే వాటికి ప్రామాణికమైన ఆధారాలు లేవు.

ప్ర. మహాబలసంపన్నుడయిన వాలిని ధర్మాత్ముడయిన శ్రీరామచంద్రుడు చెట్టు చాటు నుంచి సంహరించటం ఎంతవరకు సమంజసం?

*– గండ్లూరి బలరామశాస్త్రి,*
మల్లాపూర్, హైదరాబాద్

జ. పూర్వకాలంలో మహారాజులు అరణ్యాలలో క్రూరమృగాలను వేటాడే సమయంలో చెట్ల చాటునుండి, పొదల మాటునుండి జాగ్రత్తగా వేటాడేవారు. పుత్ర సమానుడైన తమ్ముణ్ణి హింసించడం, కోడలితో సమానమైన తమ్ముని భార్యను చెరపట్టడం వంటి మృగ సంస్కార లక్షణాలు కలిగి ఉన్నందువల్ల శ్రీరామచంద్రుడు వాలిని మృగాన్ని వేటాడినట్లే చంపాడు. ఈ అంశాన్నే రాముడు వాలికి కూడా స్పష్టీకరించాడు. వాలి రాముని మాటలను అంగీకరించాడు కూడా.

ప్ర. శనివారం పుట్టినవారికి, శనిగ్రహం సంఖ్య ఎనిమిదో తేదీన పుట్టినవారికి, రోజు, సమయం, నెల, గ్రహం సంఖ్య అన్నీ '8' వచ్చినవారికి మంచి జరగదా?

*– కోటీరత్నం గుడె, సికింద్రాబాద్*

జ. శనివారం గాని, శనిగ్రహం గాని అశుభావహంగా భావించడం సముచితం కాదు. ఆయా స్థాన విశేషాలను బట్టి శని శుభప్రదుడు కూడా. అశుభస్థానాలలో ఉన్నాగానీ స్తోత్ర జపాదులతో శని శుభాలనే ప్రసాదిస్తాడు. అలాగే ఎనిమిది సంఖ్య కూడా. ఈ సంఖ్యను చాలామంది అష్టకష్టాలకు సంకేతంగా భావిస్తారు. ఇదే సంఖ్యను అష్టైశ్వర్యాలకు కూడా సంకేతంగా భావించవచ్చు. శ్రీకృష్ణభగవానుని అష్టభార్యలు, ఇంకా అష్టదిక్కులు, అష్టదిక్పాలకులు, అష్టవసువులు,

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. మరణించిన తర్వాత పార్థివ శరీరాన్ని వివిధ అవసరాల కోసం ఆసుపత్రులకు ఇస్తే మంచిదంటున్నారు. నిజంగా మంచిదేనా?

*– మంచాళ శ్రీలక్ష్మి, విశాఖపట్నం*

జ. మరణించిన తర్వాత పార్థివ శరీరాన్ని వివిధ అవసరాల కోసం వైద్యశాలలకు అప్పగించటం విశేష పుణ్యప్రదం

అష్ట యోగినులు, అష్టమూర్తులు- ఇలా ఎన్నో అంశాలకు '8' సంకేతాత్మక సంఖ్య.

ప్ర. మన తెలుగు పండుగలు ప్రతి సంవత్సరం వేర్వేరు తేదీల్లో వస్తుంటాయి. కానీ భోగి, సంక్రాంతులు జనవరి 13, 14న.. లీపు సంవత్సరంలో అయితే జనవరి 14, 15న వస్తుంటాయి. కారణం ఏమిటి?

*– వానపల్లి వెంకట సత్యగంగరాజు,*
విశాఖపట్నం

జ. కాలం అన్నది ఒక అనంత మహాప్రవాహం. ఎంత మహాప్రవాహమైనా, ఎన్ని ఉత్తుంగ తరంగాలతో ప్రవహించినా రెండు కొండల మధ్య ప్రవహింపవలసి వస్తే అలా ప్రవహించవలసిందే కదా. అలాగే ద్వాదశ సంక్రమణాల్లో ఎన్ని వ్యత్యాసాలు ఉన్నా, మకర సంక్రమణానికి కాలప్రవాహం ఒక నిశ్చల స్థితిని పొందడం శాస్త్రబద్ధమైన అంశమే.

ప్ర. పట్టుపురుగుల గూళ్లను మరిగే నీళ్లలో కాచి పట్టుదారం తీసి వస్త్రాలు నేస్తారు. ఆ పట్టుబట్టలని భగవంతునికి కడితే అది పవిత్ర వస్త్రమెలా అవుతుంది? నూలు వస్త్రాలు మేలు కదా!

*– సంధ్య శ్రీనివాసులు, మైసూరు*

జ. భగవన్మూర్తులకు చీనీ చీనాంబరాలు, పట్టు పీతాంబరాలు ధరింపచేయడం భారతీయ సంస్కృతిలో అనాదిగా వస్తున్న సంప్రదాయం. అలాగే పునుగు పిల్లుల నుండి ఉద్భవించిన సుగంధ ద్రవ్యంతో భగవన్మూర్తులను అభిషేకించడం, చర్మంతో చేసిన డోలును మంగళ వాద్యంగా ఉపయోగించడం- ఇలాంటి వానిని అపవిత్రంగా భావింపలేము గదా! పవిత్రత, అప

విస్త్రత - అన్న భావాలను కేవలం మూసలో పోసినట్లుగా ఒకే దృక్పథంతో విశ్లేషింపలేం. ఉదాహరణకు ఆవుపేడని మనం పవిత్రంగా భావిస్తాం. గోమూత్రాదులను పవిత్రంగా భావిస్తాం. అలా అని మానవుల మలమూత్రాదులను ఎవరూ పవిత్రంగా భావింపరు కదా!

ప్ర. భగవంతుడ్ని ప్రార్థించేవారు, ప్రార్థించని వారు కూడా ఇంచుమించుగా బాధలనుభవిస్తున్నారు. అలాంటపుడు దైవప్రార్థన ఎందుకు?

**– వి.యస్.వి. రాధాకృష్ణ**, విశాఖపట్నం

**జ.** దైవప్రార్థన, భక్తి - వంటి అంశాలన్నీ ఆయా జీవుల సంస్కారాలను బట్టి అంతరంగంలో కలిగే విశ్వాసానికి సంబంధించిన భావాలు. ప్రార్థన, సంకీర్తనాదుల చేత దైవాన్ని ఆశ్రయించినవారికి కూడా బాధలు, కష్టాలు కలుగవచ్చు. అయితే దైవాన్ని ఆశ్రయించినవారికి బాధలు, కష్టాలు కలిగినా - అవి నామమాత్రంగా కలుగవచ్చు. ఉదాహరణకు అర్జునుడు శ్రీకృష్ణుని ఆశ్రయించడం వల్ల కర్ణుడు ప్రయోగించిన నాగాస్త్రం కేవలం కిరీటాన్ని తన్నుకు పోయింది. లేకుంటే కంఠాన్నే ఉత్తరించేది. కాబట్టి 'నామ సంకీర్తనం యస్య సర్వపాప ప్రణాశనమ్' - అన్న భాగవతోక్తి ఎప్పుడూ అనుసరణీయమే.

ప్ర. అవధానంలో పృచ్ఛకులు అడిగే సమస్యలోని పదాలకు సంఖ్యాపరంగా నియమమేదైనా ఉంటుందా? అవధాన ప్రక్రియ గురించి సమగ్రంగా తెలిపే పుస్తకాలు సూచించగలరు.

**– మహమ్మద్ తహసీన్ అలి**, వడ్డేపల్లి

**జ.** అవధానంలో 1. నిషిద్ధాక్షరి, 2. న్యస్తాక్షరి, 3. దత్తపది, 4. సమస్యాపూరణం, 5. వర్ణన, 6. పురాణపఠనం, 7. అప్రస్తుత ప్రసంగం, 8. ఆశువు, 9. పుష్పగణనం, 10. ఘంటాగణనం, 11. పంచాంగ శ్రవణం, 12. చదరంగం - వంటి అంశాలు ఉంటాయి. అష్టావధానంలో పై అంశాలలో ఏవైనా 8 అంశాలను పృచ్ఛకులు ప్రశ్నిస్తారు. తిరుపతి వేంకట కవుల శతావధానసారం, నానారాజ సందర్శనం, సి.వి. సుబ్బన్నగారి సిద్ధాంత గ్రంథం, రాళ్ళబండి కవితాప్రసాద్ రచించిన అవధాన విద్య - ఆరంభ వికాసాలు, ఇటీవల మారుతీశర్మగారు ప్రచురించిన కొప్పరపు కవుల ప్రతిభా ప్రభ - వంటి గ్రంథాలు చూస్తే ఈ ప్రక్రియ గురించి సమగ్రంగా తెలుసుకోవచ్చు.

ప్ర. మరణానంతరం జీవుడు పైలోకాల్లో కర్మ ఫలం అనుభవించిన తర్వాత మళ్లీ జన్మ ఎత్తుతాడని శాస్త్రం. అలాంటపుడు మనం చేసే శ్రాద్ధ కర్మలు ఎవరికి, ఎలా చెందుతాయి?

**– వి.యన్. మూర్తి**, హైదరాబాద్

**జ.** జీవుని ఆత్మతత్త్వం సువిశాలమైంది. ఇంకా చెప్పాలంటే అనంతమైంది కూడా. ఆయా జీవుల కర్మఫలాలను బట్టి జన్మలెత్తుతున్నా, వివిధ జన్మలలో శరీరాలతో అనుబంధం నశించినపుడు, ఆయా పార్థివ శరీరాలకు సంబంధించిన కొన్ని వాయుకిరణాలు పితృలోకం చేరుతాయి. ఆయా జీవుల పుణ్యవిశేషాలను బట్టి అవి తేజోరూపంలో కూడా ఉంటాయి. మనం సమర్పించే శ్రాద్ధాదులు ఆ తేజోమూర్తులకు చెందుతాయి.

ప్ర. పత్రం, ఫలం, పుష్పం, తోయం.. ఇలా ఏవైనా నైవేద్యం పెట్టొచ్చని శ్రీకృష్ణుడే సెలవిచ్చాడు. కానీ చక్కెర పెడితే తగవుల బారిన పడతారని కొందరంటున్నారు. నిజమా?

**– జి. గీత**, చిత్తూరు

**జ.** చక్కెర నివేదనం పెడితే తగవుల బారిన పడతారనడం ఏదైనా ఒకటి, రెండు ప్రాంతాలకు చెందిన విశ్వాసం కావచ్చు. సర్వే సర్వత్రా నిజం కాదు.

ప్ర. ఏకలవ్యుడు ద్రోణాచార్యునికి గురుదక్షిణగా బొటనవేలు ఇచ్చిన తరువాత ఏమైనాడు?

**– కె.వి. లక్ష్మణరావు**, మానేపల్లి

**జ.** ఏకలవ్యుడు ద్రోణాచార్యునకు బొటనవేలు గురుదక్షిణగా ఇచ్చిన తరువాత తన ఆటవిక రాజ్యంలోనే ఉండేవాడు. కాలాంతరంలో ఏకలవ్యుడు, అతని కుమారుడు పాండవుల అశ్వమేధ యాగానికి సంబంధించిన అశ్వాన్ని బంధించడం వల్ల కృష్ణార్జునుల చేతిలో హతులవుతారు.

ప్ర. 'కాశీలో వదిలేయడం...' అంటే ఏమిటి? ఏమేమి వదిలేయవచ్చు? వదిలేస్తే ఇక వాటిని ముట్టకూడదా?

**– నేమాన సుభాష్‌చంద్రబోస్**, విశాఖపట్నం

**జ.** కాశీలో వదిలేయడం అంటే మనమేదైనా ఇష్టంగా తినే కూరగాయల్ని వదిలేస్తూ ఉంటారు. అలా వదిలివేసిన కూరగాయలను గాని, కూరలనుగాని ఇక జీవితంలో తినరు. కాని నిజానికి కామక్రోధాది గుణాలను కాశీలో వదిలివేయాలి.

ప్ర. దిష్టి తగిలింది, తీసెయ్యాలంటారు.. ఇది నిజమా? మూఢనమ్మకమా? దీనికి

శాస్త్రప్రమాణం ఉందా?

**– బొబ్బా సత్యనారాయణ,** నిజామాబాద్

**జ.** జీవుల దృష్టివిశేషాలు అనేక విధాలుగా ఉంటాయి. ఆయా జీవుల అంతరంగాలలోని సద్గుణ, దుర్గుణాలను బట్టి వారి చూపులలో విన్యాసాలు ఉంటాయి. కాబట్టి దృష్టిదోషం తీసి వేయడమన్నది అనాదిగా వస్తున్న ఆచారమే. అనంత సౌందర్యమూర్తియైన విష్ణుదేవుని అంద చందాలకు రాక్షసుల దృష్టిదోషాలు తగులకూడ దని పెరియాళ్వారు పాశురాలలో సంకీర్తనం చేస్తారు. ఇటువంటి అంశాలను బట్టి దృష్టిదోషం తీసివేయడమన్నది సంప్రదాయబద్ధమైన విశ్వా సమే. మూఢనమ్మకం కాదు.

**ప్ర.** ఉన్నతులు, పరిశుద్ధజీవనం గడిపినవారు అత్యంత దయనీయ స్థితిలో మరణిస్తుంటే, ద్రోహులు, క్రూరాత్ములు సునాయాస మరణం పొందుతున్నారు. దీనికి కారణం?

**– డా. శివభూషణం,** కర్నూలు

**జ.** సృష్టిలో జరుగుతున్న అనేక సన్నివేశాలకు ఇదమిత్థమైన కార్య కారణ సంబంధాలు నిర్ణయిం చలేం. ఉన్నతులు, పరిశుద్ధజీవనం గడిపిన వారు దయనీయ స్థితిలో మరణించినా ఉత్తమ లోకా లను చేరుకొని యుండవచ్చు. ద్రోహులు, క్రూరా త్ములు సునాయాసమరణం పొందినా అధోలో కాలకు వెళ్ళి యుండవచ్చు. మహాభారతంలోని స్వర్గారోహణ మహాప్రస్థానిక పర్వాలను అధ్య యనం చేయండి.

**ప్ర.** ఒకే తల్లి కడుపున పుట్టిన పిల్లల తలరా తలు, జీవితాలు విభిన్నంగా ఉండడానికి కారణ మేంటి?

**– బి. లక్ష్మి రంగరాజన్,** చెన్నై

**జ.** ఏ తల్లులైనా గర్భవతులై ఉన్నప్పుడు రామాయణాది కథాగానాలు శ్రవణం చేస్తే మంచి బిడ్డలు జన్మిస్తారన్నది సత్యం. తల్లిదం డ్రుల సంస్కారాదులను బట్టిగాని, పూర్వవాసన లను బట్టిగాని పిల్లల తలరాతలలో, జీవితాలలో వైవిధ్యం ఉండే అవకాశం ఉంది.

**ప్ర.** 'లంకలో అందరూ రాక్షసులే!' అనే సామెత ఎందుకు వచ్చింది? విభీషణుడు మంచి వాడేకదా?

**– యం.కె. మూర్తి,** సూర్యాపేట

**జ.** 'లంకలో అందరూ రాక్షసులే' అన్నది సాధారణంగా చెప్పే సామెత. అంతమాత్రాన ఒకరిద్దరు మంచివారు లేకుండా ఉండరు.

**ప్ర.** మంగళమంటే శుభకరం, శుభప్రదం.. మరి మంగళవారం శుభకార్యాలకు ఎందుకు పనికి రాకుండా పోయింది? ఆఖరికి ఆరోజు క్షురకర్మ కూడా నిషిద్ధమే ఎందుకు?

**– వి.వి. సత్యనారాయణశెట్టి,** తిరుపతి

**జ.** మంగళమంటే శుభకరం, శుభప్రదం అన్నది నిర్వివాదాంశం. ఆదివారం నుంచి శని వారం వరకు నవగ్రహాలలోని గ్రహాల నామధే యాలతో ఏర్పడినాయి. మంగళవారం కుజుని పేరుతో ఏర్పడింది. కుజుడు మానవాంగంలోని కేశపాశాలకు అధిపతి. అటువంటి గ్రహప్రసన్నత కోసం ఆరోజు క్షురకర్మ చేసుకోం. మంగళవారం, శుభకార్యాలు చేయకూడదన్నది నమ్మకం మాత్రమే. శాస్త్రబద్ధమైన ప్రామాణికాంశం కాదు.

**ప్ర..** ఆడపడుచులకు నూతన వస్త్రాలు, పసు పుకుంకుమలు కానుకగా ఇవ్వడం సంప్రదాయం. అనివార్యకారణాల వల్ల కొన్నిసందర్భాల్లో ఇవ్వలే కపోతే తిరిగి కొనసాగించవచ్చా? ఇక ఎప్పటికీ ఇవ్వకూడదా?

**– బచ్చు సత్యనారాయణ,** కొత్తగూడెం

**జ.** ఆడపడుచులకు నూతన వస్త్రాలు, పసుపు కుంకుమలు కానుకగా ఇవ్వడం గొప్ప సంప్ర దాయం. అనివార్య కారణాల వల్ల కొన్ని సంద ర్భాలలో ఇవ్వలేకపోయినా తిరిగి నిరాఘాటంగా కొనసాగించవచ్చు.

**ప్ర..** మంత్రాలయంలో ఉన్నది రాఘవేంద్ర స్వామి... మరి వీరరాఘవేంద్రస్వామి పేరుతో తమిళనాడులోని తిరువళ్లూరులో ఉన్నదెవరు?

**– తోటపల్లి శశికళాధర్,** గుంతకల్లు

**జ.** తిరువళ్లూరులోని వీరరాఘవ స్వామి దేవా లయం రామాలయం.

**ప్ర..** నవగ్రహాలకు ప్రదక్షిణలు చేసిన తరు వాత కాళ్లు కడుక్కోవాలా?

**– ఎస్. యశోద,** హైదరాబాద్

**జ.** నవగ్రహాలకు ప్రదక్షిణలు చేసిన తరువాత కాళ్ళు కడుక్కోవడం సంప్రదాయబద్ధమైన విశ్వా సమే. ఇతర దేవతా మూర్తులను సేవించడం లోను, నవగ్రహ మూర్తులను సేవించడానికి ఎలాగైనా తేడాలుంటాయి. ఇటువంటి పూజలు నిర్వహించడానికి తగిన సలహాలను నిష్ణాతులైన పండితుల నుండి స్వీకరించడం సముచితం. ©

# కాలాతీతం





మార్సెల్ ప్రూస్ట్

# రిమెంబ్రెన్స్ ఆఫ్ థింగ్స్ పాస్ట్

**కా**ర్క్‌తో దిగ్బంధం చేసుకున్న గదిలో 1911లో నవల తొలిభాగం 'స్వాన్స్ వే' ముగించాడు ప్రూస్ట్. అనేకమంది పబ్లిషర్లు దీన్ని చదివారుకాని, ఎవరూ ప్రచురించటానికి ఇష్టపడలేదు. చివరికి తనే స్వంతంగా 1913లో అచ్చేసుకున్నాడు ప్రూస్ట్. ఆరోగ్యం క్షీణించింది. ఇక తనెక్కువ కాలం బతకడని తెలిసి రచనావేగం పెంచాడు. రెండో భాగం 'వితిన్ ఎ బడ్డింగ్ గ్రోవ్' 1918లో ప్రచురితమై, 'ప్రీగాన్‌కోర్ట్' బహుమతి గెల్చుకుంది. 1920లో వెలుగు చూసిన మూడో భాగం 'ది గెర్మాంట్స్ వే'తో రచయితకు ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు వచ్చింది. 1922లో ఒక వైపు నిర్విరామంగా రాస్తూ, మరోవైపు ప్రూఫులు దిద్దుకుంటూ, ఉబ్బసం కాస్తా న్యూమోనియాగా మారటంతో మరణించాడు ప్రూస్ట్. మిగతా భాగాలన్నీ, రచయిత వదిలివెళ్లిన రాతప్రతులను ఆధారం చేసుకుని ప్రచురించినవే. ఆయన ఏడు భాగాల నవల సంక్షిప్త పరిచయం చూద్దాం..

మొదటిభాగం - స్వాన్స్ వే *(1913)*:



కథకుడు మార్సెల్ తన బాల్యాన్ని గుర్తు చేసుకుంటాడు. జ్ఞాపకాలకూ, సంగీత స్వరాలకూ పోలిక కనిపిస్తుంది. తల్లిదం డ్రులతో కాంబ్రే అనే వూళ్లో గడిపిన వేసవి సెలవులు. ప్రతిక్షణం తల్లి పక్కనుండా ల్సిందే. ఒకసారి స్వాన్ అనే అతిథి యింటికి వచ్చినప్పుడు, తల్లి తనను గదిలో కెళ్లి పడుకొమ్మని చెప్పింది. నిద్రపోయే ముందు ప్రతిరోజూ ఆమె తనకు గుడ్‌నైట్ చెబుతుంది. మాటల్లో పడి, ఈ రోజు ఆ విషయమే మరచిపోయింది. తల్లి జోకొట్ట కుండా తనకు నిద్ర ఎలా పడుతుంది? ప్రేమకు దూరమవుతానేమోననే భయం తో కుంగిపోతాడు. మనం ఓ మనిషిని ప్రేమిస్తాం. వాళ్లు మనను ప్రేమిస్తారు. కాని ఎప్పుడైనా ఈ బంధం తెగిపోతే? ఈ ఆందోళనలే మార్సెల్ జీవి తాన్ని అతలాకుతలం చేశాయి.

కాంబ్రేలో, చెట్లనీడల్లో, పచ్చటి పొలాల్లో కేరింతలు కొడుతూ పరిగెత్తిన క్షణాలు. పుస్తకంలో సగం కన్నా ఎక్కువ తను నడిచిన ఈ దారుల వర్ణనే. అందులో ఒక దారి పేరు 'స్వాన్స్ వే'. అక్కడ స్వాన్‌గారి భవంతి వుంటుంది. పందొమ్మిదో శతాబ్ది చివరి దశాబ్దంలో, ఫ్రాన్స్‌లో స్థిరపడుతున్న బూర్జువా సంస్కృతికి ప్రతీక స్వాన్ గారి సంపద. మరొకదారి 'గెర్మాంట్స్‌వే'. ఇక్కడో తాతల నాటి యిల్లుంటుంది. ఇది పతనమవు తున్న భూస్వామ్య వ్యవస్థకు చిహ్నం.

తల్లిదండ్రుల వెంట నడుస్తూ ఒకసారి స్వాన్‌గారి యింటిముందరి పూలమొక్కల్ని పరిశీలనగా చూస్తాడు. అప్పుడే దూరంగా ఆయన భార్య ఓడేత్, కూతురు గిల్బర్ట్ కనిపిస్తారు. ఆమె చిన్నపిల్లే. కాని ఆ క్షణాన్నే, మార్సెల్‌లో ప్రేమాంకురం చిగు రించింది. జీవితంలో అనేక అనుభవాలు తనను అనేక రకాలుగా ప్రభావితం చేసి వుండవచ్చు కాని ఆనాటి తొలిప్రేమను ఎప్పుడూ మరచిపోలేడు. తరువాత ఆ పిల్లతో సరదాగా ఆడుకొన్నాడు. ఏళ్లు గడి చాయి. మార్సెల్ మిత్రుడు సెయింట్ లూప్‌ను గిల్బర్ట్ పెళ్లాడింది. పెళ్లినాడు అతడు అందంగానే వున్నాడు. కాని క్రమంగా జుత్తు నెరిసింది. మనిషి లావె క్కాడు.

అనేక సంవత్సరాల తర్వాత, చిన్నప్పుడు తను ఎంతో యిష్టంగా తిన్న కేక్ మార్సె ల్‌కు గుర్తుకు వస్తుంది. దాని వాసన, రంగు, రుచి- టీలో ముంచి నాలికమీద పెట్టుకున్న ఆ అనుభవం వర్ణించలేనిది. మాటల్లో చెప్పలేనిది ఆ ఆనందం. కాంబ్రేలో ఆంట్ లిమోనీ యిచ్చిన కేక్ ముక్క అది. ఆ కేక్‌ను తలచుకుంటే మరెన్నో అను భవాలు ముప్పిరిగొం టాయి. తన బాల్యానికి కేంద్రబిందువు అది అనిపి స్తుంది.




అమ్మమ్మ తనను గారాబం చేసిందంటాడు మార్సెల్. తరచుగా విహార యాత్రలకు తీసికెళ్లింది. ప్రాచీన రచయి తలు, రచయిత్రుల గురించి చెప్పింది. తల్లి దండ్రుల మరణం తర్వాత, తనను పెంచిన ఫ్రాంస్వా కూడా అతడి జీవి తంలో ప్రధాన భూమిక పోషించింది. ఆమెకు చదువు రాదు కాని, తనను కంటికి రెప్పలా చూసుకుంది.

ఈ భాగంలో పాఠకులను బాగా ఆకట్టు కునే మరోపాత్ర మదాం వెర్దూరిన్. ఆమె కేమీ తెలియదుగాని అన్నీ తెలిసినట్టు మాట్లాడుతుంది. సంగీత, సాహిత్యాల గురించి తన 'విద్వత్తు'ను ప్రదర్శించి నవ్వు లపాలవుతుంటుంది.

# మార్సెల్ ప్రూస్ట్ (1871 - 1922)

ఎవరైనా రచయిత, జీవితకాల కృషిగా ఒకే ఒక్క నవల రాసి ప్రసిద్ధుడైతే, ఆ నవల లోని కథానాయకుడు అతడేనేమో అనుకునే ప్రమాదం ఉంది. మార్సెల్ ప్రూస్ట్ విషయంలో కూడా ఇదే జరిగింది. 'ఇది ఆత్మకథ కాదు, కేవలం ఊహ' అని అతడెన్నిసార్లు ప్రకటించినా, 'స్వానుభవం కాకపోతే ఇలా రాయటం అసాధ్యం' అన్నారు పాఠకులు.

ప్రూస్ట్ తండ్రి పారిస్ విశ్వవిద్యాలయంలో మెడికల్ ప్రొఫెసర్. తల్లి సంపన్న యూదు మహిళ. గొప్ప అందగత్తె. ఏ లోటూ లేకుండా గడిచింది బాల్యం. అతిగారాబంతో కుర్రాడు పాడైపోతాడనుకున్నారు. కాని తొమ్మిదేళ్లు నిండకుండానే ఉబ్బసం వ్యాధి అతణ్ణి నిర్వీర్యుణ్ణి చేసింది. దుమ్ముతో ఊపిరి సలపని స్థితి వస్తుంది గనక బయట తిరగటానికి లేదు. వెలుగూ, బయటి శబ్దాలు కూడా జబ్బు తీవ్రతను పెంచాయి. 'ఒక దశలో మందులే ఆహారంగా బతికాను' అంటాడు రచయిత.

అనేక జాగ్రత్తలు తీసుకుని స్కూలు చదువూ, సార్బొన్, పారిస్ విశ్వవిద్యాలయాల్లో 'లా' పూర్తి చేశాడు. తండ్రి బాగానే సంపాదిస్తున్నాడు గనక, అతడు ఉద్యోగం చెయ్యవలసిన అవసరం లేదు. సాహిత్యం పట్ల అభిరుచి కలిగింది. 'ఫిగారో' పత్రిక కోసం ఏదో ఒకటి రాశాను. హైసొసైటీ పరిచయాలతో కాలక్షేపం చేశాను. 1896లో ప్రచురించిన తొలి పుస్తకానికి, ప్రముఖ రచయిత ఆనతోల్ ఫ్రాన్స్‌తో ముందుమాట రాయించుకున్నాడు. ఆ రోజుల్లో ఇదో అరుదైన గౌరవం! మంచి పుస్తకం కావటం వల్లా, అంతకన్నా ముఖ్యంగా ప్రముఖ రచయిత ఫ్రాన్స్ ప్రశంస వల్లా మంచి గుర్తింపు వచ్చింది.

సమకాలికులు అతణ్ణి 'అహంభావి', 'స్వార్థపరుడు' అన్నారు. బహుశా అనారోగ్యం ప్రూస్టును అంతర్ముఖుణ్ణి చేసింది. కలుపుగోలుగా ఉన్నా, ఎవరితోనూ స్నేహం చెయ్యలేదు. అంటీముట్టనట్టుగా ఉంటూనే, మనుషుల్నీ, పరిసరాలనూ పరిశీలించటం అలవాటు చేసుకున్నాడు. ప్రాణాంతకమైన ఉబ్బసం వ్యాధి తన ఎదుగుదలకు అడ్డంకి కాలేదు సరికదా, అతణ్ణి అత్యుత్తమ రచయితను చేసింది.

ఇక స్వాన్ గురించి సుదీర్ఘంగా రాస్తాడు ప్రూస్ట్. ఇతడిది యూదు సంతతి. సంపన్నుడే. కాని ప్రేమోపహతుడు. నవలలోని మార్సెల్ పాత్ర రచయిత బాల్యానికీ, స్వాన్‌పాత్ర అతడు ఎదిగిన దశకూ ప్రతినిధులు అంటారు పాఠకులు. ప్రూస్ట్ ప్రేమ వ్యవహారాలకూ, స్వాన్ అనుభవాలకూ చాలా పోలికలు కనిపిస్తాయి. ఒక అతిసామాన్యమైన స్త్రీ ఓడేత్‌ను చూసి తన ఊహాసుందరిగా, ఊర్వశిగా వూహించుకుంటాడు స్వాన్. తను కలలుగన్న స్త్రీ కాదామె. కాని యవ్వనపు ఆకర్షణ అలాంటిది. తెలిసితెలిసీ, ఒక దశలో ఆమె వలలో పడతాడు. ఆమెతో సహజీవనం చేసి, ఒక కూతుర్నీ కంటాడు. పేరు గిల్బర్ట్. కేవలం కూతురికి చట్టబద్ధత కల్పించటం కోసమే తరువాతి దశలో సహజీవనం చేసినామెను పెళ్లాడుతాడు.

ఔత్సాహిక పాఠకులు ఈ మొదటి భాగం చదివి తృప్తి పడతారు. నిస్సందేహంగా 'రిమెంబ్రెన్స్' గొప్పదనం తెలుసుకోవటానికి ఇది ఉపయోగపడుతుంది.

రెండోభాగం - విథిన్ ఎ బడ్డింగ్ గ్రోవ్ *(1918)* : స్వాన్, ఓడేత్‌ల వైవాహిక జీవిత చిత్రణ వుంటుంది. 1890లలో ఫ్రాన్స్‌లో రాజకీయ దుమారం సృష్టించిన డ్రేఫస్ వ్యవహారం (మతద్వేషంతో ఒక యూదు సైనికాధికారి ఆల్ఫ్రెడ్ డ్రేఫస్‌పై సైనిక

అతడి తల్లి 1905లో హఠాన్మరణం పొందేంతవరకూ కొడుకును కంటికి రెప్పలా చూసుకుంది.

మొత్తం మీద ఆ సంవత్సరంలోనే అతడి జీవితం మలుపు తిరిగింది. ఒక అపార్టుమెంటులోకి మారి, ఇక శేషజీవితమంతా సాహిత్య కృషికే అంకితం చేయాలనుకున్నాడు. కాని జబ్బు ఎప్పుడు తిరగబెడుతుందో తెలియదు. దుమ్మూధూళీ, పువ్వుల పుప్పొడీ, వీధిలోని శబ్దాలూ ప్రవేశించకుండా కిటికీలు పర్మినెంట్‌గా మూసేశాడు. అదీ సరిపోక, కార్క్‌తో సౌండ్ ప్రూఫ్ చేశాడు. వంటచేస్తే వాసనలొస్తాయని, హోటల్ నుండి తెప్పించుకున్నాడు భోజనం. ఎప్పుడో అర్ధరాత్రివేళ, నగరం సద్దుమణిగిన తర్వాత, కొద్దిసేపు పాత మిత్రులతో గడిపి రావటం అలవాటు చేసుకున్నాడు. అది బలవంతపు ఏకాంతం. ఇక మిగిలిందేమిటి? జ్ఞాపకాలు తప్ప. అలా ప్రారంభమైంది ప్రపంచ సాహిత్యంలోనే శిఖరాయమానమైన నవల. నిడివిలో 'అరేబియన్ నైట్స్' కన్నా పెద్దది. దీని ఫ్రెంచి పేరు 'ఎ లా రెచెర్చ్ డు టెంప్స్ పెర్డు'. ఇంగ్లీషులో 'ఇన్‌సర్చ్ ఆఫ్ లాస్ట్ టైమ్స్' (గతించిన కాలాల కోసం అన్వేషణ). కానీ దీన్ని అనువదించిన స్కాట్ మాంక్రెఫ్ 'రెమెంబ్రాన్స్ ఆఫ్ థింగ్స్ పాస్ట్' అని పేరు పెట్టాడు. ఇప్పుడు ఇంగ్లీషు పాఠకులందరికీ ఇది ఈ పేరుతోనే పరిచయం. అనువాదాలు, మూలరచనలంత బాగుండవని ఒక అభిప్రాయం ఉంది. కాని స్కాట్ మాంక్రెఫ్ అనువాదం దీనికి మినహాయింపు.

ఇది జాయిస్ నవల 'యూలిసీస్'లాగ 'ఇనప గుగ్గిళ్లు' కాదు. మూలంలో పదహారు సంపుటాలు ఉన్న ఈ నవల ఇంగ్లీషులో ఏడు సంపుటాలుగా వెలువడింది. ఈ నవలను ఓపిగ్గా చదవగలిగితే సులభంగానే అర్థమవుతుంది. జీవితం గురించిన వ్యాఖ్యానం కాదిది. అనుభవాలను యధాతథంగా చిత్రించిన ఒక మహాకావ్యం.

ఉదాహరణకు సంగీత పాఠాలు బోధించే టీచర్ పిల్లలకు చక్కగా వివరించి చెబుతాడు. ఏది తప్పో, ఏది ఒప్పో మొదట నేర్చుకొమ్మంటాడు. కాని మహా విద్వాంసుడు, ఆ సంగీత ఝరిలో లీనమై శ్రోతలను తన ధ్వన్యాలోకంలో విహరింపచేస్తాడు. ఆ క్షణాన సంగీతకారుడుండడు. కేవలం సంగీత తరంగాలతో నిండిపోయి ఉంటుంది ప్రాంగణం.

"నా జీవిత నావకు చుక్కాని రచన. 'రెమెంబ్రాన్స్'లోని ప్రతి పదంలో నన్ను నేను పునరావిష్కరించుకున్నాను. ఇది కథకాదు. నా అన్వేషణ. నా నిష్కృతి" అన్నాడు ప్రూస్ట్.

రహస్యాలను చోరీ చేశాడనే అభియోగం మోపుతారు అధికారులు. ఎమిల్ జోలా, ఆనతోల్ ఫ్రాన్స్ వంటి ప్రముఖ రచయితల కృషితో డ్రేఫస్ అమాయకుడని రుజువయింది. దీని గురించి కూడా విస్తారంగా చర్చిస్తాడు రచయిత. యూదు తల్లికి పుట్టిన మార్సెల్, డ్రేఫస్ పక్షం వహిస్తాడు. కాని అతని మిత్రులకు డ్రేఫస్ దేశద్రోహి. మేధావుల డొల్లతనాన్ని చూపటానికి ఈ కేసును ఉపయోగించాడు ప్రూస్ట్.

చిన్నప్పుడు పరిచయమైన ఆల్బర్టైన్ కథలో తిరిగి ప్రవేశిస్తుంది. క్రమంగా ఆమె ప్రేమలో పడతాడు మార్సెల్. అంతకు ముందు గిల్బర్ట్‌తో కూడా యిలాగే జరిగింది.

మూడోభాగం - గెర్మాంట్స్‌వే *(1920)* :

మదాం, గెర్మాంట్ వారి అరిస్టోక్రాటిక్ బంధుమిత్రుల గురించిన కథ యిది. చిన్నప్పుడెప్పుడో ఆమెను దూరంగా చూసిన మార్సెల్, ఆమె అభిమానుల బృందంలో చేరతాడు. మరోపాత్ర రాబర్ట్, ది సెయింట్ లూప్ ప్రేమ కలాపాలు కూడా సుదీర్ఘంగా చిత్రిస్తాడు రచయిత. మార్సెల్ అమ్మమ్మ మరణిస్తుంది. ఇది అతడి మనసును తీవ్రంగా గాయపరుస్తుంది. మరొక పాత్ర ఛార్లెస్, ది బేరన్. ఇతనొక పర్వర్ట్. హోమోసెక్సువల్. శాడిస్టు. మాసోచిస్టు. అహంకారి.

నాలుగోభాగం - సిటీస్ ఆఫ్ ది ప్లెయిన్ *(1920-23)* : ఛార్లెస్ విపరీత స్వభావాన్ని గురించిన విశ్లేషణ యిందులో ప్రధానాంశం. అన్నీ తెలిసినవాళ్లు, మేధావులు, సంస్కారవంతులు కూడా యింతగా పతనమైపోగలరా? వీళ్ల దృష్టిలో నీతికీ, అవినీతికీ తేడా వుండదా? ఒక యువ సంగీతకారుడు మోరెల్‌తో సంబంధం పెట్టుకుంటాడు ఛార్లెస్. మార్సెల్-స్వాన్ సంబంధానికిది పూర్తి విరుద్ధమైనది. కాని అందరూ మనుషులే. కోరికలలో, వుద్వేగాలలో, ఆకర్షణలలో ఎందుకింత తేడా? మరోచోట వింటూల్ అనే సంగీతకారుని స్వరాలు విని మదాం వెర్దూరిన్ ఆనంద పారవశ్యంలో మునిగిపోవటం గురించి కవితాత్మకంగా వర్ణిస్తాడు ప్రూస్ట్.

ఐదోభాగం - ది కాప్టివ్ *(1923)* : ఆల్బర్టైన్ ఆకర్షణలో మార్సెల్ చిక్కుకుపోవటమే యిందులోని కథ. తన ఆధీనంలో వుంచుకోవచ్చునని ఆమెను తన అపార్టుమెంట్‌కు రప్పించుకుంటాడు. కాని ఆమె మరో ఫ్రెండు ఆండ్రీతో షికార్లకు వెళుతుంది. ఇదో వింత పరిస్థితి. అపార్టుమెంట్‌లో, ఆమెపై పూర్తి అధికారం తనదే అనుకున్నాడు. కాని యిప్పుడు నిరంతరం ఆమె కటాక్షవీక్షణాలకోసం నిరీక్షిస్తున్నాడు. ఆరోగ్యం పాడవుతుంది. ఇల్లు విడిచి కదలలేడు. బాధతో, అసూయతో, నిస్పృహాయంగా గడుస్తాయి రోజులు. మార్సెల్ పనిమనిషి ఫ్రాంస్వాకు ఆల్బర్టైన్ ప్రవర్తన నచ్చదు. ముగ్గురి మధ్యా, పరస్పరం ప్రేమ, అనుమానం కొనసాగుతుంది. ఆల్బర్టైన్‌ను ప్రేమించాలనుకోవటంలో వున్న ఆనందం, కలిసి వుండటంలో లేదని గ్రహిస్తాడు మార్సెల్. ఆమెకు స్వలింగసంపర్కం పట్ల మోజు ఉందని కూడా తెలుస్తుంది. ఈ సంబంధం యిక కొనసాగదని తెలుసుకుని ఆల్బర్టైన్ నిష్క్రమిస్తుంది.

ఆరోభాగం - ది స్వీట్ చీట్‌గాన్ *(1925)* : ఇప్పుడు ఆల్బర్టైన్ లేదు. క్రమంగా బాధ తీవ్రత తగ్గుతుంది. వెలితి కాస్తా నిరాసక్తతగా మారుతుంది. ఆల్బర్టైన్‌తో గడిపిన క్షణాలకన్న, ఆమె గురించి ఆలోచించటంలోనే ఎక్కువ ఆనందం అనుభవిస్తాడు. కొద్దిరోజులలోపే ఆమె ఓ ప్రమాదంలో మరణించిందని తెలుస్తుంది. ఒకప్పుడు ఆమెను ప్రాణప్రదంగా ప్రేమించాడు. ఆమె లేదనుకుంటే ప్రాణం విలవిల్లాడింది. మనుషులు ఎప్పుడూ మనతో వుండరు. వాళ్ల స్మృతి వెంటాడుతుంది. ఆమె తనను మోసం చేసిందని గుర్తు చేసుకుంటే, బాధ తగ్గినట్టనిపించింది.

చివరిభాగం - ది పాస్ట్ రీకాప్చర్డ్ *(1927)* : మొదటి ప్రపంచ యుద్ధ పరిణామాలు యిందులో ప్రధానాంశం. మొదటి ఆరు భాగాలలో దర్శనమిచ్చిన పాత్రల ప్రవర్తనకు, పరిణామాలకు హేతుబద్ధత చూపిస్తాడు రచయిత. ఆల్బర్టైన్, ఒక లెస్బియన్ అని రుజువు దొరుకుతుంది. కాంబ్రేలో తను ఆనాడు తొలిసారిగా చూసిన స్వాన్‌గారి ఎస్టేట్‌లో యిప్పుడు సెయింట్ లూప్ వుంటున్నాడు. ఛార్లెస్ మరింత దిగజారుతాడు. అందరికీ అతడో చీడపురుగు. మార్సెల్ జీవితం అనివార్యంగా, అనూహ్యంగా మారిపోయింది. మదాం గెర్మాంట్ మరణంతో, ఆమె భర్త, చవకబారు మనిషిగా అందరికీ తెలిసిన మదాం వెర్దూరిన్‌ను వివాహం చేసుకుంటాడు- కేవలం డబ్బుకోసం. స్వాన్ కూడా మరణిస్తాడు. 'ఓడేత్' సొసైటీ లేడీగా ఎదుగుతుంది. మనుషులు, పరిసరాలు, శాశ్వతం కాదు. మార్పు అనివార్యం. మనుషులున్నన్నాళ్లూ వాళ్లను వెంబడించేవి జ్ఞాపకాలే. మనసులో సృష్టించుకున్న లోకమే మన వెంట వుంటుంది.





'ఈ నవల ఒక ఎపిస్టమాలజీ (జ్ఞాన శాస్త్రం) పరిశోధన' అన్నారు విమర్శకులు. 'బాహ్య ప్రపంచానుభవాన్ని పంచేంద్రియాలు ఎలా గ్రహిస్తాయి?' అని తెలుసుకోవాలనుకున్నాడు ప్రూస్ట్. అయితే అతడు తాత్వికుడు కాదు. ఒక నవలాకారుడిగా చేసిన అధ్యయనమిది. ప్రూస్ట్ దృష్టిలో, ఏ విషయమైనా, అనుభవించిన క్షణాన దానికి విలువ లేదు. జరుగుతుందనే ఆందోళన, నిరీక్షణ లేదా, తరువాత అది జ్ఞాపకంగా మిగిలినప్పుడు మాత్రమే మనకు దాని విలువ తెలుస్తుంది. అనుభవంలోని బాధ, ఆనందం స్మృతిలో పునః సృష్టి చేసుకుంటాం మనం. కాకతాళీయంగా జరిగిన ఒక సంఘటన అనేక జ్ఞాపకాలకు తెరతీస్తుంది. దీన్నే మానసిక శాస్త్రజ్ఞులు 'అసోసియేషన్' అంటారు. అలా, ఆ క్షణాన అర్థం లేనివిగా కనిపించిన సంఘటనలతోనే మనం అద్భుత స్మృతిహార్మ్యాలు నిర్మించుకుంటాం. స్మృతి అంటే ప్రత్యామ్నాయ జీవితం.

ఫ్రెంచి తాత్వికుడు హెన్రీ బెర్గ్‌సన్ (1859-1941) రచనలతో ప్రభావితమైన ప్రూస్ట్ కాలాన్ని ఆద్యంతాలు లేని ఒక ప్రవాహంలా చూశాడు.

కాలం స్థిరంగా వుండదు. అది సాపేక్షం. కొన్నిసార్లు కుంచించుకుపోతుంది. కొన్నిసార్లు వ్యాకోచం చెందుతుంది.

కవిత్వ పరిభాషలో రాసిన ఈ నవలను చదవటం కొందరికి వ్యసనంగా మారింది.

"అప్పుడప్పుడూ విసుగొచ్చినా సరే, ప్రూస్ట్‌ను తప్ప మరొక ఫ్రెంచి రచయితను చదవటం నాకిష్టం ఉండదు. వచనంతో అతడు మ్యాజిక్ చేశాడు" అన్నాడు ప్రసిద్ధ రచయిత సోమర్సెట్ మామ్.

– ఎం. వసంత

అన్నీ సరైన సమాధానాలు రాసిన
వారిలో డ్రా ద్వారా ఎంపికైన
ఈ విజేతకు రూ.150/–
త్వరలోనే అందుతాయి.

**జి. ప్రభాకర్‌రావు**
ప్లాట్. నెం. 208, డి. బ్లాక్,
మే ఫ్లవర్‌పార్క్, అపార్ట్‌మెంట్స్
మల్లాపూర్, హైదరాబాద్-76

## చతురంగం - 27 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 వి | జ | 2 య | | 3 మం | ద | 4 సం | | 5 వా | 6 జీ |
| భ | | 7 ము | రు | గా | | 8 ఘం | 9 టా | రా | వం |
| 10 వ | 11 రు | డు | | 12 పు | 13 రం | | 14 బే | ల | |
| | క్మి | | 15 క | ర | వా | లం | | 16 బ్బా | అ |
| 17 వా | ణి | 18 జ్యం | | 19 ము | రా | | 20 ర | య్ | |
| య | | 21 ఆ | 22 లి | | 23 పా | 24 త | వి | | 25 పా |
| 26 సం | 27 గు | | 28 పి | 29 కం | | ప్పు | | 30 వే | ప |
| | 31 రి | 32 క్లా | | 33 ది | 34 వా | | 35 బ | లం | |
| 36 జా | విం | రం | 37 మ | | 38 ర | వి | క | | 39 యో |
| 40 డ | ద | | 41 ఉ | ద | ధి | | 42 ము | ల్లం | గి |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. చుండూరు అప్పల నరసింహం, బెంగళూరు, 2. గరికిపాటి ఇందిరాతు షారా, కాకినాడ, 3. శివలెంక విజయభాస్కర్, హైదరాబాద్, 4. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, 5. జె.ఎస్. ఉమాదేవి, విశాఖజిల్లా, 6. పి. నాగేశ్వరి, తుని, 7. తల్లాప్రగడ మధుసూదనరావు, బెంగళూరు, 8. సి. నిర్మల, తిరుపతి, 9. ఎస్. మణిమేగలై, తిరుపతి, 10. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 11. తటవర్తి రామకృష్ణ, హైదరాబాద్, 12. కొండుపర్తి జగదంబ, సికింద్రాబాద్, 13. తిప్పావఝుల వెంకటనారాయణ, హైదరాబాద్, 14. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 15. వి.వి. సత్యనారాయణశెట్టి, తిరుపతి, 16. షేక్ నజీర్‌బాషా, కోట, నెల్లూరు జిల్లా, 17. వి. దేవేంద్ర, హైదరాబాద్, 18. బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం, 19. సి. జనార్దనసింగ్, నల్లకుంట, 20. పి.ఆర్. నాయుడు, తిరుపతి, 21. కె.వి.ఎన్. పల్లవి, కావలి, నెల్లూరు జిల్లా, 22. కె.వి. దుర్గామోహన రావు, వనస్థలిపురం, 23. పాలకుర్తి సుధీర్ కుమార్, హైదరాబాద్, 24. పాలగుమ్మి విశ్వనాథం, సికింద్రాబాద్, 25. నెల్లుట్ల ప్రేమలత, నిజాంపేట, 26. ఐవిఎల్. నరసింహారావు, ఫిల్మ్‌నగర్, 27. తల్లాప్రగడ భాస్కరరావు, హైదరాబాద్, 28. గౌతమి శిష్టా, హబ్సిగూడ, 29. కె.వి. లక్ష్మణరావు, మానేపల్లి, తూ.గో. జిల్లా, 30. బి. శాంతి, విజయవాడ, 31. జె. వసంత, ట్రూప్‌బజార్, 32. వి. సీతానరసింహారావు, విజయవాడ, 33. గేదెల రామారావు, ఏలూరు, 34. ధరణి పద్మాసన, హైదరాబాద్, 35. పి.వి. రమణరావు, మల్కాజ్‌గిరి, 36. పి. దేవసేనమ్మ, హైదరాబాద్, 37. ఎ. అశ్రిత్ సుషేణ్, విశాఖపట్నం, 38. సురేందర్ రావు నోముల, హబ్సిగూడ, 39. గుర్రాల పద్మావతి, కూర్మన్నపాలెం, 40. సి. రాధాకృష్ణ, శ్రీకాకుళం, 41. కృష్ణకుమారి దైతా, హైదరాబాద్, 42. కె. లక్ష్మినారాయణ, నిజామాబాద్, 43. పి.వి. రవికుమార్, తిరుపతి, 44. బి.యస్. రంగ, తాడేపల్లిగూడెం, ప.గో. జిల్లా, 45. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, తూ.గో. జిల్లా, 46. ఆంధ్ర అచ్యుత రామయ్య, తణుకు, 47. వి. అయోధ్య రామారావు, కుత్బుల్లాపూర్, హైదరాబాద్, 48. రామకూరు. లక్ష్మి, శ్రీకాకుళం, 49. కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం, 50. ఆర్.ఎస్.ఎస్. పంతులు, కాట్రేనికోన, 51. లక్ష్మణరావు మంచాళ, విశాఖపట్నం, 52. అక్షింతల సంజీవశర్మ, అనంతపురం, 53. బి.వి. రవికుమార్, తెనాలి, 54. యు. విజయశేఖర రెడ్డి, కూకట్‌పల్లి, 55. సి. విజయభాస్కర్ రెడ్డి, ప్రొద్దుటూరు, 56. సిహెచ్.వి.ఎస్.ఎల్ రాజేశ్వరి, కాకినాడ, 57. ఉపద్రష్ట నరసింహ మూర్తి, లాలాపేట, సికింద్రాబాద్, 58. పొనుగోటి నరసింహారావు, టోలిచౌక్, హైదరాబాద్, 59. సరిపల్లి నాగభూషణరావు, విజయనగరం, గరికిపాటి శ్రీచైతన్య కృష్ణ, కాకినాడ, 60. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 61. కాకర్లమూడి రామలింగమూర్తి, తణుకు, 62. సి.హెచ్. సాలమన్, కొండాపురం, కడప జిల్లా, 63. పి. లక్ష్మీప్రసన్న, హైదరాబాద్, 64. టి. శ్రావణి రాఘవేందర్, రాజంపేట కాలనీ, మెదక్ జిల్లా, 65. అనంతుల సుబ్బారావు, గుంటూరు, 66. డి. వసుంధర దేవి, కాకినాడ, 67. ఇందన మల్లికార్జున్ రావు, తంగెళ్లమూడి, ఏలూరు, 68. వి.వి. నారాయణ శాస్త్రి, హైదరాబాద్, 69. డాక్టర్ శివభూషణం, కర్నూలు, 70. శ్రీమతి పక్కి సుందరీకృష్ణ, గరివిడి, విజయనగరం జిల్లా, 71. జి.వి. రాఘవేంద్ర రావు, బెంగళూరు, 72. అరుణరేఖ ముదిగొండ, బెంగళూరు, 73. ప్రమోద్‌కుమార్ సింగరాజు, హైదరాబాద్, 74. ఎ. వెంకట శివారెడ్డి, యర్రగుంట్ల,

.......

# చతురంగం - 28 ఆధారాలు

## అడ్డం

1. శివం కాదు.. శవం కాదు.. బాల్యం (3)
3. మొసలి (3)
6. ఇటీవల భారత్‌లోకి చొచ్చు కొచ్చిన పొరుగు దేశం (2)
8. మోసం (2)
10. ఉప్పు (3)
13. మూడింటి సమూహం (3)
14. మన్మథుని భార్య (2)
16. ముఖం (4)
18. మృతదేహం (2)
20. సగం (2)
22. బాధపడు, దుఃఖించు (3)
24. వెంకటేష్, ట్వింకిల్ ఖన్నా, రాశి నటించిన సినిమా (2)
26. శ్రీనాథుడి శివరాత్రి మాహాత్మ్యంలో ప్రధానపాత్ర (4)
29. జలదము (3)
31. నెల (2)
33. సుగ్రీవుని భార్య (2)
35. 'త' గుణింతంలో మొదటి మూడు (3)
37. మర కాదు, నవరత్నాల్లో ఒకటి (4)
40. కోతికదా అటుఇటూ దుమికింది (3)
42. నీటిబుడగ (3)
43. ముఖం (2)
44. రహస్యం (2)
45. భారతీయస్త్రీలు ఎక్కువగా కట్టుకునేది (2)

## నిలువు

1. పర్వతం (2)
2. నూరు (2)
4. పూజలో ఉపయోగించే కడవ, చెంబు తడబడింది (4)
5. దేవుడిచ్చేది తిరగబడింది (2)
7. స్త్రీ (2)
9. గొంతు, శరీరం (3)
11. యుద్ధం కదా తిరగబడింది (2)
12. అరిషడ్వర్గాల్లో ఒకటి (3)
15. ఎక్కువ కిందనుంచి (2)
16. శ్రీనివాసుని కన్నబిడ్డలా ఆదరించిన భక్తురాలు (5)
17. పార్వతి ఈ పిండితో బొమ్మను చేసింది (3)
19. 'లేడీస్ టైలర్' దర్శకుడు (2)
21. శకటం (3)
23. యుద్ధమే (2)
25. దేహం.. తలకిందులు (2)
27. సరస్వతి వాద్యం తలకిందులు (2)
28. నెత్తురు కదా గందరగోళమైంది (4)
30. గొప్ప (2)
32. బిడ్డలు (4)
34. తికమక రెండో సగం (2)
36. 'స్థిరం' వికృతి (2)
38. శ్రుతికోసం ఉపయోగించే వీణలాంటి వాద్యం (3)
39. ధర్మరాజు సంపదలు ఎందులో పోగొట్టుకున్నాడు? (3)
41. ఏరులాంటిదే (2)

**నిబంధనలు**

✦ చతురంగాన్ని అదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్లైనా పంపవచ్చు ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు

★ చతురంగం, చతురప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం.

# చతురంగం - 28

రూ.150/- బహుమతి

గడువు తేది : జులై 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 వం | | 3 | 4 | 5 | | 6 | 7 |
| | | 8 | 9 | | 10 | | 11 | | |
| | 12 | | 13 | | | | 14 | 15 | |
| 16 | | 17 | | | 18 | 19 | | 20 | 21 |
| 22 | | | | 23 | | 24 | 25 | | |
| | | 26 గు | 27 | | 28 | | 29 | 30 | |
| 31 | 32 | | | | 33 | 34 | | | |
| 35 | | 36 | | 37 | ర | | 38 | | 39 |
| | 40 | | 41 | | | | 42 బు | | |
| 43 | | | 44 | | | 45 | | | |

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (    ) చిరునామా : ------------------------------

------------------------------------------------------------

---------------- పిన్ : ----------- ఫోన్ : ---------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. www.eenadu.net.

# విపుల, చతురలకు అభినందనలు



ప్రయాణాలలో నేను 'చతుర', 'విపుల' పత్రికలనే చదువుతాను. ఇవి కాలక్షేప సాధనాలుగా కాకుండా, సమకాలీన సామాజిక జీవన విజ్ఞాన సర్వస్వాలుగా ఉంటాయి. వివిధ జీవన పార్శ్వాలను విస్తృతమైన కథా ఇతివృత్తాలను 'చతుర' నవలలు ఆవిష్కరిస్తున్నాయి. అలాగే ప్రపంచవ్యాప్తంగా మానవ స్వభావాల్లోనూ, సంబంధాల్లోనూ, విలువల్లోనూ సంభవిస్తున్న పరిణామాలను, 'విపుల' కథలు చక్కగా చిత్రిస్తాయి. అందుకే ఈ పత్రికలకు మా కుటుంబ సభ్యులందరూ పాఠకులే.

సమర్థులైన పరిశోధక విద్యార్థులు దొరికితే ఈ పత్రికల సాహిత్యకృషిపై పి. హెచ్. డి పరిశోధనలు చేయించాలన్న సంకల్పం ఉంది. లాభాపేక్ష లేకుండా, అందుబాటు ధరలో విలువైన నవలా, కథా సాహిత్యాన్ని తెలుగు ప్రజలకు అందిస్తూ, పాఠకుల్లో సాహిత్యాభినివేశం, తద్వారా చిత్త సంస్కారం పెంపొందిస్తున్న సంపాదక వర్గానికీ, యాజమాన్యానికీ శుభాకాంక్షలు.

**– డా. ఎస్వీ సత్యనారాయణ, హైదరాబాద్.**

# ఆ నిబద్ధత ఓ అద్భుతం!



నా మొదటి నవల 'సహజం' 1986 జనవరి 'చతుర'లో ప్రచురితమైంది. ఆ తర్వాత ఒక్కటి తప్ప నా నవలలన్నీ 'చతుర'కే పంపేదాన్ని. ఎందుకంటే ఈ పత్రికలో ఎంపికయితేనే నవలలకు గౌరవమనే భావం నాకు ఉంది. ముఖ్యంగా ఎనభయ్యో దశాబ్దం చివరిసగంలో క్షుద్ర సాహిత్యం విజృంభించి అన్ని పత్రికలనూ ఆక్రమించింది. ఆ సాహిత్యానికి తలుపులు మూసి, మంచి నవలాభిరుచి గల పాఠకులకు 'చతుర' గొప్ప నేస్తమయింది. సాహితీ విలువలను కాపాడింది. నా నవలలు 'స్వేచ్ఛ', 'కన్నీటి కెరటాల వెన్నెల', 'మానవి', 'గులాబీలు' 'చతుర'లోనే వచ్చాయి. తెలుగు నవలా సాహిత్యానికి చతుర చేసిన, చేస్తున్న కృషి అభినందనీయం. అనువాద ప్రక్రియను ప్రోత్సహించటం, ప్రపంచంలోని మంచి కథలతో తమ కథలను పోల్చుకునే అవకాశం తెలుగు రచయితలకు కల్పించటం ద్వారా అంతర్జాతీయ కథా వేదికగా 'విపుల' ఎన్ని విధాలుగానో తన ఉనికిని సార్థకం చేసుకుంటున్నది. యాజమాన్యమూ, నిర్వాహకులు ఎంతో నిబద్ధతతో, బాధ్యతతో ఉంటే తప్ప జరగని ఒక అద్భుతం 'చతుర', 'విపుల'ల ప్రచురణ!

**– ఓల్గా, రచయిత్రి, మైసూర్**

# అది చతుర, విపులలు పెట్టిన భిక్ష



1980 నాటి మాట. ఏజీ ఆఫీసులో చేరి పదేళ్లయింది. ఒకసారి ఆఫీసులో జరిగిన కథాసదస్సులో ప్రముఖ రచయితలు తమ కథల మీద అనుభవాలు వెల్లడించారు. 'ప్రతి ఒక్కరూ రచయిత కావచ్చు. ప్రయత్నించండి' అని సలహా ఇచ్చారు. అప్పటికే నన్ను 'చతుర' 'విపుల' పత్రికలు బాగా ఆకర్షించాయి. వాటిని చదువుతుంటే నాకూ రాయాలనే అభిలాష కలిగేది. చతురలో ఏరినముత్యాలు, ఇతర శీర్షికలు చదవడం, విపులలో తెలుగు కథలతోపాటు అనువాద కథలను ఆస్వాదించడం అలవాటయింది. తర్వాత ఎలాగోలా రచనలు చేయడం ప్రారంభించాను.

తర్వాత నాలుగేళ్లలో దాదాపుగా నావి ముప్పై కథలు ప్రచురితమయ్యాయి. 1985 జనవరిలో మొదటి నవల, 1989 మేలో రెండో నవల ప్రచురితమయ్యాయి. చతుర, విపులలో నేను చదివిన నవలలు, కథలు నన్ను కూడా రచయితని చేశాయి. నేను రచయితగా మారడం చతుర, విపులలు పెట్టిన భిక్షగానే భావిస్తాను.

**– భమిడి వెంకటేశ్వర్లు, హైదరాబాద్**

